


సచిత్ర సహజ వైద్య మాస పత్రిక

# సిల్వర్ జూబిలీ సంచిక

డిసెంబరు
1943

ఈ సంచిక
రు 1-0-0
బెజవాడ

# విషయసూచిక



# FELICITATIONS


L. KAMESWARA SARMA, M. A.,
OF H. H. THE MAHARAJA'S COLLEGE,
PUDUKKOTHA


*Camp:* TRIVENDRAM.

29 -12--43

Dear Dr. P. Venkatramayya,

I am only too pleased to send my hearty felicitations to the Silver Jubilee Number of your Telugu monthly 'Prakriti'. Twenty five years of very useful service it has done. You can really be proud of the same I wish to take this opportunity to sound a note of warning to our brethren. Our enemies are becoming more and more powerful. They are making inroads on our personal freedom in all directions. There is only one remedy for this. We have to invent a new democracy, a limited democracy, where Authority shall not be held sacred and unquestionable. 'Prakriti' must grow more and more in size and numbers. I pray to God to grant it a long and useful life.

Yours in Natural therapeutics

**L. Kameswara Sarma.**



డాక్టరు, పుచ్చా వేంకటరామయ్యగారు, N. D.

ప్రకృతిపత్రికా సంపాదకులు.

సంవత్సర చందా రు 3-0-0

# ప్రకృతి

సహజవైద్య సచిత్ర మాసపత్రిక

సంపుటము 25 | బెజవాడ | సంచిక 12

డిసెంబరు నెల, 1943

## సిల్వర్ జూబిలీ సంచిక



ఈ సంచికతో ప్రకృతి పత్రికయొక్క 25 వ సంపుటము పూర్తి అయినది. ఇంతవరకు అభిమానులుగను, పాఠకులుగను, చందాదారులుగను, వ్యాసలేఖరులుగను, ఇతర విధములను మాకు సహాయపడినవారి కెల్ల మా కృతజ్ఞతను తెలుపు చున్నాము. మీ అందరి తోడ్పాటుతోను ప్రకృతి పత్రిక తన 25వ సంవత్సరమును ఆనందముగ గడపినది. ఇకముందు గూడ మీరెల్లరు మాకు నితోధికముగా తోడ్పడగోరు చున్నాము. మేము అనుకొనినదానికన్న నిప్పటికే సంచిక యొక్క పరిమితి పెరిగినందున వచ్చిన వ్యాసముల నెల్ల ప్రచు రింపజాలకపోతిమి. ఇకముందు సంచికలోనైనా వానిని ప్రచురించ ప్రయత్నింతుము. ఈకాగితపు కాటకములో నింతమాత్రమైనను సిల్వర్ జూబిలీ సంచికను మేము ప్రచు రింపగలుగుటకు తోడుపడిన ఆంధ్ర గ్రంథాలయ ప్రెస్ వారి సహాయమును మిక్కిలికొనియాడు చున్నాము. అనివార్యము లగు కారణములవలన ప్రకృతి సిల్వర్ జూబిలీ సంచిక మీకు అందజేయుటకు మితిమీరిన కాలవిలంబనమైనది. మన్నింపవలెను. 1944 సంవత్సరములో ఈ పత్రిక సంచికలనుగూడ నికముందు వెంటవెంటనే ప్రచురింతు మని మనవి చేయు చున్నాము.

పుచ్చా వేంకట్రామయ్య.

సంపాదకుడు.

# సందేశములు

## ౧

శ్రీ ప్రకృతిపత్రిక సంపాదకులకు నా వందనములు.

మహాశయా! ప్రకృతి పత్రిక యీ 25 సంవత్సరములనుంచి ఆంధ్రదేశమునకు చేసిన సేవ నుగ్గడించుటకు తరముకాదు. నేను మీ పత్రికకు షుమారు 20 ఏండ్లుగా చందాదారునిగా నున్నాను. మీరు సంపాదకులయిన నాటనుండి ఎంత నిపుణతతోను చక్కగాను మీరు దానిని నడపునది, ప్రకృతిచికిత్సాభిమానులగు నా బోటివారికి తెలియును. మీ దీక్షకు, స్వార్థ రాహిత్యమునకు నేనెంతయు మిమ్ముల నభినందించుచున్నాను.

మీ పత్రిక దినదినాభివృద్ధి గలిగి ఆంధ్రలోకమునకు ప్రకృతిమాతకు మరింత సేవచేయుగాక అని నా హృదయపూర్వకసందేశము, ఆశీస్సు పంపుచున్నాను.

వవ్వేటి విశ్వనాథరావు.
అడ్వకేటు అండ్ పబ్లిక్ ప్రాసిక్యూటర్, నెల్లూరు.

## ౨

### ప్రకృతి ఆశ్రమం, కేశవరం

ప్రకృతిపత్రిక విజయవంతముగ, రజతోత్సవము జరుపుకొను చున్నందులకు ఎంతయు సంతసము. ఈ పవిత్రపత్రికారాజమును మానవసేవ చేయుటకై ప్రచురించుటయందు నిరంతర శ్రమలకోర్చి తుదకు వారి ప్రాణధనములను ఈ పవిత్రప్రకృతిసంస్థకొఱకు అర్పించిన కీర్తిశేషులగు నారిశెట్టి హనుమయ్యనాయుడుగారికిని, వారికి చేదోడు వాదోడుగా నుండి సర్వవిధముల ఈ సంస్థకు తన ప్రాణధనము లర్పించిన కీ॥ శే॥ రాలగు జ్ఞానాంబగారికిని, దయామయుండైన సర్వేశ్వరుఁడు వారి యాత్మలకు శాంతినొసంగి, ఆ పవిత్రమూర్తుల త్యాగధనమైన ఈ ప్రకృతి పత్రికారాజమును చిరస్థాయిగా మానవసేవచేయులాగు భగవంతుఁ డనుగ్రహించుగాక యని ప్రార్థించుచున్నాను. కీ॥ శే॥ లయిన నాయుడుగారి అనంతరము ఈ పత్రికారాజమునకు సంపాదకత్వము వహించి, నిరంతరశ్రమల కోర్చి, మానవజాత్యుద్ధరణమే ఆదర్శముగా గొని ఈ పత్రికారాజమును సర్వాంగసుందరముగ ప్రజానీకమున కందచేయుచూ తద్ద్వారా కృత్రిమ నాగరికతావ్యామోహముసంబడి దరిగానక తపించుచున్న వ్యాధిపీడితమానవజాతిసముద్ధరణార్థమై విఘ్నములను లెక్కచేయక, ఈ పవిత్రోద్యమమును నిర్వహించుచున్న శ్రీ శ్రీ శ్రీ పుచ్చా వెంకట్రామయ్యగా రెంతయు వందనీయులు. ఈ పత్రికారాజము మున్ముందు ప్రతి కుటుంబమునందు ప్రకృతివిజ్ఞానాంకురములను వెదచల్లి రోగరహితమైన ప్రాకృతజీవన విధానమును చేకూర్చి మానవజాతి నుద్ధరించులాగు సర్వేశ్వరుం డనుగ్రహించుగాక. ఈపత్రికారాజము పూజ్యులైన శ్రీ పుచ్చా వెంకట్రామయ్యగారి సంపాదకత్వముననే ముందు స్వర్ణోత్సవము కూడ జరుపుకొనులాగు దైవ మనుగ్రహించుగాక. శ్రీ వారు ఈ పత్రికామూలమున చేసిన సేవ లోకవిదితమే. ఆంధ్రావనియందు అచ్చటచ్చట ప్రకృతి వైద్యాలయములు వెలసి, మానవ సేవ చేయుచున్నవన్న ఈ ప్రకృతి సంస్థయే మూలకందముకదా! ఈ సంస్థ పోషణార్థమై ప్రతి భారతీయుఁడు శక్త్యనుసారము సహాయముచేయుట తమను తాము ఉద్ధరించుకొనుటయే యని తెలిసికొని విధిగా సహాయముచేయ ప్రార్థితులు. ఈ పత్రికారాజ మాచంద్రార్కస్థాయిగా విలసిల్లునట్లు భగవంతు డనుగ్రహించుగాక.

డా. వేగిరాజు కృష్ణంరాజు, కేశవరం ఆశ్రమాధిపతి.

# అభినందనములు

## ౧

ప్రకృతిమాతను సేవించి ఆరోగ్యభాగ్యసుఖానందముల బొందు మానవులకు "వరప్రసాదిని"యై యలరారు 'ప్రకృతి' పత్రికారాజ మిరువదియైదేండ్లపాటి యము గలదియై నేటివరకు అవిచ్ఛిన్నముగా ప్రజాసేవ చేయుచున్నందులకు తత్పత్రికాధిపతులగు డా. పుచ్చా వెంకటామయ్య, అయ్యంకి వెంకటరమణయ్యపంతులుగార్లు లోకవందనీయులు. పత్రికాస్థాపకులగు కీ. శే. నారిశెట్టి హనుమయ్యగారు పూజ్యులు.

పూర్వఋషి సాంప్రదాయసిద్ధమయిన ప్రకృతిమాతసేవనమును మరచి ప్రకృతిశాస్త్రము నవగాహన చేసికొనుట కశక్తులై, నిరుత్సాహులై, ఔషధసేవనమున కలవాటుపడి ప్రకృతిమాతను మరచినందున ప్రజానీక మనేకరోగములకు పాల్పడిరన్న నది సత్యేతరముగాదు.

ఇట్టి తరుణమందు పై వారివంటి ప్రకృతిసేవకు లుదయించి ప్రకృతిమాతృసేవను ప్రచారమునకు దెచ్చుట కుతకోలయగు "ప్రకృతి" యను మాసపత్రికను వెలువరించి అందనేకనూతనవిషయములను దెలుపుచున్నందులకు వారి కెంతయు కృతజ్ఞుడను.

ప్రకృతిసేవాభిమాను లందరు ముఖ్యముగ నిప్పటి యీ కాగితపుకరవుకాలమునందు విశేషముగఁ బ్రోత్సహించి చందాదారులై పత్రికాభివృద్ధికి తోడ్పడెద రని విన్నవించుచున్నాను.

ఖల్లూరు, కడపజిల్లా. — పోలేపల్లె వెంగన్నశ్రేష్ఠి.

## ౨

గత 25 సంవత్సరములనుండియు, "ప్రకృతి" ఆంధ్రదేశమున కొనర్చిన సేవ అమోఘము. ప్రకృతి చికిత్సావిధానము మొట్టమొదట ప్రవేశపెట్టినప్పుడు ప్రజలు, వీరేమో పిచ్చివారనియు, మందులులేక రోగనివారణ జరుగునా యని లేనిపోని సందేహములకు లోనై, నిరాహారదీక్ష, మృత్తికాస్నానం, ఆతపస్నానం, మున్నగునవి చెప్పినచో, మనుజులను చంపు చికిత్సావిధాన మిది యనినవారు లేకపోలేదు. కాని ప్రజాపవాదమునకు వెరువక, అనేకచోట్ల క్యాంపులు పెట్టి శిక్షణకార్యక్రమములును ఉపన్యాసముల ద్వారానేగాక, వచ్చినవారినిగూడ ఒక్కనెల రోజులుపాటు ఆహారమును మాన్పించి అపక్వాహారమును భుజింపచేసి ప్రత్యక్షప్రమాణములతో నిరూపించుటచే, నీ ఆంధ్రదేశము మారుమూలలగూడ నీ విధానముపైన అభిమానాదులేగాక, ఉచ్చట ఆరోగ్యాశ్రమములు, పై విధానపద్ధతిని జరిపించుచుండుట ప్రకృతి యొనర్చిన అమూల్య సేవకాక మరేమి? దీనికంతటికిని కారకులైన శ్రీ పుచ్చా వెంకట్రామయ్యగారి నిరంతరనిరాడంబరజీవితమేగాక, యావజ్జీవము దీనికై తనమానధనములను ధారవోసి పుస్తకములు రచించి యుపన్యాసముల నిచ్చి గ్రామముల వెంబడి ప్రచారంచేసి ప్రభుత్వంవారి చర్యలనుగూడ ఖండించుటకు వెనుదీయక, అనేకకష్టముల పాలైనను వెనుదీయక నడిపిన పట్టుదలయేకారణము. వీరికి సాయముగా శ్రీ అయ్యంకిగారి ప్రచారం గూడ దోడ్పడినది. ఈ నాటికి ప్రకృతి చికిత్సగూడ గొప్పగొప్ప పరీక్షల నిచ్చిన డాక్టరులుగూడ మాన్య

లేని రోగములను నివారణ చేయగలదని నిరూపించిరి. దీనికి తార్కాణముగ మా గ్రామము వద్దనున్న ఆరోగ్యాశ్రమములో క్షయరోగాలయమునుండి "యిక జీవితాశలేదు, రోగగ్రస్తుని తీసికొనిపొండి" అని చెప్పిన రోగులను ఆశ్రమములో ఇంద్రజాలమువలె బాగుచేసి, పంపిరి. న్యాయపారితోషికమైన పుచ్చుకొనని త్యాగసమన్విత కార్యము లెన్నైనిగలవు. ఇందులో డబ్బెక్కువ ఖర్చులేదు. దేహములోని జబ్బు పూర్తిగా నివారణముకాగల యీ ప్రకృతి చికిత్సను ప్రోత్సహించిన "ప్రకృతి" పత్రికామాతకు నాధన్యవాదములు. ఈ రజతోత్సవమేగాక, స్వర్ణోత్సవముగూడ చేయించుకొని చిరస్థాయిగా నుండగలందులకు భగవంతుని ప్రార్థించుచున్నాడ.

యం. వి. పాపన్నగుప్త, మదనపల్లి

3

## ప్రకృతికి నా కానుక

ఆధునిక నవీన నాగరికతావ్యామోహమున నేమి, మన యజ్ఞానమున నేమి, మానవుని స్వాభావికజీవితనియమము లన నేమో తెలియక, అనేక ప్రకృతి విరుద్ధమైన చర్యలవలన ఆరోగ్యభాగ్యమును కోల్పోయి, దారీ తెన్నూ గానక కింకర్తవ్యతామూఢులమైన మనకు ఆరోగ్యమార్గమును చూపగల ఒక పత్రిక యెంతేని అవసరమైయున్నది. బెజవాడ ప్రకృతి ధర్మపరిషత్తు వారి యాజమాన్యమున "ప్రకృతి" యను మాసపత్రిక యీ విషయమున చేసిన ప్రచారము, కృషి, యపారము. ఈ పత్రిక యొక్క ప్రచారమువలన ఆంధ్రదేశమున ప్రకృతి యుద్యమము చాలా వ్యాప్తికి వచ్చినది. అనేక చికిత్సాలయములు స్థాపితమలయినవి. ఆంధ్రులకు ప్రకృతి జీవనముపై అభిరుచి హెచ్చినది. ఇప్పటికి పాతికయేండ్లు నిండు యౌవనముతో ఆంధ్రదేశమున ప్రౌఢముగా సంచారము చేయదొడగినది. ఇట్టి ప్రకృతి పత్రిక శతాధికవర్షములు ప్రకృతిజీవనప్రచారమును విరివిగా సాగించి, పతితమానవులకు ఐహికసుఖమును కలిగించునట్లుగా ఆశీర్వదించు మని సర్వేశ్వరుని ప్రార్థించెదను.

2—11—43 జ్యోషి గోపాలాచారి, వల్లూరు.

---

## సంతోషవార్త

మీ రందఱు ఎంతో కాలమునుండి యెదురు చూచినారు. ఇప్పటికి మేము సుఖసంసారము పూర్తిగా అచ్చువేయింప గలిగినాము. బైండింగు మాత్రమే దిగుబాటుగా నున్నది. ఫిబ్రవరి 15 వ తేదినాటికి గ్రంథము కావలసినవారికి పంపుటకు సిద్ధముగా నుండును. క్యాలికో బైండు ప్రతి వెల యితరులకు రు 4-0-0 లు. ఇదివరకే మావద్ద రు 3-0-0 లు ఉంచి ఆర్డరు రిజిష్టరు చేసుకున్న వారికి సుఖసంసారము కాలికోబైండు ప్రతినే పంపెదము. రు 2-0-0 లు ఇదివరకే చెల్లించియున్న వారికి సాదాఅట్టబైండు ప్రతిని పంపెదము. ఇతరులకు అట్టబైండు రు 3-0-0 లు పోస్టేజి ఖర్చులు. ప్రతి 1 కి రు 0-11-0 లు అగును. ముందుగా పంపిన సరి. లేని యెడల సదరు రు 0-11-0 లు కలిపి పుస్తకమును వీ. పి. చేసెదము.

ప్రకృతి ఆఫీసు, బెజవాడ.

# ఆంధ్రదేశమున ప్రకృతివైద్యము

## 25 సంవత్సరముల చరిత్ర

1919 సంవత్సరము ఆగష్టు 1 వ తేదీన తెలుగుదేశమున మొదటి ఆరోగ్యవిషయిక మాసపత్రిక వెడలినది. దాని పేరు 'ప్రకృతి'. సంపాదకుడు కీ॥ శే॥ నారిశెట్టి హనుమయ్యగారు, బెజవాడ. అందు వారు ప్రకృతి వైద్యము ఎట్లు ఇహపరసాధకమైన ఆరోగ్యము నొసంగగలదో, తమ మొదటి సంపాదకీయమున నీ విధముగా సెలవిచ్చిరి.

## ప్రకృతి ప్రథమ పత్రము, ఆగస్టు 1919

### స్వవిషయము

"కిం భాగ్యం దేహవతా మారోగ్యమ్"
(శంకరాచార్య స్వాములవారు)

శరీరము గలవారికి భాగ్యమేది? ఆరోగ్యము.

"ధర్మార్థకామ మోక్షాణా మారోగ్యం మూల ముత్తమమ్" (చరకము)

చతుర్విధ పురుషార్థములకును బ్రధానసాధన మారోగ్యము.

"ధర్మస్యాయతనం యత్నా చ్ఛరీరం పరిపాలయేత్
నచ దేహమ్ వినా రుద్రః పురుషై ర్విద్యతే పరః."
(కూర్మ పురాణము)

"మన దేహము సర్వ పుణ్య కార్యములకును స్థానము. కాబట్టి దానిని మనము చక్కగా కాపాడవలెను. శరీరము లేనియెడల మనకు సర్వోత్కృష్టమైన బ్రహ్మము తెలియబడదు."

ఐహికాముష్మిక సౌఖ్యముల నందగోరు ప్రతివారికి నారోగ్య మత్యంతావశ్యకము. జగత్తునగల సకల సంపదలను బడసియున్నను ఆరోగ్యము లేనివారికి దుఃఖమే ప్రాప్తమగును. ధర్మార్థకామములయందు ప్రవృత్తులగువారు కార్యదక్షతయు, జయమును గాంచవలయుననిన వారి కారోగ్య మవసరము. మోక్షముకొరకు పాటుబడెడు భక్తులు, యోగులు, కర్మిష్ఠులు, జ్ఞానులు, నభీష్టసిద్ధి కారోగ్యవంతులై యుండుట యగత్యము. బలారోగ్యములు లేకున్నచో మానవులే పురుషార్థమును బొందజాలరు. కావున నెల్లరకు నారోగ్య సంపాదనము, నారోగ్యసంరక్షణము నవశ్యకర్తవ్యములు.

ఆరోగ్యమనిన దేహారోగ్యము మాత్రమే నని కొందరి యభిప్రాయము. అట్లు కాదు. శారీరక మానసి కారోగ్యమే పూర్ణారోగ్యము. ఇహపరసుఖసాధకుల కెల్లరకు నిది యావశ్యకము. యథార్థమునకు రెండు విధము లగు నారోగ్యములు లేవు. దేహమనస్సులు వరుసగా స్థూల సూక్ష్మదేహములు. ఒకటి యారోగ్యముగను, మరియొకటి యనారోగ్యముగను నుండుటకు వీలులేదు! రెండును నారోగ్యదశయందైనను నుండును, లేక రెండును ననారోగ్య దశయందైనను నుండును. కావున శారీరక మానసి కారోగ్యమే పూర్ణారోగ్యము. దీని యభావమే రోగము. అస్వాభావిక జీవనమువలన అనగా అహితమును అమితము నగు నాహార విహారాదుల వలన జ్వరాదులగు శారీరక రోగములును, రాగద్వేషాదులగు మానసిక రోగములును, కలుగుచున్నవని మన శాస్త్రము లన్నియు చెప్పుచున్నవి. మిథ్యాహార విహారముల వలన రోగ పదార్థమును, దానివలన పలు విధముల పిలువబడు రోగములును కలుగుచున్నవి. నానావిధ నామరూపములతో భాసిల్లు జగమెల్ల నొక్క పదార్థముయొక్క పరిణామమేయైనట్లు పలువిధములగు లక్షణములతో గన్పడుచు ననేక విధముల పిలువబడు దైహిక, మానసిక రోగములన్నియు నొకే రోగపదార్థముయొక్క పరిణామమాత్రములే. అస్వాభావిక సాధన లెన్ని జేసినను యథార్థజ్ఞానము లేనందున నజ్ఞానము నశింపదు. బ్రహ్మము తెలియబడదు. అటులే మిథ్యాహారవిహారాదులను వర్జింపక అనర్థదాయకములును కృత్రిమములు నగు ఔషధ, శస్త్ర వైద్యముల వలన సకల రోగములకు మూల కారణమగు రోగపదార్థము నశింపదు. ఆరోగ్యము

లభింపదు. ఆరోగ్య స్వరూపము, రోగ కారణము, తన్నివారణమార్గము - వీటిని గురించిన యథార్థజ్ఞానము లేకపోవుటచేత రోగముల సంఖ్య హెచ్చుగుచున్నది. అనేకు లకాలమృత్యువు పాలగుచున్నారు. పారమార్థిక సాధనము లన్నియు విఫలము లగుచున్నవి.

అనేక శతాబ్దములనుండి ప్రాచ్యదేశవాసులగు ఋష్యాదులు, పాశ్చాత్యదేశీయు లగు శారీరక, మానసిక శాస్త్రవేత్తలు యథార్థ రోగవివరణమును, రోగ కారణమును, తన్నివారణోపాయములను గూర్చి పలువిధముల పరిశోధనల గావించి వారివారి యనుభవములను వెల్లడించుచుండిరి. నూతనపరిశోధనలతో, నూతన భావములతో మార్పు, నభివృద్ధియు నొందుట ప్రతి విషయమును గూర్చియు సహజమే. తరతరములనుండి చేయబడుచున్న యారోగ్యమును గూర్చిన సత్యాన్వేషణము నేటి కొకవిధముగా బాటకు జేరి వినూత్న భావములతో విరాజిల్లుచున్నది.

రోగ కారణ మేమి? అను విషయమునుగూర్చి యైరోపా, అమెరికా ఖండములలో తీవ్రమైన చర్చలు పరిశోధనలు గావింపబడుచున్నవి. నూతన చికిత్సావిధానముల కనుగుణముగా చికిత్స చేయబడుచున్నది. ఔషధవైద్యమున నసాధ్య మని తలంపబడెడు వ్యాధులన్నియును ఆ యారోగ్యసదనములయం దవలీలగా గుదుర్పబడుచున్నవి. గుణమును కలుగుచున్నది. రోగ మన నేమి? యను విషయమును గూర్చి యెన్నియో గ్రంథములు, కరపత్రములు, పత్రికలు ప్రకటింపబడుచున్నవి. వందల కొలది యకరముల భూమి నీ చికిత్సాలయములకొరకు వినియోగింపుచున్నారు. వెనుకటి వైద్య పద్ధతులవలన రోగనివారణము కాక బాధపడు రోగు లనేకు లీ యారోగ్యసదనములలో నివసించి యారోగ్యభాగ్యము నొందుచున్నారు. అనేక వత్సరములనుండి వైద్యము చేసి గొప్ప బిరుదము లందిన యౌషధవైద్యులు, శస్త్రవైద్యులు, ఔషధశాస్త్ర వైద్యము లనర్థదాయకములు, నస్వాభావికములు నని తెలిసికొని వానిని విసర్జించి ప్రాకృత చికిత్సావిధానమును ప్రచారము చేయుచున్నారు. లస్టు, ట్రాల్, కెల్లాగ్, హేగ్, కీత్, ఏల్మర్లీ, ఫారెస్టు, ఆస్లర్, కూపర్, టిల్డన్, జాన్సన్, గ్రాసు, రామేజ్, కాక్స్, క్లాడర్ మున్నగు విఖ్యాత వైద్యులెల్లరు పై తరగతిలో జేరినవారే. కాని మనదేశములో ననేకుల కీ సంగతియే తెలియదు. స్వాభావిక చికిత్సలలో నొకటియగు శ్రీ లూయీ కూనేగారి జల చికిత్స కొంతవరకు మన ప్రాంతములలో తలయెత్తినది గాని యాచికిత్సయొక్క ముఖ్యోద్దేశ మేమియో, రోగ కారణ మేమియో, పథ్యమునకు చికిత్సకు గల తారతమ్య మేమియో విస్పష్టముగా తెలిసినట్టియు, తెలిసినను ఆచరించి చక్కగా బోధించి చూపగలిగినట్టియు చికిత్సకులు లేకపోవుటచేతను, ఎక్కడనైన నట్టి చికిత్సకు లున్నను చెప్పిన ట్లాచరింపగల రోగు లరుదగుటచేతను 'ఆట చేతగాక మద్దెల ఓటిదన్నట్లు' బ్రతికినన్నాళ్ళు చేసిననేగాని తొట్టిస్నానము గుణమీయదనియు, ఆ స్నానము చేయువా రనారోగ్యముగ నుందురనియు విపరీతవాదములు చేయుచున్నారు.

నమ్మకము కలిగి పట్టుదలతో నాచరించువారు సయితము శ్రీ కూనే యభినవశాస్త్రమున నన్నపానప్రకరణములలో జెప్పినదానినే పథ్యమని యనుసరించుచు నంతకు పైన మారుమాట లేదని స్వాభావిక పథ్యవిషయమున నా మహనీయుడు (కు నే) సూచించిన విశాలపథమును సంకుచితభావములతో నదృశ్యము జేయుచున్నారు. ఈ లోపము లేమియు లేకుండ విశాలదృష్టికలిగి యీ చికిత్సల నవలంబించి, వ్యాపకము జేయువారుండ వచ్చును. గాని మిక్కిలి అరుదు. ఇతరదేశములలో రోగ కారణమునుగూర్చి ఇపుడు జరుగుచున్న చర్చలు, రోగ నివారణ విషయమున నవలంబించుచున్న పద్ధతులు బాగుగ తెలిసిననేగాని మన మారోగ్య మన నేమియో తెలిసికొనజాలము. శ్రీ కూనేగారి యభినవ వైద్యశాస్త్ర మొక్కటి తప్ప మన భాషలో స్వాభావిక చికిత్సను గూర్చియు రోగ కారణమును గూర్చియు తెలిపెడు గ్రంథము మరియొకటి కాన్పించదు. కరపత్రములు, పత్రికలు లేనేలేవు. ఇంగ్లీషున నెన్నేని గలవు. ఇంకను వెలువడగలవు. కావున వాని నన్నిటిని తెనిగించి స్వాభావిక జీవనము, ప్రాకృతచికిత్స వ్యాపక మగునట్లు చేయుట మన కర్తవ్యము. విద్యాధికులు, ధనికులు నగు నాంధ్రసోదరు లెవ్వరైన నీకార్యమునకు బూనికొనినచో బాగుండెడిది కాని యీ విషయముపై నట్టివారెవ్వరిదృష్టియు బ్రసరింపలేదు. ప్రచారమునం దున్న యౌషధవైద్యమునందు మనవారికి గల గాఢాభిమానమో, స్వాభావిక చికిత్సావిధానములనుగూర్చి యెక్కువగా పరిచయము లేమియో, నూతన మార్గములు త్రొక్కుటలో మొదటినుండియు మన దేశమునందు అలవాటుగ

వచ్చుచున్న అనాదరణమో, కారణమై యుండును. యథార్థారోగ్యమును గూర్చి ఇతరదేశములలో ఇంత వ్యాపకమగుచున్నను మన ప్రాంతములందొక కరపత్రమైనను లేకుండుట శోచనీయము. విద్యాధనాదివిశేషములుగల యాంధ్రసోదరు లీకార్యమునకు బూనుకొనున ట్లగుపడమిచే నన్నింటను నసమర్థులమగు మేము దీనియందు మాకు గల హృదయపూర్వక మగు నభిమానము చేతను, ఇందుమూలమున తోడిమానవులకు నిజమైన సేవచేసి ఈశ్వరేచ్ఛ ననువర్తించినవార మగుదుమను విశ్వాసముచేతను, నిరుత్సాహమున కెడమీయక భగవంతునిపై భారమువైచి కర్తవ్య మని మొదలిడితిమి. రోగకారణమును; స్వాభావిక జీవనమును, మందులు శస్త్రములు నుపయోగింపకూడ దను ప్రకృతచికిత్సను గూర్చిన భాషాంతరీకరణము లీ పత్రికలో ప్రకటింపబడును. ప్రకృత వైద్యులు వ్రాయు వ్యాసములు, ప్రకృతచికిత్స నొందు రోగుల వృత్తాంతములు, స్వాభావిక జీవనము గడుపువారి చారిత్రములు గూడ నీ పత్రికలో బ్రకటింపబడును.”



అప్పటినుండి నేటివరకును ప్రకృతి పత్రిక అవిచ్ఛిన్నముగా జరుగుచున్నది. ఈ నారిశెట్టి హనుమయ్యగారు ఎవరు?

శ్రీ॥ జ్ఞానాంబగారు నారిశెట్టి హనుమయ్యగారిని గురించి యిట్లు వ్రాసియుండిరి.

“నారిశెట్టివారి కుటుంబములో శ్రీహనుమయ్యగా రుద్భవించినారు. తండ్రిపేరు వీరాస్వామి నాయుడుగారు, తల్లిపేరు వేంకటలక్ష్మాంబ. తండ్రి విషయలోలుడయ్యు దైవభక్తుడు. తల్లి సాధుశీల, మహాభక్తురాలు. మంచిపేరు ప్రతిష్ఠలు గల కుటుంబము. నలువురు అన్నదమ్ములలో కడసారివారగు వీరాస్వామిగారికే, పురుషసంతతి గలిగినది. ఆ కారణమున వీరు పెదతండ్రుల కందరకు ముద్దుల తనూజులై, వంశాంకురముగా భావింపబడి, మిక్కిలి గారాబముగా పెంపబడిరి. పుష్ పుష్ అనబడు తోపుడుబండిలో గూర్చుండబెట్టి త్రిప్పువారట! బడికి పంప మొదలిడినప్పటినుండి, బండిలోనే రాకపోకలు జరిగించువారట. ఇంత గోముగా పెరిగిన హనుమయ్యగా రొకింత పెద్దవారైనతోడనే సహజవైరాగ్యస్వభావమును ప్రకటింపసాగిరి. నాయుళ్ళలో, అందును కొంచెము ధనవంతులగువారిలో, మాంసభక్షణము మిక్కుటము. ఆంధ్రదేశమున వెలమవారి తరువాత, తెలగవారీవిషయమున ప్రసిద్ధులు. సాధారణముగా తాము ప్రేమతో సేవించు వస్తువులను తమపిల్లలకు, అందును మిగుల గారాబముగా పెంచుకొను పిల్లలకు, కుత్తుకబంటిగా మెక్కబెట్టుట లోకస్వభావము; అవివేకలక్షణముకూడ. ఈ కారణమువలన మన హనుమయ్యగారు పూర్తిగా మాంసాహారముతో పెరిగి పెద్ద కావలసివచ్చినది. 14 ఏండ్ల ప్రాయమున శాకాహారమే కాని మాంసాహారము వలదని పట్టుబట్టి మానివారట. అదివర కెవాళ్ళనుండిరో, అది కూడని పని యని శంకించుచుండి, అప్పటికి దృఢముగా చెప్పగలిగియుందురు. ఎంత జీవకారుణ్యమో, చిన్నతనమునందే యెంత ధర్మాధర్మవిచక్షణాదక్షతయో యోజింపుడు.

మాంసము తినుటద్వారా పొట్టలను జంతుకళేబరములతో నింపి శవములను పూడ్చు శ్మశానముగా మార్చుచున్నారని యొకానొక ప్రాజ్ఞుడు పల్కియుండెను. చచ్చిన జంతువులకు కడుపులలోనే గోరీలు కట్టగోరువారికీ 14 ఏండ్ల బాలుని నైతిక జీవనాభిలాషయొక్క

మహత్త్వము గోచరింపక పోవచ్చును. కాని యహింసా నిరతులకును, ప్రకృతిధర్మవేత్తలకును నీ యుత్కృష్ట మనోభావము విశదము కాక పోదు. చిన్ననాటనుండి, యాహారవిషయమున నియమనిష్ఠ లవసరమని వారి నమ్మకము. ఈ యుద్దేశమే క్రమక్రమముగా బలపడి, ఫలాహారునిగా గూడ మార్చినది. బాల్యమునుండియు భగవద్భక్తి విశేషముగా నుండెను. చిన్నతనమున భజనకూటముల నేర్పరచి, ఆంజనేయాది విగ్రహముల నెలకొల్పి, పూజలు, భజనలు సల్పువారు. క్రమక్రమముగా నీభక్తి వృద్ధిజెందినది. దేవునిగూర్చిన భావము మహోన్నతముగా సాగినది. విద్యావివేకములతో బాటు, జ్ఞానయుతభక్తి పెంపొందినది. వివాహానంతరము క్రొత్తగా నుద్యోగములో ప్రవేశించి బందరుదగ్గర గ్రామములలో కాపురమున్న కాలమున బ్రాహ్మసామాజికసోదరులతో గాఢమైత్రి కలిగినది. అదివరకే బ్రాహ్మమతాభిమానము కల్గి బ్రాహ్మధర్మానుగుణముగ జీవించుచుండిరి. ఆకాలమున వారి పరిచితులగు బ్రాహ్మణులలో శ్రీ కవికొండల సాంబశివరావుగారు, శ్రీయుత యి. సుబ్బకృష్ణయ్యగారు ముఖ్యులు. దూరగ్రామమునుండి బందరు నడచివెళ్ళి బ్రాహ్మోపాసనలో పాల్గొని తిరిగి నడిచియే యిల్లు చేరువారట. ఆ దినములలో శ్రీ హేమచంద్ర సర్కారుగారు దక్షిణదేశపు ప్రచారకుడుగా కలకత్తా సాధారణ బ్రహ్మసమాజము వారిచే నియమింపబడి ఆంధ్రదేశమున నుత్తరసర్కారులలో తరచుగా సంచారముచేయ మొదలిడినారట. హేమబాబుగారియందు వారికి గరిష్ఠమగు ననురాగము గలదు.

నే నెరిగినపిమ్మటకూడ హేమబాబుగారు హనుమయ్యగారికొరకు కలవరించువారు. నన్ను మొదట కలకత్తాకు తీసికొని వెళ్ళినపుడు, హనుమయ్యగారిని హేమబాబుగారు రైలుస్టేషనులో కలిసికొని నన్ను బ్రాహ్మ బాలికా శిక్షాలయమున విడిచిపెట్టి హనుమయ్యగారిని సాధనాశ్రమములో ప్రవేశపెట్టినారు. అహో! నాటి విశేషములు స్మృతిపథమున నెంత విస్పష్టముగ గోచరమగుచున్నవి? నేడు హేమచంద్రుడు లేడు. హనుమయ్యనాయుడుగా రాయనపోయిన యదృశ్యలోకమున కరిగినారు. నాజీవితములో సంభవించిన మహాపరివర్తనముల కన్నింటికిని హేతుభూతులగు శ్రీ హనుమయ్యగారు, బ్రాహ్మమతమును, ఫలభక్షణమును, విజ్ఞానయుతమును, స్వచ్ఛమును నగు స్వాధీనభావమును నా జీవనవిధానములో ప్రవేశపెట్టి, నాకు మహోపకారమొనర్చిన హనుమయ్యగారు, నేడీలోకమున లేరు. పరమభక్తుడై బ్రాహ్మమతవ్యాపనమునకే సర్వమును ధారవోసిన హేమబాబుగారు, పుత్రికావాత్సల్యముతో నన్నాదరించి మన్నించిన హేమబాబుగారు, మరి కానరారు. క్షణభంగురము, బుద్బుదప్రాయము నను మాటలలో నెంత గూఢార్థమిమిడియున్నది! శ్రీ హనుమయ్యగారు బ్రాహ్మమతవ్యాపనమునకై చాల కృషి సల్పినారు. కాకినాడ బ్రహ్మమందిర ప్రతిష్ఠాదినమున అనుష్ఠాన స్వీకారము చేసి శ్రీ హనుమయ్యగారు, హేమబాబుగారి చిరకాల వాంఛితమును తీర్చి యానందపరిపూర్తి గావించిరి. తరువాత కొంతకాలము ప్రచారకులుగ నుండి బ్రాహ్మధర్మవ్యాపనమునకై పాటుబడిరి. ఇది వారి బ్రాహ్మమత సంబంధమగు సంక్షిప్త చారిత్రము.

విగ్రహారాధనములు ఖండించుటలో చిమ్ములపిడుగు. జాతిభేద మన్న నెంతమాత్రమును గిట్టెడిది కాదు. బ్రాహ్మగీతములను స్వయముగ పాడుట, ఇతరులకు నేర్పుట వారికెంతో ప్రీతి. మృత్యుశయ్య నలంకరించు వరకు బ్రాహ్మసంస్థలలో పనిచేయుచునే యుండిరి. అద్వైత వేదాంతమునం దపరిమితమగు నభిమాన ముండెడిది. క్రమక్రమముగ నది తలకు మించినమాటయు వాస్తవమే. కాని యీయన యద్వైత మునేపుల ధోరణి వంటిది మాత్రము కాదు. జగము మిథ్య, సంసారము మిథ్యయను విపరీతధోరణి నీరికిపట్టనే లేదు. సనాతన ఛాందసము, నవనాగరికతావిలాసము రెండును వారికి దూరముగనే యుండెను. ఉత్కృష్టమగు నుపనిషన్మతమునం దత్యంతగౌరవ భావ ముండెడిది. గ్రంథావలోకన మొక వ్యసనమై మరణదేహా నక్షీణముగ [illegible]ని యాహ్వానించినది. అధిక పరిశ్రమ యీ రోగమునకు తాళముచేసి యిన్ని సంస్థలను, యిన్ని గ్రంథములను, ఈ పత్రికలను, ఈ చిత్రబృందములను విడచిపోవ [illegible] పెట్టినది. ఉత్తమగ్రంథములను, ఆధ్యాత్మికగ్రంథములను, కన్నులుపోవునట్లు మేల్కొని, చదువువారు విశ్రాంతియెరుగక, విరామములేక ప్రకృతిపత్రికా సంబంధములును బ్రహ్మమతసంబంధములును నగు కార్యములను నిర్వహించువారు వారి జ్ఞాన మపారము. వేదాంతవేత్తయై నివురుగప్పిన నిప్పువలె నుండువారు. పాపభీతి, పశ్చాత్తాపము, దైవభక్తి, నియమవర్తనము, ధైర్యము, స్థైర్యము అస్థిగతములా యన్నట్లీయనయందు మూర్తీభవించి యుండెడివి. నేను కలకత్తా నుండి

వచ్చినపిదప శ్రీవారితోఁగలిసి ప్రకృతి పత్రికయొక్క ముఖ్యోద్దేశములను ప్రకటించుటకు, అనుష్ఠించుటకు పనిచేయ మొదలిడితిని. ప్రచార వ్రతమూని, బ్రాహ్మణత సేవ చేయ సంకల్పించుకొను వరకును ప్రకృతి హృదయమును దెలుపు నిదర్శనమే కాని నా యోగ్యతకు సాక్ష్యము మాత్రము కాదు. బలమును, కాలమును, విద్యను, విత్తమును, తనువును, మనమును, తుదకు ప్రాణమును సైతము ప్రకృతికి ధారవోసి



1 వ ప్రకృతివైద్య శిక్షా శిబిరములో నున్నప్పటి పటము.

మా యిరువురి చేతులలోను పెరిగి పెద్దదైన దనిన, నతిశయోక్తి కానేరదు. నా యల్పజ్ఞానమును, అల్పశక్తిని తోడుచేసుకొని, ఆ మహనీయుడు మహత్తర కార్యములు చేయ కంకణ మూనిరి. ఇది వారి యుదార యా మహాపురుషుడు మరణించినాడు. అతులకీర్తి నార్జించి, యమరధామమున కేగినాడు.

హనుమయ్యగారు బహు నిరాడంబర జీవి. వేషభాషలందేగాక హృదయాంతరాళమునందు సైతము నిరా

డంబరతయే. రక్తము ధారవోసి పనిచేయువారు. పేరుమాత్రము కోరువారు కాదు. పేరుకొరకు పెనగులాడువా రనిన నాయనగారి కాశ్చర్యముగ నుండెడిది. పుస్తకములు, వ్యాసములు కూడ పేరు లేకుండ ప్రకటింపవలయుననియే వారికోరిక. ఎన్నడో వ్రాసిన అహింస, యను పుస్తకమును మారుపేరుతో ప్రకటించినారు. ప్రకృతి పత్రిక శైశవదశలో, నాచే వ్రాయబడిన వ్యాసములు, తర్జుమాలు కూడ నా పేరు లేకుండ ప్రకటించువారు. తరువాత నా యసమ్మతిని గ్రహించి, నా స్వార్థపరతను గుర్తించి, నా వ్రాతలకు నాపేరుంచ మొదలిడినారు. ఆయన గొప్ప తత్త్వవేత్త, సాధకుడు, ఆచరణశీలుడు. మంచి దుస్తులను ధరించిన పాపమున పోలేదు. ఎన్ని వస్త్రములున్నను ఇది కావలెనని కోరి యేదియు నెన్నడును వాడుకొనలేదు. మా పటమటలంక సాధనాశ్రమమునకు వచ్చి మాతో నివసింప మొదలిడినపిదప కేవలఫలాహారుడుగా నుండుట కాటంకములు లేకున్నవని సంతసించువారు. మా యాశ్రమము ఫలాహారుల యాశ్రమముగ బరిణమించుటకు శ్రీ హనుమయ్యగారే మూల కారణము.

ఆహారవిషయమున గూడ నిరాడంబరతయే. కొబ్బరి ముక్కలు, అరటిపండ్లు ముఖ్యముగ తినువారు ఆయా కాలములందు లభించు ఫలములనుకూడ వాడువారు. కాని, హెచ్చు వెలగల వస్తువులు గాని, విలువగల పాత్రలు, పళ్ళెరములు గాని బుద్ధిపూర్వకముగ కొని యెరుంగరు. ఒకరీతి శ్రీమంతులయింట బుట్టియు సామాన్యజీవనము గడపిన విరక్తపురుషు డాయన. పోస్టుమాష్టరు పనిలో నున్నపుడుకూడ, ఇంటిదగ్గర నున్నప్పుడు, వచ్చినవా రాయన వేషమునుజూచి యాయన యెవరో యనుకొనుచుండువారని వారి తల్లిగారు నాతో పలుసారులు చెప్పియుండిరి. లోపలను బైటనుగూడ నిరాడంబరమే. ఈ నిరాడంబరజీవి నిష్కపటుడు గూడ. కపటము; ద్వేషము, ఈర్ష్య, అసూయ ఆయనచెంత చేరనేరవని చెప్పవచ్చును. ప్రపంచములో వారికి పగవారే లేరు. అందరు నాయన కాత్మస్వరూపులే. ఎన్నియెన్ని తావులలో వారు నివసించిరో అన్ని తావులలో నవద లగు స్త్రీలకు పవిత్రజీవనము గడుపు మార్గములను చూపుట, బాలికలకు, చదువు లేని స్త్రీలకు, చదువు నేర్పుట, నైతికబోధచేయుట, వారి నిత్యకృత్యములై యుండెను. ఈసోదరుని దయవలన నెందరు నిరక్షరకుక్షు లగు సోదరీమణులు, ఆత్మ రాస్యులై యలరలేదు? ఈస్థలమునందే యట్టివారెందరు లేరు? వారి చదువు, వారి బోధ, వారి సలహా, వారి సాయము, వారితోడి పవిత్రసాంగత్యము కల సోదరీమణులే మాతృదేవతలవలె సేవజేసి వారి యంత్యకాలమున నుపచరించినారు. ఏనాడో మేకవానితోట, తోటవానిపాలెము, అను గ్రామములలో వా రుద్యోగము చేయుకాలమున కూరగాయలనమ్ముకొని జీవించు నొక యనాథపడుచు దుష్టుల యొత్తిడిచే కష్టపడుచున్న సంగతి నెఱిగి, అచటి దొరసాని కప్పగించి యొకవైశ్యుని కిచ్చి పెండ్లిచేయించినారు. వారు క్రైస్తవులు. ఆయనకు 80 రూపాయల జీతము. ఇటీవల నొకమా రాయన శ్రీ హనుమయ్యగారిని దర్శించి పోయినారు. అంతకు మున్నొకసారి హనుమయ్యగారు భార్యతోసహా వారి యూరికిపోయి చూచివచ్చినారు. అడవిశాఖలో నుద్యోగిగా నుండునపుడు లంచములు పట్టకపోవుటచే అచట బోయ లాయనపై శత్రుత్వము వహించి అడవి కాల్చి పెద్దకేసు పెట్టినపుడు జె. డి. సామ్యూల్ గారితో వాదించి తమ పక్షమును తామే సమర్థించి కేసు గెలిచిన దిట్టయితడు. న్యాయము మన పక్షమున నున్న భయమేలేదని చెప్పుచు ధర్మజీవనము గడుపువారికి శత్రువు లేమియు చేయజాలరని యీకేసు కథ వివరించువారు. బోయవాండ్రు హనుమయ్యగారిని చంపగోరియు "అయ్యో! లంచము పట్టడురా! అబద్ధమాడడురా! ఎట్లు చంపగలమురా!" అనుకొనువారట. ఆ మాటలు చెప్పుచు నైతికజీవన మహాత్త్వమును వేనోళ్ళ పొగడువారు. చాలకాలమునాటి మాట శ్రీవారు చెప్పుచుండగా నపుడు జరుగుచున్నట్లుండెడిది. ఈ చెప్పుట, వినుటకూడ నేటికి చాలకాలమునాటివే యైనవి. అడవిశాఖలో లంచములు పట్టని నీవు పనికిరావని వారి మేనమామగారు వారిని పోస్టాఫీసులో ప్రవేశపెట్టినారట. పోస్టుపనులు చూచుకొనుచునే దేశభక్తిప్రబోధకము లగు పత్రికలను చదువుచుండువారట. క్రమక్రమముగా వైరాగ్యము మెండై ఉద్యోగమునకు స్వస్తి చెప్పి బెజవాడ చేరుకొనిరి.

వారి యిద్దరుపిల్లలు (కొడుకు, కూతురు) కొలదికాల వ్యవధిలో మరణించుటయు, పురుషహృదయమును చెదరగొట్టునట్టి సంఘటనలు కొన్ని సంభవించుటయు జరిగి వారి సహజవైరాగ్యమునకు దోహదములైనవి. బెజవాడకు వచ్చుటలో వారి ముఖ్యోద్దేశము, వేదాంత

గ్రంథపఠన మట. 'జక్కంపూడి' యను అడవిగ్రామమున సాధుమునిస్వామిగారి మఠమున చాలదినములు వసించి, పిమ్మట ఆనందాశ్రమములో విద్యాధరపురమున నివసించి, పిమ్మట పడమటలంకకు వచ్చినారు. అటుతరువాత నీ ప్రకృతిఆశ్రమగృహము కొని యీ యింట ప్రవేశించినారు. ఎన్ని వేదాంతగ్రంథములనో చదివినారు. ఎన్ని భాష్యములనో విన్నారు. ఎన్ని మార్లో యుపనిషత్తులను పారాయణము జేసినారు. కాని తృప్తిలేదు, 'ఎందుకై యుద్యోగమును మాని బెజవాడకు వచ్చినానో, ఆ యుద్దేశము నెరవేరలేదు. ఇతరపనులు లేకుండ వేదాంతగ్రంథావలోకనముతో కాలము గడుపగోరెద. ప్రకృతి నాకు బంధమైనది. ఈ కార్యము నితరుల కప్పగించి, నేను విశ్రాంతిగా చదువుకొనవలెనని లెక్కలేనన్నిసార్లు చెప్పియుండిరి. అకటా! తుద కట్లే జరిగినది. కాని గ్రంథపరిశోధనయందలి తృష్ణ తీరలేదు, నేను లేనప్పుడీయిల్లు విప్పి, నూతనగృహము కట్టించినారు. నేను లేకుండనే దీనిలో ప్రవేశించినారు. నేను లేకుండనే మంచమెక్కినారు. మేడ కట్టించినారు. ఎక్కికూర్చుండి చదువుకొనలేదొక్కనాడైన. జబ్బుగ నున్నదని తెలిసి వచ్చినాను, నిర్విణ్ణుడనై చేతులు ముడుచుకొని కూర్చున్నాను. అష్టకష్టములు పడి నడిపిన పత్రికను; ఆర్జించిన ధనమును, సంపాదించిన పరికరములను, కట్టించిన భవనమును, నెలకొల్పినసంస్థలను, ప్రఫుల్లచిత్తముతో లోకకల్యాణార్థ మన్యహస్తముల కప్పగించి, నిశ్చలతను వహించినారు. చలికి, ఎండకు, వానకు, సకలబాధలకును లోనై యిల్లు కట్టించి యొకదినమైన నుండనోపలేక వెళ్ళిపోయినారు. ఏమి నిస్పృహ! ధన్యజీవి! గ్రంథావలోకనతృష్ణ యేమైనదో! చేతులార సేవజేయనైతిని. ఫలరసములను మాత్రము పాషాణహృదయముతో తలచుకొనినపుడెపుడో, నోటి కందించితిని. దూరదూరముగ నుండి తుదకు దూరమే యైపోయితిని. ప్రభూ! పరమేశ్వరా! మహోపకారము జేసినట్టి యొక మహాపురుషుని విషయమున కర్తవ్యమును విస్మరించి చేసిన యీ మహాపచారమును, నీవు సహింతువా? ఈ నేరమును మన్నింతువా? తండ్రీ! పూజనీయులగు హనుమయ్యగారి ఋణము నే నెన్నడును తీర్చుకొనలేను. ఆ పవిత్రాత్మ కనేక వందనము లర్పించుచున్నాను. సర్వనియంత యగు సర్వేశ్వరు డాయనయాత్మకు శాశ్వతశాంతి నొడగూర్చుగాక యని ప్రార్థించుచున్నాను."

భగవదుపాసనకు గూడ ఆరోగ్యమే ఆవశ్యకమైనదని ఆయన గ్రహించెను. అట్టి యారోగ్యము మందులు, ఇంజెక్షనులు, కోతలు కాలుపుల వలన రాకపోగా, నానాటికి ధ్వంసమగునని వారు కనిపెట్టియుండిరి. అంతేగాకుండా వారు తమ ఉపాసనాకాలమున ఫలభక్షణముచేసి అందలి సుగుణములను గ్రహించియుండిరి. భగవదుపాసన చేయదలచినవారికి, ఫలభక్షణమే సర్వోత్కృష్టాహార మని వారికి నమ్మకగలిగెను. ఈ సంగతులను ప్రచారముచేయుటకు తమ బలారోగ్యములనే గాక తమకుగల కొలదిపాటి ఆస్తిని గూడ నిందుకే వినియోగించిరి. మరియును తాము బ్రహ్మసమాజ ప్రచారకుడుగా నుండి గడించిన భృతిని గూడ ప్రకృతి కార్యాలయ ట్రస్టుకొరకే వినియోగించుచుండిరి. వారికప్పుడు నెలకు 30 రూపాయిలచొప్పున ఇచ్చుచుండిరి. కొంతకాలముతరువాత కాకినాడపోయి 6 మాసములు బ్రాహ్మసమాజ ప్రచారక శిక్షణము పొందిరి. అప్పటినుండి వారికి నెలకు రు 40-0-0 ల చొప్పున జీతము ముట్టుచుండెను. దానినిగూడ వారు ప్రకృతి కార్యాలయమునకే జమ కట్టిరి. ఇతరులకు పాఠములుచెప్పియు, భక్తికీర్తనలు నేర్పియు, వారివలన లభించిన ఫలములను తినియు, వారిచ్చిన వస్త్రములను ధరించియు జీవితమును గడుపుకొనుచుండిరి. జీవితాంతమువరకును అద్వైతబోధనలను వినుటకు అద్వైత గురువుల నాశ్రయించుచు, అద్వైతగ్రంథములను చేర్చిపెట్టుచు మతవిషయికమైన శ్రుతి, స్మృతి, పురాణేతిహాసములను కొని గ్రంథాలయమును నింపుచుండిరి. ఒకతూరి మా ప్రకృతి గ్రంథాలయమునందలి మత గ్రంథములను పరికింతుమేని యే ప్రాంతములందలి హిందూమతసంస్థయందును ఇన్ని గ్రంథములు లేవని మీరు తెలిసికొనగలరు. ప్రకృతి వైద్యమునకు సంబంధించినట్టియు, సంఘశాస్త్రమునకు సంబంధించినట్టియు, మానసిక శాస్త్రమునకు సంబంధించినట్టియు ఎన్నో గ్రంథరాజములను వారు సేకరించియుండిరి. వారికి విజ్ఞానతృష్ణయు, జ్ఞానతృష్ణయు అపారములు. ఎప్పటికైనను ప్రకృతిమతమువలనను, అద్వైతమతమువలనను మాత్రమే ప్రపంచమునకు శాంత్యానందములు చేకూరగలవనియు, మిగిలిన వన్నియు తాత్కాలిక సౌఖ్యమును అసౌఖ్యమునే గలిగింపగలవనియు వారు నమ్ముచుండిరి. అందులో వారు తమ ట్రస్టులో తెలుగు దేశమునందంతటను ప్రకృతిచికిత్సాలయములు, ఫలారామ



ములు, తపోవనములు, నెలకొనవలసి యున్నవనియు నందులకు ట్రస్టువారొక తపోవనమును నిర్మింపవలె ననియు, అద్వైతమతప్రచారము చేయింపవలెననియు, పరిశోధన చేయగల ప్రకృతి చికిత్సాలయమును, బోధన కొరకొక కళాశాలను స్థాపింపవలసియున్నదని వాంఛించి యుండిరి. 15 సంవత్సరముల నిరంతర పరిశ్రమ వలన వారు షుమారు రు 20,000/-ల స్థిరచరాస్తులను సంపాదించి మాకొసంగియుండిరి.

## ప్రకృతి పత్రిక చరిత్ర

ప్రకృతి పత్రిక ఆంధ్రదేశములో కలిగించిన ప్రబోధము అపరిమితమైనది. మొదటి 2 పత్రికలు కరపత్రములుగనే ప్రచురించిరి. ఫూల్‌స్కేపు 4 పేజీలు అనగా 1 టావు కాకితముమీద అప్పుడది ముద్రింపబడెను. తరువాత 4 సంచికలు మాసపత్రికగా వెలువడెను. మొత్తము 6 సంచికలు ఫూల్‌స్కేపు 2 సైజులోను, తరువాత 6 సంచికలు ఫూల్‌స్కేపు 4 సైజులోను పత్రికను అచ్చువేసిరి. 2 సంచికలు వాణీప్రెస్‌లోను, 6 సంచికలు మారుతిప్రెస్‌లోను అచ్చువేయించిరి. తరువాత స్వంతముగా అచ్చుపరికరములను కొని రామ్ అండ్ సన్సువారిఆఫీసులో ప్రకృతిపత్రికనుస్వంత ప్రకృతిప్రెస్‌లో అచ్చువేయ నారంభించిరి. తరువాత స్వంతప్రెస్‌వలన ఉండే కష్టములను స్వయముగా గ్రహించి 1920 సంవత్సరము ఆగష్టు నెల 1 వ తేదనుండి రాయల్ సైజు డబిల్ కాలములో ఆంధ్రగ్రంథాలయ ప్రెస్‌లో అచ్చువేయింప నారంభించిరి. ఇట్లు 3 సంవత్సరములు జరిగిన తరువాత రాయల్ సైజు 12 పేజీలలో వేసే ప్రకృతి పత్రికను మార్చి క్రౌన్ 8 సైజులో 32 పేజీల చొప్పున ప్రచురింప నారంభించిరి. సంవత్సర చందా రు 3-0-0 లు చేసిరి. అప్పుడు ప్రకృతి పత్రికలో గ్రంథములనుగూడ అచ్చువేయ నారంభించిరి. 16 పుటలు తాత్కాలిక విషయములకును, 16 పేజీలు గ్రంథములకొరకును విడదీయబడుచుండెను. అందు ముద్రింపబడిన గ్రంథములు కొన్ని అచ్చువేయబడినవి, విడదీసి వేరే గ్రంథములుగా కూర్చుచుండిరి. ఇట్లు నైపీయ జలచికిత్స, జస్టుచికిత్స, లక్ష్మణ జలచికిత్స, ప్రౌఢ ప్రభాకరము, మలబద్ధకము మొదలగు చాల గ్రంథములు తయారైనవి. 1934 సంవత్సరము జూలై నెలలో శ్రీ హనుమయ్యగారికి జబ్బుచేసినది. అప్పుడు పుచ్చా వెంకటాద్రియయ్యగారిని, అయ్యంకి వెంకటరమణయ్యగారిని పిలిపించి, తాము చేయదలచిన పనిని, తాము చేర్చిపెట్టిన ఆస్తిని వారికి వప్పగించి, పారిసలహాతో వీలునామా, సప్లిమెంటరీ ట్రస్టు డీడును వ్రాసి 1934 సంవత్సరము ఆగష్టు 9 తేదీన జీవబ్రహ్మైక్యమును పొందిరి.

## శ్రీ హనుమయ్యగారి కోరికలు

తమ చివర వాంఛితములుగా వారిట్లు మాకు తెలిపిరి. "సూర్యచంద్రులుండునంతవాక ప్రకృతి పత్రిక ద్వారా ఆరోగ్యవిజ్ఞానము వెదజల్లవలెను. ప్రకృతి గ్రంథములు, ప్రకృతికరపత్రములు ప్రచురింపవలెను. తపోవనమును స్థాపింపవలెను. అందు జ్ఞానసాధకులగు, భక్తులకు ఉచితవసతులను కల్పింపవలెను. యోగపరిశోధనలు చేయువారికి తగినంత సౌకర్యములు కలుగజేయవలెను. అద్వైతమతబోధకులను పిలిపించి, వారికి కావలసిన భృతి నొసంగి వారిచే నిరంతరము అద్వైతామృతము పంచిపెట్టింపవలెను. అహర్నిశలు అద్వైత బోధ జరుపవలెను.

ప్రకృతి చికిత్సాలయమును, ప్రకృతిబోధనకళాశాలను స్థాపించి అందు వరుసగా ప్రకృతివైద్యము చేసియు, బోధించియు ప్రకృతి ఉద్యమమును వ్యాపింప జేయవలెను."

అని చెప్పినతరువాత తిరిగ యిట్లు చెప్పిరి. "అద్వైత బోధ, ప్రకృతిపత్రిక, ఇండియన్ నాచురోపాత్ వీనిని మానక సాగింపవలెను. మరన్యపక్షవశమున శక్తిలేని యెడల ఒక పావుటావు కాగితముమీద నైన ప్రకృతి పత్రిక అని, ఇండియన్ నాచురోపాత్ అని వేసి ప్రతి నెలా ఆరోగ్యవిషయములు దానిమీద అచ్చు వేయించి పంచిపెట్టండి" అని వాంఛించిరి. అనగా వారికి ప్రకృతి పత్రిక, ఇండియన్ నాచురోపాత్ విషయములో అంత గాఢమైన అభిలాషకలదని మనము గ్రహింపవలెను.

## ప్రకృతి ఆదర్శము - పాలసీ

ప్రకృతి పత్రిక పాలసీని గూడ వారే సూక్ష్మముగా నిర్దేశించిరి. అడాల్ఫు జస్టు ప్రకృతి జీవనము (Adolf Just's 'Return to Nature') అనుయొ భారతీయ ఋషుల జీవనవిధానము, మన ఆదర్శము. అందుకు పరిపక్వ సాధనగా బెర్నార్ మెక్‌ఫాడన్ గారి ఫిజికల్ కల్చర్ పాలసీయును, బెనిడిక్టు లస్టుగారి నాచురోపాత్ పత్రికలును మనకు వరవడిగ నుండదగుననిరి. 1935 సంవత్స

రము జనవరి 1 వ తేదినుండి ప్రకృతి పత్రిక క్రౌన్ 4 సైజులో 32 పేజీలతో మంచి తెల్లకాకితము మీద సర్వాంగసుందరముగా అచ్చువేయుచున్నాము. ఇంగ్లీషు భాషలో గాని, హిందీ మొదలైన దేశభాషలలో గాని హిందూదేశమున నింత ప్రకృతివైద్య విజ్ఞానదాయకమైన పత్రిక యింతవర కెవ్వరును ప్రచురించుటలేదని చదివినవారి కందరకును అనుభవైకవేద్యమైన విషయమేను.

## ప్రకృతి పత్రికాభిమానులు

ప్రకృతి పత్రిక ప్రచురించే వరకు చెల్లాచెదరుగా పడియున్న ప్రకృతివైద్యశక్తులన్నియు ఒకచోట కేంద్రీకరింపబడిన వనుమాటయు అతిశయోక్తి కానేరదు. వేరువేరుచోట్లనుండి అంతవరకును పనిచేయుచుండినవారు ప్రకృతిపత్రిక ద్వారా తమ అనుభవములను వెల్లడింప నారంభించిరి. ఈ సంగతి పత్రిక 1 వ సంపుటము చదివిన యెడల మనకు గోచరింపగలదు. అట్టివారిలో నీ క్రిందివారు కన్పించుచున్నారు. 1. చెరువు రామకృష్ణరావు 1 వ కరపత్రము చూ. 2 మాకేటి సత్యనారాయణ మల్లిఖార్జునరావు, 2 క. చూ. 3 అగ్రా బాలముకుందదాసు గారు, 1919 అక్టోబరు. 4 బొల్లాప్రగడ సుందరగోపాలరావు, డిటో. 5 దాచేపల్లి రామబ్రహ్మశాస్త్ర్యులు గారు, 1919 నవంబరు. 6 తికాక్కాని నారాయణరావునాయుడుగారు, హిందూపురము, 1919 నవంబరు. 7 చారుగుండ్ల రాజయ్యగారు, 1919 నవంబరు. 8 పొత్తూరి కృష్ణంరాజయోగీంద్రులవారు, 1919 డిశెంబరు. 9 బొప్పన గోపాలకృష్ణయ్యగారు, 1919 డిశెంబరు. 10 పిన్నంరాజు వీరరాఘవరావుగారు, 1919 డిశెంబరు. 11 కందుకూరి వటుక భైరవమూర్తి పంతులుగారు, 1920 జనవరి. 12. పుచ్చా వెంకట్రామయ్యగారు, 1920, జనవరి. 13. పెమ్మా శేషయ్యగారు, 1920 ఫిబ్రవరి, 14 దువ్వూరి వీరభద్రయ్యగారు 1920 మార్చి, 15 పింగళి లక్ష్మీనారాయణగారు, 1920 మార్చి, 16 యన్. అమ్మిరాజుగారు, 1920 మార్చి 17. బండ్ల వెంకయ్యగారు 1920 ఏప్రియల్. 18 యమ్ ఆర్యమూర్తిగారు 1920 ఏప్రియల్. 19 జి. వి. కృష్ణారావుగారు 1920 జూన్. 20 స్థానం భావనారాయణగారు 1920 జూన్. ఇట్లు క్రమక్రమముగా ప్రకృతి పత్రికను తమను కేంద్రీకరించే సంస్థగా ఆంధ్రదేశము గుర్తించుకొన్నట్లు తరువాత స్థాపింపబడిన యీ క్రింది సంస్థల వలన మనము గుర్తింపగలము..

ఈ జాబితాలో చేరకయే తరువాత ప్రకృతిపత్రికలో సహకారము చేసినవారు ఇంకను ఎందరో కలరు. వారిలో 1. దుర్వాసుల పార్థసారథిశర్మగారు. 2. కీ. శే. నడింపల్లి సుబ్బరాజుగారు. 3. కీ. శే. కాశీభట్ల సీతారామయ్యగారు. 4. కీ. శే. రామరాజయోగీంద్రులు. 5. బొడ్డుపల్లి నరసింహంగారు. 6. రావుల గోపాలకృష్ణయ్యగారు. 7. నోసం రామవర్మ, సంజీవవర్మగార్లు. 8. గుడిపల్లి శేషయ్యగారు, కర్నూలు. 9. వి. దొండా సాహెబుగారు, కలికిరి 10. సీతారామావధూతగారు, 11. ఇజ్జతీతాసార్ జమీందార్ ఆఫ్ దేవిడి, 12. కొండపల్లి వీరభద్రాచార్యులుగారు అను పూర్వాశ్రమనామము గల తత్త్వానంద స్వామిగారు, 13. బచ్చు నాగభూషణరావు గారు, 14. చదలవాడ నాగభూషణరావుగారు 15. పువ్వాడ పేర్రాజుగారు 16. కొర్లపాటి వీరస్వామి నాయుడుగారు, 17. సంకా వీరభద్రయ్యగారు, 18. వాడపల్లి మురహరిరావుగారు. ఇప్పటికి 38 పేర్లుమాత్రమే యిచ్చినానుగాని యింకా యెందరో ప్రకృతి పత్రికను, ప్రకృతి సంస్థను తమ స్వంత సంస్థగా భావించేవారు ఆంధ్రదేశమునందంతటను గలరు. ఇందులో మేము పేరులు చేర్చజాలనంత మాత్రమున వారు తక్కువవారనిగాని శ్రద్ధలేనివారని గాని యెవరును భావింపనక్కరలేదు. స్థల సంకోచము చేతనే చేర్పలేదు.

## కార్యాలయట్రస్టుఫండు, ధనదాతలు.

దీనికి నారిశెట్టి హనుమయ్యగారు ఎక్కువభాగము సేకరించిరి. వీరుగాక ఒకేతూరి రు 100 లపై మొత్తములను ఈ దిగువ పేర్కొనినవారు ఇచ్చియుండిరి.

1. సంకా సుబ్బమ్మ (భర్త దుర్గయ్యగారి పేరుతో) రు 2000-
2. వాసిరెడ్డి మీనయ్యగారి కుమారుడు కోటయ్యగారు
3. చదలవాడ నాగభూషణరావుగారు
4. అయ్యంకి వెంకటరమణయ్యగారు
5. పుచ్చా వెంకట్రామయ్యగారు
6. వేమూరి చిన్నయ్యారావుగారు
7. వెలగలేటి దశరథరామయ్యగారు
8. పర్వతనేని చినకామయ్యగారు
9. కందుకూరు వటుక భైరవమూర్తి పంతులుగారు.

వీరుగాక రు 100/- తక్కువ మొత్తములను ఎంతో మంది యిచ్చియుండిరి.

## సహాయము చేసిన గ్రంథరచయితలు

వీరుగాక యీ క్రింద పేర్కొనినవారు గ్రంథములను వ్రాసి ఉచితముగా నొసంగియుండిరి.

1. పుచ్చా వెంకట్రామయ్యగారు,
2. కీ॥ శే॥ శ్రీమతి జ్ఞానాంబగారు,
3. యం. ఆర్యమూర్తిగారు, ఉపవాసచికిత్స
4. దువ్వూరు రామకృష్ణారావుగారు, 1 అల్యూమినియం పాత్రలు, 2 సంవాహనచికిత్స, 3 జంబీరచికిత్స
5. పాలడుగు శేషాచలాచార్యులవారు, వైదిక చికిత్సాపద్ధతి
6. ప్రతాపగిరి వెంకటసుబ్బయ్యశర్మగారు, ఉషఃపానము
7. తత్వానందస్వామివారు, కె. వీరభద్రాచార్యులుగారు, జస్టుచికిత్స
8. చెరువు రామకృష్ణరావుగారు, రామతీర్థస్వామి వేదాంతోపన్యాసములు
9. రాజయోగీంద్ర సోదరులు,
10. మళీదు నాగలింగయ్యగారు, ధ్యానచికిత్స
11. చల్లా లక్ష్మీనారాయణశాస్త్రిగారు, యోగచికిత్స
12. కోకా వెంకటకృష్ణారావుగారు, క్షీరచికిత్స
13. బుక్కపట్టణం తిరుమల వరదాచారిగారు, పురుషులకు నా సందేశము
14. కోట వెంకటచలంగారు, నిర్వికారజీవనము
15. మాజేటి సత్యనారాయణ, మల్లికార్జునరావుగార్లు, 1 రక్తప్రక్షాళన చికిత్స 2 కశేరుకా సమీకరణ చికిత్స
16. వేమూరి రామమూర్తిగారు, 1. ఆహారసమ్మేళనపు గోల, 2. సమరసాహారము : విరుద్ధాహారము.
17. వేమూరి శ్రీనివాసశాస్త్రిగారు, సజీవాహారము
18. వాడపల్లి మురహరిరావుగారు, దీర్ఘాయువు
19. పాలపర్తి నరసింహారావుగారు, కలరా
20. అడుసుమిల్లి వెంకట కృష్ణారావుగారు, వైద్య విప్లవము
21. దిగవల్లి శేషగిరిరావుగారు, రామచరక, జలచికిత్స.
22. చెన్నుభొట్ల భానుమూర్తిగారు, ఉబ్బసము.

వీరి రచనలను ప్రచురించి అమ్ముటవలనగూడ ధనము సమకూరినందున వీరందరు ట్రస్టుఫం.ను సమకూర్చినవారుగానే భావింపవలసియున్నది.

### 1. పుచ్చా వెంకట్రామయ్యగారు

గ్రంథరచయితలలో నెల్ల ఎక్కువ గ్రంథములను రచించిరి. అనేకోద్గ్రంథములు భాషాంతరీకరణములు.

### వారు వ్రాసిన గ్రంథములు

1. సునిశితవైద్యము, 2. ప్రౌఢప్రభాకరము, 3. సూర్యకిరణ చికిత్స, 4. వర్ణవైద్యమంజరి – ఇవి సూర్యకిరణ చికిత్సా గ్రంథములు, 5. తొట్టివైద్యము, 6. నైపీయు జలచికిత్స, 7. ఎనిమా – ఇవి జలచికిత్సకు సంబంధించినవి. 8. ఆరోగ్యాదర్శము – గాంధిగారి ఆరోగ్య శాస్త్రము, 9. ప్రకృతి గృహవైద్యము – ఇది వైద్యము నేర్చుకునేవారికొరకు వ్రాసిన పాఠ్యపుస్తకము. 10. క్షయ, 11. శుక్లనష్టము, 12. చలిజ్వరము, 13. హిస్టీరియా, 14. బాలింత రోగము, 15. మధుమేహము, 16. ఉబ్బసము, 17. మలబద్ధకము. వివిధ రోగముల నిదానములు చికిత్సలుగల గ్రంథము లివి. 18. రోగమేల కలుగుతుంది? నిదానశాస్త్రమునకు సంబంధించిన విమర్శగ్రంథము. ఇవిగాక ఈ క్రింది చిన్న గ్రంథములను గూడ వారు రచించిరి. 19. సుఖప్రసవము, 20. పురుటాలు.

### 2. శే. రామరాజయోగీంద్రులుగారి గ్రంథములు

1. వారి స్వీయచరిత్ర, 2. మహాయోగము, 3. మహారోగము, 4. అనుభవానందము, 5. జలచికిత్స మొదలగునవి.

### 3. కీ. శే. జ్ఞానాంబగారి గ్రంథములు

1. వర్ణచికిత్స, 2. వర్ణవైద్యము, 3. లక్ష్మీజలచికిత్స, 4. కూనే మహర్షి బోధ, 5. నిర్వికారభావిజీవనము, 6. పచ్చితిండివలని ప్రయోజనములు, 7. తెల్లచక్కెర వలన విపత్తు, 8. తేనీరు విషతుల్యము, 9. ఔషధవైద్య మొక యూహాశాస్త్రము, 10. ఆరోగ్యము– [illegible] 11. ఆహార రసాయనశాస్త్రము మొదలగునవి.

## ముద్రించిన గ్రంథములు దానమొసంగుట

800 తొట్టివైద్యము పుస్తకాలు, 1000 సూర్యకిరణ చికిత్స ప్రతులు, 250 ఆరోగ్య ప్రభాకరము ప్రతులు, 300 ఆరోగ్యాదర్శపు ప్రతులు, 250 మలబద్ధకము ప్రతులు అచ్చువేసినవి, ప్రకృతి కార్యాలయ ట్రస్టు

నకు ఉచితముగా సమర్పించి పుచ్చా వెంకట్రామయ్య గారు ట్రస్టుఫండును వృద్ధిచేసిరి.

### పత్రికా విలేఖరులు

గ్రంథకర్తలుగా పేర్కొనిన వారుగాక ఈ క్రింది వారు గూడ పత్రికకు వ్యాసములు వ్రాసి సహాయపడు చుండిరి. 1. కోట శ్రీరాములుగారు, 2. మృత్తింటి అంజనేయులుగారు, 3. కీ శే. బొల్లాప్రగడ సుందర గోపాలరావుగారు, 4. వి. దొండాసాహెబుగారు, 5. చెన్నుభొట్ల భానుమూర్తిగారు, 6. అయ్యంకి వెంకటరమణయ్యగారు, 7. తాండవ కృష్ణగారు, 8. వాడపల్లి మురహరిరావుగారు, 9 కొండూరి సూర్య నారాయణగారు, 10. పెమ్మా శేషయ్యగారు, 11. అయ్యంకి వెంకటకృష్ణయ్యగారు, 12. యోగి రాఘవేంద్రగారు, 13. వేగిరాజు కృష్ణంరాజుగారు, 14. అక్బరల్లీసాహెబుగారు, 15. జి. నారాయణ స్వామిగారు.

### ప్రకృతి కార్యాలయ ట్రస్టు

1923 వ సంవత్సరము మార్చినెలలో ప్రకృతి కార్యాలయము ప్రజాసంబంధమగు ధర్మసంస్థగా రిజిష్టరుచేయ బడినది. దానికి అప్పటిలో కీ॥ శే॥ నారిశెట్టి హనుమయ్యగారే సోల్‌ట్రస్టీగా ఉండి వ్యవహరించుచుండిరి 1934 సంవత్సరములో అదనపుట్రస్టు డీడుద్వారా 1. చెరువు శ్రీ మల్లిఖార్జునుడుగారు, 2. పుచ్చా వెంకట్రామయ్యగారు, 3. అయ్యంకి వెంకటరమణయ్యగారు, 4. సీతారామావధూతగారు, 5 కీ॥ శే॥ జ్ఞానాంబగారు, ట్రస్టీలుగా పేర్కొని తాను జీవితాంతమువరకు హనుమయ్యగారు మేనేజింగు ట్రస్టీగా నుండిరి. వారి యనంతరము ఈ అయిదుగురు ట్రస్టీలు కార్యనిర్వహణము చేయుచుండిరి. వారిలో శ్రీ పుచ్చా వెంకట్రామయ్యగారు ప్రెసిడెంటుగను, శ్రీ అయ్యంకి వెంకటరమణయ్యగారు కార్యదర్శిగను, నుండి వ్యవహరించుచున్నారు. చెరువు శ్రీ మల్లిఖార్జునుడుగారు 1935 సంవత్సరములో ట్రస్టులో నుండి స్వయముగా తొలగినందున వారి స్థానము శ్రీ చెన్నుభొట్ల భానుమూర్తిగారిచే నింపబడినది. ఆ తరువాత 29-6-42 తేదివరకు పై అయిదుగురే ట్రస్టీలుగా నుండి పనిచేయుచున్నారు. జ్ఞానాంబగారు మరణించినందున వారి స్థానమున శ్రీ పైడా శ్రీరామకృష్ణయ్య జమీందారుగారిని యెన్నుకొనిరి. ఇప్పుడు 1. పుచ్చా వెంకట్రామయ్యగారు ప్రెసిడెంటు, 2. అయ్యంకి వెంకటరమణయ్యగారు, సెక్రటరీ, 3 సీతారామావధూతగారు, 4. చెన్నుభొట్ల భానుమూర్తిగారు, 5. పైడా శ్రీరామకృష్ణయ్యగారు ట్రస్టీలుగానుండి కార్యనిర్వహణము చేయుచున్నారు.

### ట్రస్టు భవనములు

1923 సంవత్సరము ఫిబ్రవరినెలలో బెజవాడలో మునిసిపల్ 5/65 కవాటసంఖ్యగల యింటిని కీ॥ శే॥ నారిశెట్టి హనుమయ్యగారు రు 1350 లకు కొని మరమ్మతులు చేయించియుండిరి. తరువాత 1934 సంవత్సరములో దానినే పడగొట్టి షుమారు రు 5000 లు వెచ్చించి యిప్పుడున్న ట్రస్టు ప్రధానభవనమును నిర్మించిరి. అదే యిప్పుడు మన కార్యాలయముగా నున్నది. గోలి శేషమ్మగారున్నూ, పిట్టల కనకయ్యగారున్నూ, ప్రకృతి కార్యాలయమునకు బాకీపడియుండి తీర్చలేక పోయినందున వారియిండ్లను ప్రకృతి కార్యాలయమునకు చేర్చుకొంటిమి. ఇట్లు అశ్రేణిలోని వింకా 2 యిండ్లు కలసినవి. ఇదిగాక కానూరివారి సందులో (కొత్తగుడులవద్ద) ఒక యింటిని శ్రీహనుమయ్యగారు కొనియుండిరి. ఇవ్వన్నియు ప్రకృతి కార్యాలయ ట్రస్టునకు స్వంత ఆస్తిగా నున్నవి.

### స్థిరాస్తి

వినుకొండ తాలూకా కంచికచర్లలో కొంత స్థిరాస్తిని హనుమయ్యగారు ట్రస్టునకు సమర్పించి యుండిరి. దానివలన ఏటేట కొంత ఆయివజు సమకూరుచున్నది.

### ప్రకృతి సంపాదకత్వము

1919 సంవత్సరము ఆగష్టు 1 వ తేదీనుండి 1923 సం॥ ఏప్రియలు 1వ తేదీవరకు కీ॥ శే॥ నారిశెట్టి హనుమయ్యగారు ప్రకృతి పత్రికా సంపాదకులుగా నుండిరి. 1923 సం॥ మే 1వ తేదీ నుండి 1934 సం॥ ఆగష్టు 1వ తేదీవరకు శ్రీ పుచ్చా వెంకటరామయ్యగారుకూడా నారిశెట్టి హనుమయ్యగారికి తోడుగా సంపాదకత్వమును చూచుచుండిరి. 1934 సంవత్సరము ఆగష్టువరకు పత్రికమీద Edited, Printed, and Published by N. Hanumayya అనియే అచ్చుపడు చుండెను. 1934 సం॥ సెప్టెంబరు 1వ తేదీనుండి క్రొత్త డిక్లరేషనుచేసి పుచ్చా వెంకటరామయ్యగారే పత్రికా సంపాదకులుగా నున్నారు.

## భారతీయ ప్రకృతి ధర్మప్రచారక సంఘము

1919 సంవత్సరము ఏప్రియలు నెలలో శ్రీ భారతీయ ప్రకృతి ధర్మ ప్రచారిణీసంఘము స్థాపింపబడినది. అందు నీ క్రిందివిధముగా సంఘ ఉద్దేశ్యములు తీర్మానింపబడినవి.

1. సర్వాత్మకుడును, సర్వజ్ఞుడును, నిత్యమంగళ స్వరూపుడును, అగు భగవంతుని నిరంకుశ శక్తియే ప్రకృతి యనబడును. నిఖిలలోకముల యొక్క సృష్టి, స్థితి, సంహారములు యీ ప్రకృతి కార్యములే. ప్రకృతి కృత మంతయు భగవదుద్దిష్టమే అగుట అది సర్వభూతములకు పరమశ్రేయః ప్రదము. ప్రకృతియొక్క ధర్మమును దాని గమనమును యథార్థముగా గుర్తెరిగి యజ్ఞాన జనితమగు తన అహంకారమును గుర్తించి, విసర్జించి ప్రకృతిని అనువర్తించుటయే ప్రతిజీవునకును ప్రధాన కర్తవ్యమును పరమకల్యాణమును అని ప్రకృతిజీవన సిద్ధాంతము.

2 పై సిద్ధాంతముయొక్క యాథార్థ్యమును సర్వ ప్రయత్నములచేత లోకమునకు బోధించి సిద్ధాంతమును వ్యాపింపచేయుటయును, సరియైన ప్రకృతి ధర్మాచరణమును తెలిపి అందువల్ల కలుగు ఉత్కృష్టఫలములను జనులకు స్వానుభవవిదిత మొనర్చుటయు భారతీయ ప్రకృతిధర్మప్రచారిణీసంఘము యొక్క ముఖ్యోద్దేశము.

చేయదగిన కార్యములు:—

1. పత్రిక, గ్రంథములు, కరపత్రములు, ఉపన్యాసముల మూలమున ప్రకృతి జీవన సిద్ధాంతమును బోధించుట, 2 ప్రకృతి సిద్ధాంతబోధక గ్రంథాలయమును స్థాపించుట, 3. ఫలారామములను, ఆరోగ్యసదనములను నెలకొలిపి రోగులకు ఆరోగ్యమును కలిగించుట, 4. శాఖాసంఘములను స్థాపించుట, 5. అనాథ శరణాలయమును నెలకొల్పుట, 6. ప్రకృతిసేవకులకు ఆశ్రియ మొసంగుట.

సభ్యులు - సంఘాదర్శము ననుసరించి అన్ని కార్యములకు తోడ్పడువారును, సంఘముచే నిషేధింపబడు వర్తనమును వర్జించి సంఘము ఆమోదించురీతిని జీవించు వారును సంఘవిధులకు లోబడి 'ఆచరణసభ్యులు' అగుటకు అర్హులు.

తమ ప్రవర్తనమును మార్చుకొనలేక సంఘ కార్యములకు తోడ్పడువారు సామాన్యసభ్యులుగా ఉండుటకు అర్హులు. ఈ సభ 1920 సంవత్సరము యేప్రియలు నెలలో జరిగినది. తరువాత యీ క్రిందివారు కార్య నిర్వాహకసభ్యులుగా నెన్నుకోబడ్డారు.

1. కందుకూరి వటుక భైరవమూర్తి పంతులుగారు, ప్రెసిడెంటు
2. నారిశెట్టి హనుమయ్యగారు, వైసుప్రెసిడెంటు & ఎడిటరు
3. ఆత్మకూరి గోవిందరావుగారు, సెక్రటరీ & ట్రెజరర్
4. పింగళి లక్ష్మీనారాయణగారు,
5. గజ్జెల సీతారామయ్యగారు.

ఆ సంఘము నాటినుండి నేటివరకును బెజవాడ కార్యాలయముగా గలిగి నడచుచున్నది. భారతదేశమునందంతటను శాఖాసంఘములును సభ్యులును గలరు. 1923 వ సంవత్సరమునుండి 1926 సంవత్సరము వరకు ప్రకృతి పత్రికలోనే ఒక యింగ్లీషు సప్లిమెంటు వేస్తూ వచ్చారు. తరువాత 1926 సం॥ము జూలై నెలలో ది ఇండియన్ నాచురోపాత్ అను పత్రిక ప్రారంభింపబడినది. అప్పుడు రెండుసంచికలు మాత్రమే ప్రచురింపబడెను. తరువాత 1931 సంవత్సరము జనవరి 1 వ తేదీన, ది ఇండియన్ నాచురోపాత్ పత్రిక రెండవ సంపుటము ప్రచురింపబడెను. 1927 సంవత్సరము ఏప్రియలు 1వ తేదీన ప్రత్యేక యేర్పాటువలన కలకత్తాలో ప్రచురింపబడు 'నేచర్ హీలర్' పత్రికను భారతీయ ప్రకృతి ధర్మప్రచారిణీ సంఘమునకు అఫిషియల్ ఆర్గన్‌గా అంగీకరించినారు. అప్పటినుండి 'ఇండియన్ నేచురోపాత్' పత్రిక కలకత్తాలోని 'నేచర్ హీలర్' పత్రికతో కలిసిపోయినది. 1929వ సంవత్సరము మార్చి నెలతో నేచర్ హీలర్ పత్రిక ఆగిపోయినది. తరువాత వేరే మార్గములేక భారతీయ ప్రకృతి ధర్మప్రచార సంఘమువారు 1931 సంవత్సరము జనవరి 1 వ తేదీన తమ స్వంతపత్రిక అయిన 'ఇండియన్ నాచురోపాత్' ను బెజవాడనుండి తిరిగి నడుప నారంభించిరి. అప్పటినుండియు 'ఇండియన్ నాచురోపాత్' పత్రిక నేటివరకును అవిచ్ఛిన్నముగా ప్రచురింపబడుచున్నది. ఇప్పుడు యీ సంఘమునకు - శ్రీ చెన్నుభొట్ల భానుమూర్తిగారు, ప్రెసిడెంటుగాను, శ్రీ తుమ్మల వెంకటరామయ్యగారు, జనరల్ సెక్రటరీగాను, శ్రీ అయ్యంకి వెంకటరమణయ్యగారు, ప్రచార కార్యదర్శిగాను, శ్రీ

వాడపల్లి మురహరిరావుగారు సంఘసేవా కార్యదర్శిగాను పని చేయుచున్నారు.

భారతదేశమునందంతటను భాషారాష్ట్రమునకు ఒక్కొక్కరు చొప్పున దీనికి ఉపాధ్యక్షులు గలరు.

## ఆంధ్రరాష్ట్ర ప్రకృతి ధర్మ ప్రచారక సంఘము

భారతీయప్రకృతి ధర్మసంఘమునకు అనుబంధముగా ప్రకృతివైద్యవిజ్ఞానమును వ్యాపింపచేయు నుద్దేశముతో తెలుగుదేశమున కంతటికిని సంబంధించినఒక సంఘమును స్థాపించిరి. దానికి ఆంధ్రరాష్ట్రీయప్రకృతి ధర్మప్రచారక సంఘము అని పేరు. ఆ సంఘముయొక్క ఉద్దేశములు ఈ క్రిందవ్రాయబడిన విధముగానున్నవి.

1. సర్వాత్మకుడును, సర్వజ్ఞుడును, నిత్యమంగళస్వరూపుడు నగు భగవంతుని యనంతశక్తియే "ప్రకృతి" యనబడును. నిఖిలలోకముల సృష్టిస్థితిసంహారము లీ శక్తి కార్యములు. ప్రకృతి కృతసంగతియు భగవదుద్దిష్టమే యగుట సర్వభూతములకు పరమశ్రేయఃప్రదము. ప్రకృతియొక్క ధర్మమును, దాని గమనమును యథార్థముగ నెఱిగి ప్రకృతి ననుసరించుటయే ప్రతిజీవునకు బ్రధానకర్తవ్యమును బరమకళ్యాణము అని ప్రకృతి జీవనసిద్ధాంతము.

పై సిద్ధాంతముయొక్క యాథార్థ్యమును సర్వప్రయత్నములచే లోకమునకు బోధించి సిద్ధాంతమును వ్యాపింపజేయుట, మరియు క్రమమగు ప్రకృతి ధర్మాచరణమును దెలిపి దాన గలుగు సత్కృష్టఫలమును జనులకు స్వానుభవవిదిత మొనర్చుట.

2. దుఃఖముయొక్క మూలకారణమును, దాని యాథార్థ్యమునుగూర్చియు, దుఃఖనివర్తకములును, ప్రకృతిసిద్ధములు నగు మార్గముల గూర్చియు బరిశీలనమును బ్రోత్సహించుట.

3. స్వాభావిక జీవనధర్మముల గూర్చియు, ఔపచారికములగు నిరౌషధ నిశ్శస్త్ర ప్రాకృతి చికిత్సా విధానముల గూర్చియు బరిశీలనమును బ్రోత్సహించి, తన్మూలమున సత్యమగు స్వాస్థ్యశాస్త్రమునకు బరిపూర్ణత నొసంగుట.

4. భారతీయ ప్రాచీన ప్రకృతిచికిత్సా విధానము లన బరగు నానాయోగభేదముల సిద్ధాంతములను సాధన ప్రక్రియలను బరిశీలించి సమన్వయించి యుద్ధరించుట.

5. దుఃఖనిరోధకములు లేక నివారకములు నగు ప్రపంచమునందలి నానాప్రాచీనాధునికమతములను, ప్రక్రియావిధానములను, ఆచారములను, అభ్యాసములను, సాదర్శవిమర్శముగ బరీక్షించి అందొక వేళ లభింపగల ప్రకృతి చికిత్సామర్మముల గ్రహించుట.

6. ప్రకృతి ధర్మపరిజ్ఞానమును ప్రకృతి జీవనకళ్యాణమును జనులు బడయు నిమిత్త మవసరమగు వివిధ కార్యముల నొనర్చుట. అందు ముఖ్యముగ -

(అ) పత్రికాముఖమునను, గ్రంథములు, కరపత్రములు, ఉపన్యాసములు మూలమునను సాధ్యమగుచో నాదర్శయోగ్యములగు విద్యాలయములను స్థాపించియు ప్రకృతి జీవనసిద్ధాంతమును, మరియు వివిధ నిరౌషధ నిశ్శస్త్ర ప్రకృతిచికిత్సావిధానములను బోధించుట.

(క) గ్రంథాలయములను స్థాపించి ప్రకృతిసిద్ధాంత బోధకములగు గ్రంథముల నందు నెలకొల్పుట.

(చ) రోగవిమోచనమును గాని పవిత్ర విశ్రాంతిజీవనమును గాని కోరువారి సౌకర్యార్థము ఆరోగ్యసదనములను, ఫలారామములను, తపోవనములను, యోగాశ్రమములు మున్నగువానిని, అనుకూలప్రదేశములందు నెలకొల్పియు, ప్రకృతిచికిత్స మూలమున నాధివ్యాధుల నివర్తింపజేసియు ప్రకృతిజీవనప్రభావము లోకమునకు ప్రకాశింపజేయుట.

(ట) సంఘవిధులకు లోబడి యనాథశరణాలయములను నెలకొల్పి అందు దిక్కులేనిపిల్లలను జేర్చి ప్రకృతి ధర్మానుగుణముగ బోషించుట.

(త) ప్రకృతిధర్మప్రచారమునకు తమ యావత్కాలమును వినియోగించి పాటుపడు సేవకబృందమును నిర్మించి పనిచేయుట.

(ప) వీలగుచోట్ల నెల్ల సంఘములను స్థాపించి వానిని ఈ మాతృసంఘమునకు శాఖాసంఘములుగ జేర్చికొనుట.

## మొదటి సేవక సంఘము

౧ గంధం వేంకటకృష్ణరావుగారు, బి. ఏ.
౨ నారిశెట్టి హనుమయ్యగారు
౩ పుచ్చా వెంకటాద్రిమయ్యగారు
౪ అయ్యంకి వెంకటరమణయ్యగారు
౫ కందుకూరి వటుకభైరవమూర్తిగారు, బి. ఏ.
౬ వాడపల్లి మురహరిరావుగారు
౭ సి. చంద్రశేఖరరెడ్డిగారు జి. డి. ఏ.

౮ బొల్లాప్రగడ సుందరగోపాలరావుగారు
౯ గూడూరి రామచంద్రరావుగారు
౧౦ జ్ఞానాంబగారు
౧౧ శృంగారపు కోటమ్మగారు

## ఆంధ్రరాష్ట్ర ప్రకృతివైద్యసభలు

ఆంధ్రదేశమున కంతటికిని సంబంధించిన యీ సంఘము యొక్క వార్షిక సభలు ప్రకృతి వార్షికోత్సవములతో పాటు వివిధపట్టణములయందు జరుపబడుచుండెను. మొదటమొదట 1, 2 దినములలోనే సభలు ముగియుచుండెడివి. పోనుపోను ఆ సభలు 3 దినములు జరుపబడుచుండెను. అప్పుడు ప్రకృతివైద్యమును గూర్చిన ఉపన్యాసములు ప్రజలు విన కుతూహలమును జూపుచుండిరి. 3 దినముల సభల్లు ప్రకృతివైద్య ప్రచారమునకు చాలియుండలేదు అని తోచినది. ప్రజలును అట్లే భావింపసాగిరి. 3 దినముల సభలలో విషయముయొక్క సంపూర్ణానుభవమును కలిగించుటకు సాధ్యము కాదనియు ఆ సభలవలన విషయ పరిచయము మాత్రమే కల్గుననియు రూఢిపడినది.
అందువలన బోధనకొఱకై ఇంకొక విధమగు సభలు చేయు అవసరము గోచరించినది.

## ప్రకృతివైద్య శిక్షా శిబిరము

1932 వ సం॥ సెప్టెంబరు ప్రకృతి పత్రికయందు ఇట్లు ప్రచురింపబడినది:—

"1933 వ సం॥ మార్చి 1 వ తేది మొదలు 30 వ తేది వరకు ప్రకృతిరమణీయ మగు ప్రదేశమున ప్రకృతి శిక్షాశిబిరము జరుగును. ప్రకృతివైద్యులు ప్రకృతి విద్యార్థులకు తరిబీదు నిచ్చెదరు." 1932 వ సం॥ అక్టోబరు నెలసంచికలో శిబిరవాసులందరు ఫలాహారమునే భుజింపవలయుననియు, రోగులకు ఉచితముగా సలహా యివ్వబడుననియు, ప్రచురింపబడినది. డిశంబరు సంచికలో శిబిరమునందు బోధించు విషయవివరణ కలదు. మరియు అందిట్లు కలదు.

"ప్రకృతి వైద్యులు ఆంధ్రదేశమునందు పలువురున్నారు. ......వారినందరిని ఒకచోట సమావేశపరచి, వారందరియొక్క అనుభవములను సమన్వయపరచుట అవసరమైయున్నది. మొదట ఆహారవ్యయములు ఎవరికి వారే అచ్చుకొనవలయునని నియమింపబడినను పోను పోను



అది యుక్తమైనపద్ధతి కాదనియు, యెట్లైనను శ్రమ చేసి ఉచితముగానే విద్యార్థులకు ఆహారవసతులను గలిగించుట అవసరమనియు గ్రహింపబడినది."

తదనుగుణ్యముగ 33 వ సంవత్సరం మార్చి ప్రకృతిపత్రికలో ఇట్లు ప్రచురింపబడినది. "అమలాపురం తాలూకా బోర్డుయొక్కయు, కోనసీమ సెంట్రల్ కోఆపరేటివు బ్యాంకుయొక్కయు అధ్యక్షులగు శ్రీ శ్రీ శ్రీ నడింపల్లి సుబ్బరాజుగారి ఆదరణవలన, ప్రకృతి శిక్షాశిబిరము కోనసీమయందు ప్రకృతి రామణీయకముగల సుందర తరుచ్ఛాయలందును, గోదావరియొడ్డున 1935 సం॥ మే నెలలో జరుగను ..........ప్రకృతివైద్య శిక్షణకువచ్చు 40 మంది విద్యార్థులకు ప్రకృతిసిద్ధమగు ఆహారము ఉచితముగా నొసంగబడును............ఫలాదులను మాత్రము తినియుండజాల మని భీతిల్లనక్కరలేదు. ఎన్నియో వత్సరములనుండి ఫలాదుల సేవించుచు బలారోగ్యానందముల గాంచియున్న ప్రకృతి చికిత్సకులు కొందరు శిబిరమును నడుపుదురు. అట్టి యాహారమును సక్రమముగా భుజించువారలకు నీరసము గలుగదని తెలుపుచున్నారము. ప్రకృతి సిద్ధమగు కేవల ఫలాహారమును తిని యుండజాలమనువారును తిని యుండజాలనివారును, యథార్థముగా ప్రకృతి చికిత్సకులు కారు." ఈ విధముగా ప్రకృతి శిబిరముయొక్క అభిప్రాయము పరిణామము పొందినది. దీనికి మూలము నారిశెట్టి హనుమయ్యగారు, ఆయ్యగారి వెంకటరమణయ్యగారు, పుచ్చా వెంకట్రామయ్యగారు. వారే శిబిరమును భావించి రూపము నిచ్చిరి. దానికి డా॥ వాడపల్లి మురహరిరావుగారు, డా॥ బొల్లాప్రగడ సుందరగోపాలరావుగారు, డా॥ పాలపర్తి నరసింహారావుగారు, డా॥ దువ్వూరి రామకృష్ణరావుగారు, డా॥ దివి రంగాచార్యులుగారు, డా॥ చెన్నుభొట్ల భానుమూర్తిగారు, డా॥ జ్ఞానాంబగారు, శ్రీయుత మంత్రిప్రగడ సాంబశివరావు పంతులుగారు, తోడుపడిరి. బ్రహ్మశ్రీ కాశీభట్ల సీతారామయ్య, జ్యోస్యుల శ్రీరామమూర్తిగార్లు మూర్త్యనమస్కారములు నేర్పుచుండిరి.

## ఆంధ్ర ప్రకృతి ధర్మపరిషత్తు

శిబిరములోని అధ్యాపకు లందరును కలసి ఒక సంఘమును స్థాపించిరి. దీనిని అప్పటికే రిజస్టరు చేయబడి యున్న భారతప్రకృతిధర్మప్రచారక సంఘమునకు

అనుబంధముగా చేర్పరచిరి. ఇట్లు ఏర్పరచబడిన సంఘమునకే ఆంధ్రప్రకృతిధర్మపరిషత్తు అని పేరు

## పరిషత్తు ఉద్దేశములు

1. ప్రకృతి జీవనవిధానము ఐహిక, మానసిక ఉన్నతి గలుగుటయేగాక ఆత్మోపలబ్ధికి మార్గదర్శి యని ప్రబోధించుట.

2. అందుకు జీవనవిధానమును ఔపచారికము లగు నిరౌషధ నిశ్శస్త్రచికిత్స లత్యవసరమని నిరూపించుట

3. జీవనవిధానమును బోధించుటకు అవలంబించుటకు అవసరమైన విజ్ఞానము నొసగుట.

## ఈ పరిషత్తుయొక్క విద్యావిధానము

విద్యావిధానము 3 సం॥లలో ఇచ్చుటకు ఏర్పాటు జరిగినది. ఈ కాలములోపల ప్రకృతి జీవనవిద్యావిధానమంతయు పూర్తియగును.

తొలిసంవత్సరము ప్రకృతిచికిత్సలయందలి సామాన్య విజ్ఞానముమాత్రము కలిగింపబడును ఈ పరీక్షయందుత్తీర్ణులైనవారు "ప్రకృతిచికిత్సక" పట్టమున కర్హులై యుందురు. వీరు ప్రకృతివైద్యాచార్యులిచ్చెడి చికిత్సాక్రమము నాచరణలో బెట్టుటకే అర్హులై యుందురు.

రెండవసంవత్సరములో పై శాస్త్రములయొక్క శాస్త్రీయజ్ఞానము బోధింపబడును. వీరు కృతార్థులు కాగానే నిదానచికిత్సాభాగములయందు సమర్థులగుదురు. వారికి "ప్రకృతి వైద్యాచార్య" బిరుదము సమర్పింపబడును.

మూడవసంవత్సరమున తాము గ్రహించిన విద్యయందు పూర్ణప్రజ్ఞగలవారై ప్రకృతి శిబిరములు (Camps) నడుపుటకును యితరవిధముల ప్రకృతిధర్మ ప్రచారములు చేయుట కవసరమైన విజ్ఞానమునంతను గడింతురు. వీరికి "ప్రకృతిధర్మవేది" పట్టమును ప్రసాదింతురు!

## పరిషత్తు నిర్మాణము

ఆంధ్రప్రకృతిధర్మపరిషత్తునకు బెజవాడ కార్యస్థానముగ నిర్ణయింపబడినది.

శ్రీయుత నడింపల్లి సుబ్బరాజుగారు, అధ్యక్షులు (Chancellor)

పుచ్చా వెంకటరామయ్యగారు, ఉపాధ్యక్షులు, శిబిరాధిపతి. (Vice-Chancellor)

నారిశెట్టి హనుమయ్యగారు, వ్యవస్థాపకుడు. (Registrar)

అయ్యంకి వెంకట రమణయ్య పంతులుగారు, అనువ్యవస్థాపకుడు (Assistant Registrar)

సలహాసంఘసభ్యులు:— వాడపల్లి మురహరిరావు, దువ్వూరి రామకృష్ణరావు, బొల్లాప్రగడ సుందర గోపాలరావు, పాలపర్తి నరసింహారావు, దివి రంగాచార్యులు, చెన్నుభొట్ల భానుమూర్తి, జ్ఞానాంబ, సీతారామ అవధూతగార్లు. ఈ పరిషత్తుయొక్క వ్యవహారములన్నియు శిబిరాధిపతియొక్క తుదినిర్ణయమునకు లోబడియుండును.

## "ప్రకృతి చికిత్స" పరీక్షకు

### పఠనీయవిషయములు (మొదటిసంవత్సరము)

1. శారీరశాస్త్రము:— జీర్ణమండలము, నాడీమండలము రక్తాభిసరణము, శ్వాసాశయములు, మూత్రపిండములు, త్వక్కు, పురీషనాళము, జ్ఞానేంద్రియములు, మెదడు.

2. ఆరోగ్యశాస్త్రము:— దినచర్య, ప్రార్థన, స్నానము వస్త్రధారణము, సూర్యకాంతి, వ్యాయామము, విశ్రాంతి, గాలి, నీరు, ఆహారము, నిద్ర, దాంపత్యధర్మములు, గర్భధారణము, బాలింత, శిశుపోషణము, గృహనిర్మాణము, ప్రథమచికిత్స.

3. జలచికిత్స:— అర్షగ్రంథము లేమి చెప్పినది, జలముయొక్క వివిధోపయోగములు, కట్లు, స్నానములు, జల్లులు, ధారాస్నానములు, వస్తి, జలపానము, రోగాద్వైతము, చికిత్సాద్వైతము, కూనేచికిత్సలు.

4. ఉపవాసచికిత్స:— ఉపవాసము యెవరు యెప్పుడు యెందుకు జేయవలయును? ఉపవాసకాలమున తీసికొనవలసిన జాగ్రత – యెవరు ఉపవాసమును జేయగూడదు? అను విషయములు.

5. సూర్యకిరణ చికిత్స:— సూర్యోపాసన, ప్రతిరక్తబిందువు ఒక సూర్యుడే; సూర్యకాంతియందలి రంగులు, వాని లోపమువలన దేహమునందు గలుగు వ్యాధులు. వానిని నివారించుటకు వర్ణముల యుపయోగము, వర్ణారోపణచేయుట, వివిధపరికరములు, వానియొక్క వినియోగము, జాగ్రత.

6. ప్రకృత్యభిగమనము:— ఈశ్వరవాణి, సహజపరిజ్ఞానము, బలము, మృత్తిక, వాయువు, వెలుతురు, స్వాభావికస్నానము, మట్టికట్లు, అధశ్శయనము, చమురుగంకాయలు, పండ్లు.

7. వ్యాయామశాస్త్రము:—దేహముయొక్క బహిష్కావయవములు, వ్యాయామమునకును వానికిని గల సంబంధము. వ్యాయామమునందు రక్తమునకు కలుగు పారిశుద్ధ్యము, కండరములకు గలుగు జిగివి, వివిధములగు రోగములకు వివిధములగు వ్యాయామములు, వానిని ప్రయోగించు కాలము, విధానము, అధికారము, జాగ్రత.

8. యోగవ్యాయామశాస్త్రము:— అధివ్యాధులందు యోగముయొక్క ఉపయోగము, సౌలభ్యము, షట్క్రియలు, ఆసనములు, ముద్రలు, బంధనములు, ప్రాణాయామము, వీనియొక్క అవసరము, ప్రయోగము, అధికారము, జాగ్రత.

9. అంగమర్దన:— దేహారోగ్యమునకు చర్మము - కండరములు - నరములయొక్క చివరలు - ధమనులయొక్కయు, సిరలయొక్కయు చివరలు, ఎట్లు సహాయము చేయుచున్నవి? వానియందలి మాంద్యము ఎట్లు రోగమునకు కారణమగుచున్నది. పిసుకుట - గ్రుద్దుట - చరచుట - గిల్లుట - సాగదీయుట - మెలివేయుట - వీనియొక్క విధానము - ప్రయోగము - అధికారము- జాగ్రత.

10. ఆహారచికిత్స:—అమృతములు, మృతములు, నిషిద్ధములు, పిండిపదార్థములు, మాంసకృత్తులు, క్రొవ్వుపదార్థములు, వానియొక్క స్వభావము; దేహనిర్మాణమునందు వానియొక్క తోడ్పాటు, విటమినులు, దేహారోగ్యమునకు వానియొక్క ఆవశ్యకత; ధాన్యములు - పప్పుపదార్థములు - చమురుపదార్థములు - కూరలు - కాయలు - పండ్లు - దుంపలు - ఆకులు - వానియొక్క వివిధములగు లవణాదిపరిమాణములు. ఏ యే పదార్థములవలన ఏ యే రోగములు ఎట్టివారికి వృద్ధి యగునది? ఏ యే పదార్థములవలన ఏ యే రోగములు తగ్గునది; వంటవానివలన కలుగు లోపములు, దానియందు కలుగు లోపములు, వానిని సవరసపరచు మార్గములు, వివిధరోగములకు వివిధములగు పథ్యములు.

11. కశేరుకాసమీకరణ చికిత్స:— నాడీమండలము, ఇడ, పింగళ, సుషుమ్నానాడులు - మజ్జ - వెన్నుపూసలు - వాని స్వస్థానములు, స్థానచ్యుతి; రోగము, స్వస్థాన స్థాపన - రోగనివారణము.

## "ప్రకృతి వైద్యాచార్య" పరీక్షకు

పఠనీయవిషయములు. (రెండవసంవత్సరము)

1. అస్థినిర్మాణశాస్త్రము:— అస్థిపంజరము; కపాలనిర్మాణము; కబంధనిర్మాణము; బాహువులు; హస్తములు, కాళ్లు; పాదములు; వెన్నెముక; కూపకనిర్మాణము.

2. శారీరశాస్త్రము:—ప్రధానావయవ నిర్మాణములు, వానిక్రియలు. 1 మెదడు, 2 నాడీమండలము, 3 హృదయము, 4 శ్వాసాశయములు, 5 రక్తవాహికలు. 6 జీర్ణమండలము, 7 చర్మము, 8 మలమూత్ర కోశములు, 9 జిహ్వ, 10 ముక్కు, 11 కన్ను, 12 చెవి. జననేంద్రియములు, గర్భోత్పత్తి, పిండక్రమము, 13 జీవరసగ్రంథులు.

3. ఆరోగ్యశాస్త్రము:— (క) దంపతులు గమనించవలసిన విషయములు. బ్రహ్మచర్యము, వ్యాయామము, సూర్యకాంతి, విహారము, ప్రేమ, సద్భావములు.

(ఖ) గర్భధారణకాలమున గమనించవలసిన విషయములు. ఆహార విహారములయొక్క మితి. బ్రహ్మచర్యము, సద్భావము.

(గ) ప్రసవము:—గమనింపవలసిన విషయములు: ఆహారము, నిద్ర, దుస్తులు, పురిటిగది, శౌచము, గాలి, వెలుతురు.

(ఘ) సంతానపాలనము:— పాలులేని పిల్లలు, క్షీరదోహదము, శిశుఆహారములు, దుస్తులు, పరిశ్రమ, విద్య, శిశురోగములు, వాని చికిత్స, తెలివితక్కువ పిల్లలు, దుర్మార్గపు పిల్లలు.

4. సునిశితవైద్యము:— (క) సూర్యోపాసన, శక్తితత్త్వము, శక్తియందలి రెండుభాగములు, శీతశక్తులు, ఉష్ణశక్తులు, రాసాయనిక అనురాగము, ప్రతిరాగము, రాసాయనిక సామరస్యము, వర్ణముల అన్యోన్య సంబంధము, వర్ణములకు శక్తికిని గల సంబంధము; శీతమువలన గలుగువ్యాధులు, ఉష్ణమువలన గలుగు వ్యాధులు, ఏరంగువలన ఏరోగము నయమగును? వర్ణమును ఆరోపించు విధములు, ఉపకరణములు, పారిభాషిక పదములు.

(ఖ) చికిత్సాభాగము:—శ్వాసాశయవ్యాధులు, జీర్ణాశయవ్యాధులు, గర్భాశయవ్యాధులు, జననేంద్రియవ్యాధులు, మూత్రాశయవ్యాధులు, చర్మవ్యాధులు,

మానసిక వ్యాధులు, నాడీవ్యాధులు. నేత్రకర్ణవ్యాధులు, ఇతరములు.

5. జలచికిత్స:—జలచికిత్స పద్ధతులు. జలచికిత్సలకు శాస్త్రీయజ్ఞానము.

6. ఆహారశాస్త్రము:—పదార్థము, శక్తి, జీవము, వికాసము, ఆహారమునందలి విభాగములు, మాంసకృత్తులు, క్రొవ్వుపదార్థములు, కర్బను హైడ్రజములు, సేంద్రియ ఆమ్లములు, నిరింద్రియలోహములు, లవణములు, ఆమ్లములను తగ్గించు పదార్థములు, ఆమ్లమును పెంచు పదార్థములు, విటమినులు, ఆహారము, భూసారము, మానవుని సహజాహారము, ఫలములు, శాకములు, ధాన్యములు, పప్పుపదార్థములు, జంతుపదార్థములు, మాంసాహారములు; ఉద్దీపకపదార్థములు, మత్తుపదార్థములు, ఆహారపానీయములందు కల్తీలు, దుష్టాహారముల వలని నష్టములు, రోగనివారణమందు ఆహారమునుగూర్చి వైద్యుల అభిప్రాయములు, సహజాహారము లవలన రోగనివారణ మగుట, ఆహారములయందలి వివిధద్రవ్యముల పట్టికలు.

7. నిదానశాస్త్రము:—1 కపాలశాస్త్రము, 2 తత్త్వములు, మానసికతత్త్వము, ద్వంధతత్త్వము, కండర తత్త్వము, పోషకతత్త్వము, అస్థితత్త్వము. 3 కనీనికా నిదానము, 4 అష్టస్థానపరీక్ష, 5 శరీరకాంతినిదానము.

## శిబిర నియమావళి

విద్యార్థులు గమనింపవలసిన ముఖ్యవిషయములు.

౧. శిబిరమునందున్న ఫలవృక్షములనుండి కాయలుగాని ఆకులుగాని చివరకు ముఖము కడుగుకొను పుడకలు గాని విరువకూడదు.

౨. శిబిరమునకు ఎదురుగాగాని నదియొడ్డునగాని శిబిరమునకు రెండుఫర్లాంగుల దూరమునగాని మలవిసర్జనము చేయరాదు.

౩. ఎవరుగాని గట్టిగా మాట్లాడరాదు. అట్లు మాట్లాడిన యెడల ఇతరులకు చదువుకొనుట, ప్రార్థనసలుపుకొనుట మొదలగు పనులకు ఇబ్బందిగా నుండును.

౪. అందరును ప్రతిదినము ఉదయము ౪-౩౦ గంటలకే లేవవలెను. రాత్రి ౧౦ గంటల తర్వాత మేలుకొనకూడదు.

౫. ఉదయము ౬ గంటలలోపున శౌచము, స్నానము ముగించి ౬ గంటలకు సూర్యోపాసనకు రావలెను.

౬. ఉదయము ౬-౩౦ గంటలకు పిల్లలకు ఫలాహారము.

౭. ఉదయము ౭ గంటలకు పాఠములు ప్రారంభింపబడును.

౮. ఉదయము ౧౦ గంటలకు ప్రాతఃకాలపాఠముల ముగింపు.

౯. ౧౦ గంటలనుండి ౧౧ గంటలవరకు మధ్యాహ్న భోజనము.

౧౦. ౨ గంటలు మొదలు ౪ గంటలవరకు మరల పాఠములు.

౧౧. ౪ గంటలు మొదలు ౬ గంటలవరకు నడక, వ్యాయామము, ఆటలు, ఆసనములు, స్నానము.

౧౨. ౭ గంటలకు సాయంకాల భోజనము.

౧౩. తోటలోనున్న తుక్కునంతను తోటకు ఉత్తరముగా వెలుపట ఒకేచోట వేయవలెను.

౧౪. విద్యార్థులెవ్వరుగాని గురుమహారాజు ఉత్తరువు పొందనిదే శిబిరమును వదలి వెళ్ళకూడదు.

౧౫. శిబిరమునకు వచ్చువారందరు తమ పేర్లను శిబిరాధిపతికి ఇయ్యవలెను.

౧౬. ప్రతిదినమును విద్యార్థులలోనుండి ముగ్గురు శిబిర సేవకులుగ నియమింపబడుదురు. వారు ఆ దినమున జరుగవలసిన కార్యక్రమము నంతయు సక్రమముగా సకాలమున జరుగునటుల చూడవలెను.

1933, 34, 35 సంవత్సరములలో శిబిర వ్యయములను పరిషత్ అధ్యక్షులైన శ్రీ నడింపల్లి సుబ్బరాజుగారే భరించిరి. శిబిరము ఆయినపల్లి గ్రామమునకు సమీపమున మద్దిశెట్టి రామయ్యగారి మామిడితోటయందు జరుపబడినది. నాల్గవ శిబిరము 1936 సంవత్సరము మే నెలలో మదనపల్లికి సమీపముగా నున్న దండువారిపల్లె గ్రామములో పాపిరెడ్డిగారి మామిడితోటలో జరిగినది. జి. నారాయణస్వామిగారు బళ్లారి, కడప, కర్నూలు, చిత్తూరు జిల్లాలలో తిరిగి రు 604-8-0 చందాల రూపముగా వసూలు చేసి శిబిర వ్యయములకు ఒసంగిరి.

అయిదవశిబిరము బెజవాడలో మే నెలలో 5 వ తేదీ నుండి 25 వ తేదీవరకు దినవహి హనుమంతరావుగారి తోటలో జరిగినది. శిబిరవ్యయములను శిబిరవాసులే భరించిరి.

ఆరవ శిబిరముగూడ బెజవాడయందే 1 వ తేదీనుండి 15 వ తేదీవరకు జరిగినది. శిబిరవ్యయమును శిబిరవాసులే భరించిరి.

ఏడవశిబిరము పశ్చిమగోదావరిజిల్లా దొడ్డిపట్ల గ్రామములో కీ. శే. రామజోగయ్యగారి ఆదరణక్రింద జరిగినది.

చెన్నపురి సరస్వతీసంఘాధిపతులైన శ్రీ భిక్షుస్వామిగారు ప్రారంభోత్సవమును జరిపిరి. ఈ శిబిరములోని విశేషమేమంటే, డాక్టరు ఆచంట లక్ష్మీపతిగారు, కీ. శే. రిటైర్డు డిప్యూటీకలెక్టరు, అల్లూరి రామకృష్ణంరాజుగారు, లోకసంచారి అత్యం నరసింహమూర్తిగారు మొదలగువారు శిబిరవాసముచేసి ఫలితములను కని పెట్టిరి.

ఎనిమిదవశిక్షాశిబిరము దొడ్డిపట్లలోనే గొండి రామజోగయ్యగారి ఆదరణక్రింద జరిగినది. మదరాసు శాసనసభాసభ్యులైన శ్రీ ఓరుగంటి వెంకటసుబ్బయ్య బి. ఏ. గారు ప్రారంభోత్సవమును జరిపిరి.

1941, 42, 43 సంవత్సరములలో బెజవాడయందు శ్రీరాజా సూరిరెడ్డి మంగాయమ్మగారి తోటలో 9, 10, 11 శిబిరములు జరిగినవి. శిబిరవ్యయమును శిబిరవాసులే కాకుండా పట్టణములోని బ్రజలను భరించుచుండిరి.

ఈ విధముగా ఆంధ్ర ప్రకృతి ధర్మపరిషత్ వారు 11 శిబిరముల జరిపి అనేకమంది విద్యార్థులకు ప్రకృతివైద్య విద్యను బోధించి 13 గురిని ప్రకృతి ధర్మవేదులుగా తయారుచేసిరి. 18 మంది, 'ప్రకృతి వైద్యాచార్యులు' గను; 87 మంది, 'ప్రకృతి చికిత్సకులు'గను తయారై ఉన్నారు. వారి పేర్లను ఇచ్చట చేర్చితిమి.

### (N. D) "ప్రకృతిధర్మవేది" పరీక్షలో కృతార్థులైన వారు

1935సం॥రపు మూడవ శిబిరము-వినవల్లి

1. ఉప్మోత్తాల గోపాలరావుగారు, పిల్లలమర్రి సూర్యాపేట P. O. నైజాం
2. అయ్యంకి కృష్ణమూర్తిగారు, బెజవాడ
3. అయ్యంకి వెంకటరత్నంగారు, బెజవాడ
4. ఎ. వి. మాణిక్యం శెట్టిగారు, కొల్లేగాల్
5. కొలిపాక ఆదినారాయణశర్మగారు, బెజవాడ
6. యస్. అన్నపూర్ణమ్మగారు, ఏలూరు

1936 సం॥రపు నాల్గవశిబిరము - మదనపల్లి

7. గండికోట నారాయణస్వామిగారు,

1938 సం॥రపు ఆరవశిబిరం — బెజవాడ

8. బి. ఆనందరావుగారు, బెంగుళూరు
9. అడుసుమిల్లి వెంకటకృష్ణారావుగారు, [illegible], కృష్ణాజిల్లా.

1939 సం॥రపు ఏడవశిబిరము - బెజవాడ

10. గంధం సత్యభాస్కరశర్మగారు,
11. తాతినేని శివకాంతమ్మగారు

1941 సం॥రపు తొమ్మిదవ శిబిరము—బెజవాడ

12. శ్రీ బి. టి. శర్మగారు, B.A.LL.B. అడ్వకేట్-చిటల్‌డ్రుగ్, మైసూర్.
13. బి. వెంకటరమణప్పగారు. ఉపాధ్యాయులు చెన్నరాజుపల్లి - అనంతపురం Dt. పెనుగొండ P.O.

### (M. N) "ప్రకృతి వైద్యాచార్య" పరీక్షలో కృతార్థులైనవారు.

1933 సం॥రపు మొదటి ప్రకృతి [illegible]

1. శ్రీ సతి అన్నపూర్ణమ్మగారు
2. గండికోట నారాయణస్వామిగారు

1935 సం॥రపు మూడవ శిబిరము, [illegible]

3. మేమూరు [illegible]గారు, [illegible], [illegible]
4. బి. వి. కృష్ణ[illegible]గారు, [illegible]

1936 సం॥రపు నాల్గవ శిబిరము, మదనపల్లి

5. గండికోట నా[illegible]గారు

19 7 సం॥రపు [illegible], బెజవాడ

6. తాతినేని శివకాంతమ్మగారు
7. బి. వెంకటరమణప్పగారు
8. అడుసుమిల్లి వెంకటకృష్ణారావుగారు
9. బి. ఆనందరావుగారు

1938 సంవత్సరపు ఆరవ ప్రకృతి శిబిరము, బెజవాడ

10. గంధం సత్యభాస్కరశర్మగారు
11. మేమూరి రామాచార్యులుగారు

1939 సంవత్సరపు ఏడవ శిబిరము, బెజవాడ

12. గొట్టిపాటి రామారావుగారు
13. స్థానం పార్థసారథిగారు
14. బి. టి. శివన్ గారు

1940 సంవత్సరపు ఎనిమిదవ శిబిరం, దొడ్డిపట్ల

15. పి. అన్నపూర్ణమ్మ గారు
16. వంగరి విశ్వనాథంగారు

1941 సంవత్సరపు తొమ్మిదవశిబిరం, బెజవాడ

17. శ్రీదేవులపల్లి రాఘవేంద్రరావుగారు, ధర్మభిక్షు అర్జునభాండాగారము, సూర్యాపేట, (నైజాం)
18. శ్రీ గంగుల శాయిరెడ్డిగారు, ఉపాధ్యాయులు, జీడికల్లు, జనగామ P. O (నైజాం)

(B. N) "ప్రకృతి చికిత్సక" పరీక్షలో కృతార్థులైనవారు

1933 సంవత్సరపు మొదటి ప్రకృతి శిబిరము, ఐనవల్లి.

1. చిమట రామారావుగారు
2. అత్యలశెట్టి మాణిక్యంగారు
3. అయ్యంకి కృష్ణమూర్తిగారు
4. కొలిపాక ఆదినారాయణ శర్మగారు
5. గుళ్లపల్లి శ్రీనివాసులుగారు
6. గోపరాజు సత్యనారాయణగారు
7. ఉమ్మెత్తాల గోపాలరావుగారు
8. కందాడై శఠగోప రామానుజాచార్యులుగారు
9. జోస్యుల శ్రీరామమూర్తిగారు
10. అయ్యంకి వెంకటరత్నంగారు
11. రాఘవరపు మునుస్వామిగారు
12. నిమ్మగడ్డ కృష్ణమూర్తిగారు
13. నామగుంట్ల హనుమంతరావుగారు
14. గుళ్లపల్లి రాధాకృష్ణమూర్తిగారు
15. కాశీభట్ల జగన్నాథంగారు
16. నాదెళ్ల జగన్నాథంగారు
17. ధంపెమూడి పూర్ణయ్యగారు
18. మద్దింశెట్టి వెంకటనరసింహంగారు
19. లక్ష్మీశ్రేష్ఠి పట్టయ్య శర్మగారు
20. సంపర కృష్ణమాచార్యులుగారు

1934 సంవత్సరపు రెండవ ప్రకృతిశిక్షా శిబిరము, ఐనవల్లి.

21. వేదూరు రాఘవాచార్యులుగారు
22. గండికోట నాగయ్యగారు

1935 సంవత్సరపు మూడవ ప్రకృతి శిక్షా శిబిరము, ఐనవల్లి.

23. దర్భా జయవర్షన్ గారు, తెనాలి
24. పట్నాల బ్రహ్మడుగారు, తామరపల్లి
25. యస్. వెంకటరమణయ్యశెట్టిగారు, బళ్ళారి
26. శ్రీమాన్ కొమాండూరి గోవింద రాజాచార్లుగారు, రాజమండ్రి
27. కొంగంటి లక్ష్మమ్మగారు, ధరణికోట ఆశ్రమము, కపిలేశ్వరపురం, కృష్ణాజిల్లా.

1936 సంవత్సరపు నాల్గవ శిక్షాశిబిరము మదనపల్లి.

28. బళ్ళాపురపు గోపాల్ గారు
29. బండపల్లి వెంకటరమణప్పగారు
30. ఓరుగంటి మల్లయ్యగారు
31. పాపనపల్లి లక్ష్మణరావుగారు
32. గండికోట సీతమ్మగారు
33. హెచ్. జి. అంబేకరుగారు
34 బెంగుళూరు ఆనందరావుగారు
35. బావి నంజాండప్పగారు
36. గంగిశెట్టి చిన్నసుబ్బయ్యగారు
37. పమిడిపర్తి పుల్లయ్యగారు
38. దొంతె శ్రీనివాసులుగారు
39. కోయంబత్తూరు నాగరాజరావుగారు
40. గుండ్లూరు మునిలక్ష్మమ్మగారు
41. సిరిగుప్ప రంగయ్యశెట్టిగారు
42. తాతినేని శివకాంతమ్మగారు
43. మార్షల్ సిల్వైరా గారు
44. గండికోట శ్యామలాంబగారు
45. పొన్నగంటి రామచంద్రయ్యగారు
46. అడుసుమిల్లి వెంకటకృష్ణారావుగారు

1937 సంవత్సరపు అయిదవశిబిరము, బెజవాడ.

47. నైషధం వెంకటాచలపతిగారు
48. శిష్ట్ల దక్షిణామూర్తిశాస్త్రిగారు

49. పుచ్చా శేషగిరిరావుగారు
50. శిష్ట్లా వెంకటేశ్వర్లుగారు
51. పర్వతం రాజేశ్వరరావుగారు
52. గంధం సత్యభాస్కరశర్మగారు
53. కామరాజుగడ్డ వెంకటలక్ష్మీకామేశ్వరరావుగారు
54. గుదిబండి సుబ్బారెడ్డిగారు
55. పుచ్చా ఆంజనేయులుగారు
56. మేడూరి వెంకటరామాచార్యులుగారు
57. బి. టి. శివన్‌గారు
58. విమ్మగడ్డ నారాయణరావుగారు

1938 సంవత్సరపు ఆరవ ప్రకృతి శిబిరము, బెజవాడ.

59. స్థానం పార్థసారథిగారు
60. గొట్టిపాటి రామారావుగారు
61. మల్లాప్రగడ రామలింగేశ్వరశర్మగారు
62. టి. శ్రీనివాసరావుగారు

1939 సంవత్సరపు ఏడవ ప్రకృతి శిబిరము, దొడ్డిపట్ల.

63. పుచ్చా వెంకటేశ్వర్లుగారు
64. గంగుల సాయిరెడ్డిగారు
65. వెంపరాల రామమూర్తిగారు
66. పొట్లూరి అన్నపూర్ణమ్మగారు
67. అనప్పుండి వెంకటరత్నంగారు
68. కందేపు వెంకటేశ్వర్లుగారు

1940 సం॥రపు ఎనిమిదవ శిబిరము, దొడ్డిపట్ల

69. కనుపర్తి వెంకటేశ్వరశర్మగారు
70. ఇప్పటము శ్రీరామమూర్తిగారు
71. దేవులపల్లి రాఘవేంద్రరావుగారు
72. కొమరగిరి సాంబశివరావుగారు

1941 సం॥పు తొమ్మిదవ శిబిరము, బెజవాడ.

73. డాక్టరు టి. నరసింహాచార్యులుగారు, బి. ఏ., ఆయుర్వేద వైద్యులు, హనుమకొండ (నైజాం)
74. శిష్ట్లా దక్షిణామూర్తిగారు, టీచరు, గవర్నమెంటు ట్రైనింగుస్కూలు, బెజవాడ
75. శ్రీరామకృష్ణ గుంటీగారు, నేచురోపాతిక్ క్లినిక్, 207 సుల్తాను బజారు; హైదరాబాదు (దక్కను)
76. శ్రీ ఈపులపాటి వెంకటకృష్ణంరాజుగారు, విద్యార్థి, ప్రకృతి ధర్మపరిషత్ - బెజవాడ.
77. కొండపల్లి బసవలింగంగారు, లక్ష్మీవారప్పేట, రాజమండ్రి
78. చిన్నం రత్తయ్యగారు, మునసబు - బలుసుపాడు, సత్తెనపల్లి పోష్టు
79. డా. గొట్టిముక్కల అంకమరాజుగారు, వైద్యులు చిగురుపాడు, గుంటూరుజిల్లా.
80. రావూరి నాగభూషణాచార్యులుగారు, రేటూరు, అప్పికట్ల పోష్టు.
81. సి. తిరుమలరావుగారు, ధర్మభిక్షు ఆర్జన భాండాగారము, సూర్యాపేట (నైజాం)
82. గంజి రామానుజంగారు, టీచరు మేనేజరు, పాతిమంగళగిరి

1942 సంవత్సరపు పదవశిబిరము - బెజవాడ

83. యస్. వి. దీక్షితులుగారు. M. A. సికిందాబ్రాదు
84. మృత్తింటి ఆంజనేయులు, B. A. దంతలూరు, Via. తెనాలి
85. గొల్లకోట సత్యరాజులు, విశాఖపట్టణము
86. ఎ. యస్. నరసింహ అయ్యరుగారు, తిరుచునాపల్లి
87. టి. ఆర్. సుబ్రహ్మణ్యంగారు, సికింద్రాబాదు

ప్రస్తుత కార్యనిర్వాహక వర్గ మిట్లున్నది.

శ్రీ చెన్నుభట్ల భానుమూర్తిగారు, ప్రెసిడెంటు.
శ్రీ పుచ్చా వెంకటరామయ్యగారు, శిబిరాధిపతి, ప్రధాన అధ్యాపకులు
శ్రీఅయ్యంకి వెంకటరమణయ్యగారు, వ్యవస్థాపకుడు.

సలహా సంఘసభ్యులు

వాడపల్లి మురహరిరావుగారు
కొలిపాక ఆదినారాయణశర్మగారు
పాలపర్తి నరసింహారావుగారు
తాండవకృష్ణగారు వగైరా

పది శిబిరములలోను పనిచేసిన అధ్యాపకవర్గము

1. డాక్టరు పుచ్చా వెంకటరామయ్యగారు
2. ,, బొల్లాప్రగడ సుందరగోపాలరావుగారు
3. ,, పాలపర్తి నరసింహారావుగారు
4. ,, వాడపల్లి మురహరిరావుగారు
5. ,, కొలిపాక ఆదినారాయణశర్మగారు
6. ,, చెన్నుభొట్ల భానుమూర్తిగారు

7. డా॥ నారిశెట్టి హనుమయ్యగారు
8. ,, చెందుకూరి ఆంజనేయులుగారు
9. ,, దివి రంగాచార్యులుగారు
10. ,, శ్రీమతి జ్ఞానాంబగారు
11. ,, అయ్యంకి వెంకటరమణయ్యగారు
12. ,, శ్రీమతి అన్నపూర్ణమ్మగారు
13. ,, గండికోట నారాయణమూర్తిగారు
14. ,, మవ్వారి రామకృష్ణారావుగారు
15. శ్రీ మంత్రిప్రగడ సాంబశివరావుగారు
16. ,, కాశీభట్ల సీతారామయ్యగారు
17. ,, జ్యోస్యుల శ్రీరామమూర్తి గారు
18. ,, అయ్యంకి కృష్ణమూర్తిగారు
19. ,, ఎ. వి. మాణిక్యం చెట్టిగారు
20. ,, ఉమ్మెత్తాల గోపాలరావుగారు
21. శ్రీ వేమూరి రామమూర్తిగారు
22. డాక్టరు వేగిరాజు కృష్ణంరాజుగారు
23. హఠయోగి శ్రీరామరాజ యోగీంద్రులవారు
24. యోగవిద్వాన్ భాగవతుల రామమూర్తిశాస్త్రి గారు
25. శ్రీ మేడూరి సీతారామాంజనేయులుగారు
26. శిష్ట్లా వెంకటేశ్వర్లుగారు
27. అత్యం నరసింహమూర్తిగారు
28. ఓరుగంటి వెంకటసుబ్బయ్యగారు
29. పువ్వాడ పేరాజుగారు
30. డాక్టరు ఆచంట లక్ష్మీపతిగారు
31. ,, భిక్షుస్వామిగారు
32. ,, బి. వెంకట రమణప్పగారు
33. ,, డి. టి. నరసింహాచార్యులుగారు
34. సర్దారు గొల్లపూడి సీతారామశాస్త్రిగారు
35. శ్రీ గూడూరి రామచంద్రరావుగారు
36. ప్రొఫెసరు పాండురంగారావుగారు
37. శ్రీ వల్లభుని నాగేశ్వరరావుగారు
38. రంగావఝుల నాగభూషణముగారు
39. శిష్ట్లా దక్షిణామూర్తి శాస్త్రిగారు
40. స్థానం పార్థసారథిగారు
41. వి. వి. యల్. నారాయణరావుగారు
42. చిన్నకోట వెంకటరత్న శర్మగారు
43. చిమట వెంకట రమణరావుగారు

## శ్రీ రామకృష్ణ ప్రకృతి చికిత్సాలయము

మునులతోట, రేపల్లెతాలూకా, గుంటూరుజిల్లా.

ఇచ్చట ఔషధములు, ఆపరేషనులు, ఇంజక్షనులతో నిమిత్తము లేకుండ యోగవ్యాయామ వివిధ ప్రకృతి చికిత్సా విధానములచే కుష్ఠు, బొల్లి, ఉబ్బసము, క్షయ, మూర్ఛలు, పిచ్చి, వంధ్యాత్వము మరియు సుఖవ్యాధి మొదలగు మానవులకు సంక్రమించు సమస్తవిధము లగు శారీరక మానసికము లగు రుగ్మతలు నివారింపబడును. మరియు స్థూల దేహులు సన్నని వారుగను, దుర్బలశరీరులు బలిష్ఠులుగను, అందవికారులు సౌందర్యవంతులుగను చేయబడుదురు. బీదలకు మాత్రము ఉచితముగా చికిత్స చేయబడును. వివరములు కోరువారు 0-6-0 పోష్టుబిళ్ళలు పంపించినచో "ప్రకృతి వైద్య" మను గ్రంథము పంపబడును.

## ప్రకృతి ధర్మ పరిషత్ వారి చికిత్సాలయము, సత్యనారాయణపురము, బెజవాడ.

ప్రధాన చికిత్సకులు : డాక్టరు కొలిపాక ఆదినారాయణశర్మ.

ఈ చికిత్సాలయమున సమస్తవ్యాధులును వివిధప్రకృతి చికిత్సల సహాయముచే నివారింప బడును. రోగులు చికిత్సాలయమందు నివసించుటకు వసతులు కలవు. బయటి రోగులకు సలహాలివ్వబడును. ఉత్తర ప్రత్యుత్తరముల ద్వారా కూడా సలహాలివ్వబడును. రోగులు చదువుకొనుటకు గాను పెద్ద ఆదర్శ గ్రంథాలయము కూడ నెలకొల్ప బడినది. ప్రతివారిని విజ్ఞానవంతులుగాను తమ ఆరోగ్యమును ఇతరుల సహాయము నపేక్షింపకుండ కాపాడుకొను వారిగను తయారుచేయుటయే ఈ సంస్థ యుద్దేశ్యము. వివరములకు రిప్లయి కార్డుతో చిరునామాకు వ్రాయుడు.



# ఆంధ్రదేశమునందు
# ప్రకృతి వైద్యమును వ్యాపింపజేసినవారు

## స్వర్గస్థులు

### 1. శే. జ్ఞానాంబగారు

ఈ మహనీయురాలు గోలి సుబ్బారాయుడు, శేషమ్మ గార్లకు కలిగిన కుమార్తె. ఈమె మొదటి పేరు కనకదుర్గ. తల్లియే చదువు చెప్పినది ఈమెను శేషమ్మ గారి తమ్మునకు ఇచ్చి వివాహము చేసిరి పదునాల్గవ యేట ఆమెకు సంసారమునందు విరక్తి కలిగెను. అప్పుడే ఆమె పడమటలంకలోని సీతారామ అవధూత గారి శిష్యురాలైనది. మౌనవ్రతదీక్ష కొన్నాళ్లు సాగించిన తర్వాత ఆంగ్లము, బంగాళీభాషలను కలకత్తా నగరమునందుండి అభ్యసించెను. తరువాత హిందీ, సంస్కృతభాషలను కూడా తగుమాత్రము అభ్యసించి బ్రాహ్మమతప్రచారకురాలుగా పనిచేసెను. ఇరువది అయిదు సంవత్సరములు వండని పదార్థములను తిని జీవించినది. బాల్యమునుండియు ఈమెకు కవితాశక్తి కలదు. కొన్ని చిన్న పద్యకావ్యముల రచించెను. ఈమె రచించిన గ్రంథములు 1. వర్ణచికిత్స 2. వర్ణవైద్యము 3. లక్ష్మణజలచికిత్స 4. కూనేమహర్షి బోధ 5. నిర్విచార భావి జీవనము 6. పచ్చితిండివలన ప్రయోజనము 7. తెల్లచక్కెరవలన విపత్తు 8. తేనీరు విషతుల్యము 9. ఔషధవైద్య మొక యూహాశాస్త్రము 10. ఆరోగ్యము, కామేచ్ఛ 11. ఆహార రసాయనశాస్త్రము మొదలగునవి.

1920 సంవత్సరము ఫిబ్రవరి నెలలో కీ. శే. సారిశెట్టి హనుమయ్యగారు ఒక ఫూల్‌స్కేపు 1/4 సైజు ట్రెడిల్ కొని కొద్దిగా తెలుగుటైపునుకూడా కొని ప్రకృతి పత్రిక అచ్చువేయ తలచిరి. ఆయన ఉద్యమమునకు తోడ్పడినయామె సోదరి జ్ఞానాంబ. ఆంధ్రవిజ్ఞాన సర్వస్వములోని అచ్చుకూర్పు అను వ్యాసము చూచి, ఆమె చిప్పు అక్షరములను కూర్చుట నేర్చుకొనినది. సమయము మిగిలినప్పుడు కష్టమని ఆమె తన నన్నని వేళల్లో ప్రకృతిపత్రిక వ్యాసాలను అచ్చు కూర్పు చేసేది. హనుమయ్యగారు ప్రూఫులు చదివియిస్తే ఆమె దిద్దుబాటు చేసేది. పత్రికా ముద్రణమే కాకుండా వారు ఆ చిన్న ట్రెడిలుమీద అచ్చుపనులు చేసేవారు. అన్నిటిలోను ఆమె తోడ్పడేది. ఎన్నో యింగ్లీషు వ్యాసాలను తెనిగించేది. చందాదారుల చిరునామాలను వ్రాసేది. పత్రికలకు కాగితములు మడిచేది. ఇన్ని చేసినా ఆమె ప్రకృతిఫీజు వైద్యములోనుండి ఒకపైసా కూడా వాడుకొనలేదు. అన్నగారిదగ్గర వద్దనే ఉన్న హనుమయ్యగారు ఆమెను ఏదైనా జీవితవృత్తిని ఏర్పాటు చేస్తానంటే ఆమె సమగ్రంగా నిరాకరించినది. ప్రకృతి పత్రికా సంగ్రహణమునందేమి, ప్రకృతి కార్యాలయములోని వ్యవహారముల నిర్వహించుటయందేమి, శిబిరముల సమయములలోనేమి, ఆమె యెంతో తోడ్పడెను.

ఆమె యెన్నో స్త్రీ సమాజాలను స్థాపించినది స్త్రీ విద్యకెంతో తోడ్పడినది. ఎంతో మంది బాలికలకు బ్రాహ్మప్రార్థనలను నేర్పినది. ఎన్నో స్త్రీ సమాజాలకు ఆమె మార్గదర్శిగా ఉండేది. ఆమె గానములో కవిత్వము చెప్పగలదు. ఇంగ్లీషు గ్రంథాలను తెలిగించగలదు. వంగ, హిందీ, సంస్కృతభాషల చదివి గ్రహింపగలదు. ఆమె ఉపన్యాసమిస్తూ ఉంటే ఉపనిషత్తులలోని కథలు, సూక్తులు, యెన్నో పలుమారు తమవలె వినేవి. 29-6-1942 వ తేదీన ఉదయము 9 గంటలకు ఆమె పరమపదించినది. ఆమె చేసిన సేవ ప్రకృతి వైద్యమార్గమును తెలుపును యిప్పటికిని మరువదగినది కాదు.

## 2. కీ. శే. నడింపల్లి సుబ్బరాజుగారు.

తూర్పుగోదావరిజిల్లా అమలాపురము తాలూకా కోమరుపాడు వీరి జన్మస్థానము. శ్రీమంతులు. ప్రకృతి వైద్యమునందు మితిలేని అభిమానము కలవారు. ఆంధ్ర ప్రకృతి ధర్మపరిషత్తునకు 1932 సంవత్సరమునుండి 1940 సంవత్సరము డిశంబరు 7 వ తేదీన వారు మరణించువరకు అధ్యక్షులుగా నుండిరి. మొదటి మూడు శిబిరవ్యయములను తా మొక్కరే భరించిరి. మీ రెప్పుడు ప్రకృతి శిబిరమును జరుపదలచుకొన్నా, నా ఆహ్వానము సిద్ధముగా నున్నదని చెప్పుచుండిరి. కోనసీమలో ఒక ఆదర్శమైన చికిత్సాలయమును నెలకొల్పవలెనని వారికి అభిలాషగా నుండేది. పుచ్చా వెంకట రామయ్యగారిని, అయ్యంకి వెంకటరమణయ్యగారిని ఒకతూరి కోనసీమ వస్తే అట్టి చికిత్సాలయము నేర్పాటు చేసామనేవారు. దురదృష్టవశముచేత యీ ముగ్గురు కలిసి పనిచేయుటకు సందర్భపడలేదు. నడింపల్లి సుబ్బరాజుగారు, 'క్రోమోపతిక్ ఇన్స్టిట్యూట్' నందు సభ్యులై ఉన్నారు. వారు ప్రచురించిన 'Human Culture and Cure' అను పుస్తకమునకు మొదటి చందా రు 200/-లు పంపి సహాయపడియుండిరి. ఇన్ని విధములుగా ప్రకృతి ఉద్యమమునకు సహాయము చేసిన వీరి మృతివలన ఉద్యమాభివృద్ధికి యెంతేని ఆటంకము కలిగినదని చెప్పుటలో అతిశయోక్తి లేదు.



## 3. కీ. శే. రామరాజయోగీంద్రులవారు.

పశ్చిమగోదావరిజిల్లా నరసాపురము తాలూకా ఏనుగువానిలంక వీరి నివాసస్థలము. సామాన్యక్షత్రియ కుటుంబములో జన్మించి స్వయంసహాయమువలన విద్యాభివృద్ధుల గడించి యోగశాస్త్రము నభ్యసించి, అవలంబించి అసంఖ్యాకములైన పరిశోధనలచేసి కీర్తి గాంచిరి. వారు ప్రకృతి కార్యాలయముద్వారా 1. మహాయోగము 2. మహారోగము 3. అనుభవానందము 4. జలచికిత్స 5. స్వీయచరిత్ర మొదలగు గ్రంథములనే కాకుండా 1. తత్త్వాలక్ష్యార్ణవము 2. తత్త్వవిజ్ఞానచూడామణి 3. సమాజ సత్యాగ్రహము, రచించి ప్రచురించిరి. నైష్ఠిక బ్రహ్మచారి, కేవలఫలాహారి. లోకముకోసము కాకుండా ఆత్మతృప్తికై వారెన్నో ఆహార పరిశోధనల చేశారు. వారి స్వీయచరిత్రలో ఈ పరిశోధనల వలన వచ్చిన బాధల నన్నిటినిగూర్చిన వివరము లున్నవి. యోగులుగా యేమి చేయకూడదో, యోగులు కాదలచినవారు యేమిచేయాలో వారు చక్కగా నిరూపించారు. చంచలచిత్తులను వారు చూస్తూనే తెలుసుకొనేవారు. అందువల్ల అట్టివారు తమ దగ్గరకు వచ్చినప్పుడు వారి కేమీ చెప్పకుండా పంపేవారు. వారు నిరుత్సాహముతో మరలిపోయేవారు. అట్టివారికి యోగము నేర్పితే వారా యోగమువల్ల చెడిపోవుటయేగాక యోగమునకు అప్రతిష్ఠ వస్తుందనేవారు. ఆహారపరిశోధనలు చేయుటలో వారు యెన్నోతూరులు చావు బ్రతుకుల మధ్య ప్రయాణము చేశారు. అనేకవస్తువులను శోధించి వస్తుగుణములను నిరూపించారు. వారి స్వీయచరిత్ర చదివినవారికి యివన్నీ తెలుస్తవి. వారిట్లు వ్రాసుకొన్నారు.



"మా జీవిత మను గడియారములో పగలు పండ్రెండు గంటలైనది. ఒంటిగంట కావస్తున్నది. ఇంకా సాయంత్రమగుటకు సగము కాలమే మిగిలియున్నది. ఈలోపుగా చక్రము అరిగి జబ్బిచ్చిపోయి మా జీవిత మను గడియార మాగిపోవునో, లేక మేము వాడుకొనుచుండు వాడుకనుబట్టి సాయంత్రమగువరకుగాని రాత్రి పండ్రెండు గంటలు కొట్టువరకుగాని తిరుగునో చెప్పు టెట్లు? కాని వేళతప్పకుండా నిరంతరము 'కీ' యిస్తూ మధ్య మధ్య ఆయిలుచేస్తూ దుమ్ము చేరనీయక కడు భద్రముగా కాపాడుతున్నాము. స్నాన, పాన, ఆహార, విహారములు, ప్రాణాయామాది యోగసాధనలు, షట్కర్మలు యథావిధిగా చేయుచున్నాము. మా గడియారపు కొద్ది గొప్ప మరమ్మతులు యితరులచేత చేయింపము. ఇంత జాగ్రత్త పడుచున్నను దైవగతివలన గాని, గడియారములోని పనిముట్లు విలువలేని వగుటవలనగాని అది చేయిజారి క్రిందపడి బద్దలైన చేసే దేమిటి?" సరిగా అలాగే జరిగినది. తల్లిదండ్రులవల్ల వారికి రోగాలే సంక్రమించినాయి. ముష్టిచెంబు చేతికర్ర గాని [illegible] సంక్రమించిన రోగాలు యోగానికి అడ్డు వచ్చినాయి. [illegible] భారతములో మహా పురుషు [illegible] అదే పీకకిన్ని [illegible] యోగానికి [illegible] పండ్లు [illegible] తొరగాయలు, మొలకెత్తిన ధాన్యాలు, నలగచేసిన మామిడిచాప (తాండ్ర) ఎండించిన అరటిగుజ్జు మొదలైనవాటితో, జానరాగ్ని [illegible] వలన వచ్చేది. ఇన్ని ఆటంకాలమధ్య వారీ యోగాన్ని జరుపుకొంటూ యెప్పుడో తమ తోటలో పండిన పండ్లను తిని ఆదర్శయోగిగా జీవింపదలచిన సుఖస్వప్నాల కంటూ ఉండేవారు వారి కోరికలు. స్వప్నాలను దాటి యీవలకు రాలేదు. వారి పెనుగులాట జీవితపోరాటములో పెనుగులాటగానే మిగిలిపోయినది. వారా శుభదినమును చూడనే లేదు. ఆ కుగ్రామములోనే

స్వహస్తనిర్మితకుటీరములోనే ఆ నిరాడంబర జీవితాన్ని ముగించారు. వారి నిష్కల్మష జీవితాన్ని ఆమోదించిన వారు తెనుగుదేశములో వారి శిష్యులుగా చేరి, తమ జీవితాలను సత్పథాల నడుపుకొనుచున్నారు. ఇట్టి శిష్య వర్గము, వారికి వందలాది కలరు. కోళ్లు, కొక్కిరాయిలను తినువారెందరో వారి శిష్యులై, కొబ్బరి, అరటి పండ్లను తినుచున్నారు. కల్లు, సారాయిలను త్రాగువారెందరో వాటిని మాని పాలను త్రాగి జీవిస్తున్నారు.



కాఫీ, టీలు త్రాగకపోతే చస్తామనేవారు, వారి శిష్యులై వుండి మంచి నీటిని త్రాగి తృప్తిపడుచున్నారు. ఇవి సామాన్యవిషయాలు కావు. పొడుము, చుట్ట, బీడి, మొదలగు దురభ్యాసములు కలవారిని వారు తమ శిష్య వర్గములోనికి చేర్చుకొనే వారు కారు. వారి శిష్యులలో యెంతోమంది ఉప్పును కూడా వదలివేశారు.

శ్రీయోగిగారు ఉప్పును ఖండిస్తూ అనేక వ్యాసాలను వ్రాశారు. ఉపన్యాసాల నిచ్చారు. కారము, పులుపు కంటెనూ ఉప్పు యెక్కువ అపకారము చేస్తుందని వారి నమ్మిక.

వారి స్వీయచరిత్ర చదవని వారికి వారెంత గొప్పవారో ఊహించుటకైనా అలవి కాదు. 21-8-41 తేదీన వారు నిర్యాణము పొందేవరకు వారు చేసిన పరిశోధనలన్నీ, వారు పడిన కష్టములన్నీ ప్రకృతి ఉద్యమానికి, యోగవిజ్ఞానానికీ యెంతో అభివృద్ధిని కలిగించినవని



చెప్పిన అతిశయోక్తి యేమియు లేదు. అకాలములోనే వారు నిర్యాణమును పొందుటవలన ప్రకృతిఉద్యమానికి తీరని కొరత వాటిల్లినది.

## 4. కీ. శే. డా. బొల్లాప్రగడ సుందర గోపాలరావుగారు

బొల్లాప్రగడ వెంకటాచలం, బి. ఏ. గారికి 1879 సంవత్సరములో సుందరగోపాలరావుగారు మొదటి సంతానముగా జన్మించిరి. వీరిపూర్వులు మంచి ఆరోగ్యవంతులై 90, 100 సంవత్సరములవరకు జీవించి పండినపండ్లు రాలినట్లు స్వర్గస్థు లగుచుండిరి. వీరి తాతగారు గోపయ్యగారు మైసూరు రాజ్యమున ఈనాం కమీషన్‌లో పనిచేసి 40 వ సంవత్సరముననే మృతి నొందిరి. వీరి తండ్రిగారు వెంకటాచలము బి. ఏ. గారు 30 వ యేటనే మరణించిరి. అప్పటికి గోపాలరావు పంతులుగారికి 8 సంవత్సరముల వయస్సు. మైదవోలు సుబ్బారావు పంతులు బి. ఎ. గారు గోపాలరావుగారికి మేనమామ. వారే మన పంతులుగారికి విద్యాబుద్ధులు నేర్పించి పెంచిరి. సుబ్బారావు పంతులుగారి పినతల్లియే గోపాలరావుపంతులుగారి రోగిష్ఠి తల్లికి ఉపచరించుచుండెను. వెంకటాచలము గారు చురుకైనవారు. నియమరహితమైన జీవితము వలనను, అక్రమ జీవితము వలనను వారు అకాలముననే 30 వ యేట మరణించిరని శ్రీ పంతులుగారే వ్రాసియున్నారు. వారి తల్లికి 3 కాన్పులు. ప్రతి కాన్పు మిక్కిలి బాధతో కూడియుండెను. ప్రతి ప్రసవమును ఆమెకు మృత్యుతుల్యముగా నుండుచుండెను. ఆమె ప్రసవానంతరము కొన్ని మాసములవరకును రోగముతో తీసుకొనుచుండెను. ఆమె కందువలన నాడీ దౌర్బల్య మేర్పడెను. మూడవ కాన్పున నొక శిశువు గలిగి అతడు 21వ రోజుననే మరణించెను. ఆమెకు అప్పటినుండి కాళ్ళు స్వాధీనము తప్పెను. అప్పటి నుండి ఆమెకు పినతల్లి సేవ చేయవలసివచ్చెను.

గోపాలరావుగారికి తల్లినుండి నాడీదౌర్బల్యము సంక్రమించెను. బడిలో చదువుకొను రోజులలో వారికి ఒక కనుగ్రుడ్డు మిక్కిలి బాధ నొసంగుచుండెను. పార్శ్వపు తలనొప్పివలన చదువుకూడ చెడుచుండెను. ప్రతి శీత కాలమునను, అతిసారమో, గ్రహణియో, మలబద్ధకమో, వారికి గలుగుచుండెను.

1891 సంవత్సరములో నవగా వారి 13 వ యేట మిక్కిలి తీవ్రమైన టయిఫాయిడ్ జ్వరము వచ్చెను. అప్పటికి వారికి 7 సంవత్సరముల చెల్లెలుండెను. ఆమె రక్తాతిసారముతో మరణించెను. చివరకు వారి మాతృ



సంతానమున మన గోపాలరావుగారొక్కరే మిగిలిరి. 1902 సంవత్సరములో గోపాలరావుగారు రాజమండ్రిలో యఫ్. ఏ. చదువుచుండిరి. అప్పుడు వారికి తీవ్రమగు అతిసారము కలిగి కాళ్ళు స్వాధీనము తప్పెను. సుబ్బారావు పంతులుగారు వారిని గుంటూరు తీసుకొని వెళ్ళి డా॥ థామర్సింగు, యం.డి. గారిచేత వైద్యము చేయించిరి. వారు మిక్కిలి దయతోను, శ్రద్ధతోను మందులేమియు నీయక సహజములగు ఉపచారములతో రోగమును కుదిర్చిరి. మరియు గోపాలరావుగారికి శరీరశాస్త్రమును చదువుకొనుటకు శ్రద్ధను రగుల్కొలిపి కావలసిన గ్రంథములను సమకూర్చి యొసంగియుండిరి. వారిసహాయమువలన గోపాలరావు గారికి జీర్ణశక్తి వృద్ధిపొందెను.

1911 సంవత్సరములో గోపాలరావుగారికి భగంద

రము (Fistula) యేర్పడెను. వారిని మదరాసు తీసుకొనిపోయి చూపించిరి. తాము శస్త్రము చేయుదుమనియు, ఆ చేయుటలో సినూస్ యే మాత్రము మిగిలినా, భగందరము తిరిగి రావచ్చుననియు చెప్పిరి. అప్పుడు గంధము వెంకట కృష్ణారావుగారు, తమ క్షయరోగమును కూనీవైద్యముతో కుదుర్చుకొని కూనే వైద్యమును యావజ్జీవము ప్రచారము చేయు ఉద్దేశము కలిగి కూనేవైద్యప్రచారము చేయుచు మదరాసునం దుండిరి.

వారు గోపాలరావుగారికి భగందరము కూనే వైద్యముతో శాశ్వతముగా కుదురుటయేగాక యితర రోగములు గూడ నిర్మూలమగునని సెల విచ్చిరి అందువలన వారి సలహాతో తొట్టి వైద్యము నారంభించిరి.

మొదటి 16 దినములలోను చెప్పదగిన మేలేమియు కలుగలేదు. 16 దినములును రోజుకు రెండు తూరులు కాలప్రవృత్తి మాత్రి మగుచుండెను. 17 వ దినమున మోకాళ్ళ యందును, చీలమండలయందును, తీవ్రమగు బాధలు కలిగెను. అప్పటికి గంధం వెంకట కృష్ణారావుగారు మదరాసునుండి యెచటికో పోయిరి.

శ్రీగోపాలరావుగారికి యేమిచేయనూ తోచకుండెను. అప్పుడు చిరుమామిళ్ల భానుప్రసాదరావు నాయుడుగారచట నుండిరి. వారి సలహావలన మోకాళ్ళకును చీలమండలకును వేడినీటి ఆవిరి పట్టుచుండిరి. అప్పటికే ప్రతిదినమును ఆసనమునకు కూడ వేడినీటి యావిరి పట్టుచుండిరి, క్రమముగా మోకాళ్ళయందును చీలమండలయందు నుండు నొప్పులు తగ్గుచు ఆసనమునందలి గడ్డ పెద్దదై మెత్తబడ నారంభించెను. అది పెద్ద బంగాళాదుంప అంతలావై 25 వ దినమున పగిలెను. అందుండి నీటివలె నుండు పలుచని ద్రవము రానారంభించెను. 29 వ నాటికి ఆ వ్రుండు తనంతనే కారిపోయి పూర్తిగా మానిపోయెను. అప్పటినుండి వారు ఆరోగ్యముగనే ఉండిరి. వారికీ అనుభవము వలన ప్రకృతి వైద్యమునందు అచంచలమగు విశ్వాస మేర్పడెను.

అప్పటినుండియు బాధపడుచున్న ప్రజలకీ విధానమును బోధింపదలచి శ్రీకృష్ణారావుగారితో తమ నిశ్చయమును వెల్లడించిరి.

1913 సంవత్సరములో శ్రీగోపాలరావు పంతులుగారికి గుంటూరు కలెక్టరు ఆఫీసులో ఉద్యోగము లభించెను. శ్రీ చిరుమామిళ్ళ భానుప్రసాదరావు నాయుడుగా రచట నుండిరి. భానుప్రసాదరావు నాయుడుగారు కావలసిన ధనము పెట్టుబడి పెట్టినట్లును, శ్రీగోపాలరావు పంతులుగారు ఉచితముగా సలహానొసంగు పద్ధతితోను గుంటూరు బ్రాడీపేటలో ఒక జలచికిత్సాలయము నారంభించిరి. శ్రీ నాయుడు గారప్పుడే చెన్నపురి వెళ్ళి 6 జర్మను రేకు తొట్లను కొని తీసికొనివచ్చిరి. వెంటనే పని ప్రారంభింపబడెను. ఒక అద్దెయింటిలో ఈ తొట్లను అమర్చి వైద్యము నడపుచుండిరి. కొరిటిపాడు వాస్తవ్యుడు నరశింహులు అనునతడు నెల 1 కి రు 8-0-0 ల జీతముమీద చికిత్సాలయములో నౌకరుగా నుండెను. అతడు భావిలోని నీటినితోడి తొట్లను నింపుచుండెను. రోగులువచ్చి యా తొట్లలో స్నానములుచేసిపోవుచుండిరి. శ్రీగోపాలరావుగారు ఉదయం 7-9 గంటల మధ్యను సాయంత్రము 6-9 గంటల మధ్యను రోగులను చూచి సలహానిచ్చుచుండిరి. ఈ చికిత్సాలయమునందు, గుంటూరులోనివారేగాక తెనాలిపట్టణమునుండియు నితరగ్రామములనుండియు వచ్చిన రోగులు తమ రోగనివారణమును పొందుచుండిరి. ఇట్లా చికిత్సాలయమును 1915 వరకు జయప్రదముగా నిర్వహించి శ్రీ గోపాలరావుగారు సెలవు తీసుకొని రాజమహేంద్రవరము ప్రవేశించిరి. అప్పటికి ఆ చికిత్సాలయమునకు అనేకులు మాసవరుమానము లిచ్చి పోషించుచుండిరి. తెనాలి వర్తకులు పదులు పాత్రికలు చికిత్సాలయమునకు మాసమాసమును పంపుచుండిరి. ఆ చికిత్సాలయమును తరువాత, చికిత్సాలయ నౌకరు నరసింహులు నడుపుచుండెను. తరువాత సరియైన సలహా లేక చికిత్సాలయము మూలబడెను. శ్రీ భానుప్రసాదరావునాయుడుగారి మృతియును దానికి కారణమయ్యెను.

1917 సంవత్సరమున రాజమహేంద్రవరమున శ్రీ గోపాలరావుగారు 'జలసూర్యకిరణ ప్రకృతి ఆరోగ్య జ్ఞానాశ్రమ' మనుపేర నొక చికిత్సాలయమును ఆరంభించి రోగులకు రోగనివారణము జేయుటయే గాక అనేక చికిత్సావిషయకపరిశోధనలను చేసెను. అచటనే అనేకులు తమరోగములనుండి విముక్తిని పొంది గోపాలరావుగారిని ప్రశంసించుచు జాబులను వ్రాసియున్నారు. వానినెల్ల శ్రీ గోపాలరావుగారు రచించిన అపక్వాహారాద్వైతసిద్ధాంత మను తెలుగు గ్రంథము చివరను, 'The Universal Uncooked Food' అనే ఇంగ్లీషు గ్రంథము చివరను చేర్చియున్నారు. గోపాల

రావుగారు రాజమండ్రిలో నుండగా శ్రీ దువ్వూరి వీరభద్రయ్యగారి సహాయము వారికి లభించెను. వారి సహాయమున మన పంతులుగారనేక ప్రకృతి చికిత్సా గ్రంథములను వారి వద్దనుండి తెచ్చుకొని చదివి వారి ప్రత్యక్షసాన్నిధ్యము వలనను ప్రకృతిచికిత్సయందు ప్రావీణ్యమును గడించిరి. శ్రీ న్యాపతి సుబ్బారావు పంతులుగారుకూడ శ్రీగోపాలరావుగారికనేక గ్రంథముల నొసంగి ప్రకృతివైద్యమునందలి వారి ప్రావీణ్యమును వృద్ధిచేసికొన సహాయపడిరి.

కాని గుంటూరువారు ప్రకృతిచికిత్సాలయమునకు తోడుపడినట్లు రాజమండ్రివారు గోపాలరావుగారికి బాగుగా తోడుపడలేదు. గోపాలరావుగారు గుంటూరులోనే నిలచియున్నయెడల అచట యిప్పటికొక శాశ్వతమైన చికిత్సాలయ మేర్పాటు అయియుండెడిది. దైవ మన్యథా తలచెను. 1923 సంవత్సరములో శ్రీ న్యాపతి సుబ్బారావుపంతులుగారు 1215 చతురపు గజముల స్థలమును చికిత్సాలయమున కొసంగ వాగ్దత్తమొనర్చిరి. శ్రీ చింతలూరు లక్ష్మీనారాయణగారచట కావలసిన కట్టడములను కట్టుటకు వాగ్దత్తము చేసిరి. కాని అవి రెండును పూర్తి కానేలేదు.

గోరక్షణసంఘమువారికి 60 ఎకరముల నేలయు అందనేక కట్టడములును గలవు. గోపాలరావుగారు తమ ప్రకృతి చికిత్సాలయము నచ్చట నడుపవలయునని చాలతూరులు ప్రయత్నించిరి. కాని ఆ ప్రదేశము పట్టణమునకు దూరముగా నుండుటవలన రోగులచటికి చేరకను గోరక్షణసంఘమువారి వైముఖ్యమువలనను అచట చికిత్సాలయము నడుప వీలు చిక్కలేదు.

శ్రీ గోపాలరావుగారు శాశ్వతమైన చికిత్సాలయమును స్థాపింప బ్రయత్నించిరిగాని వారు కృతకృత్యులు కాలేకపోయిరి. వారు అనేక పరిశోధనలు జేసిరి. అందులో అపక్వాహార సిద్ధాంతమొకటి. జాగరణము, ఫలాహారము, ఉపవాసము మొదలైన యెన్నో పరిశోధనలు చేసిరిగాని ప్రజలు వారి ననుసరింపజాలకపోయిరి. చివరకు వారి మృతియును వారొనరించు పరిశోధనలలోనే తటస్థించి యుండెను. తమకు గల బోదకాలును నయము చేసుకొనుటకు వారు ఉపవాసమును, ఫలాహారమును అవలంబించి అందే మరణించిరని శ్రీ గంధము వెంకటకృష్ణారావుగారు సెలవిచ్చిరి. పరిశోధన కాలమున వారికాలును బాధించుచుండిన రోగపదార్థము కాలిలోనుండి బయలుదేరి ఉదరములోనికి వచ్చి వెడలిపోయి బోదకాలు నయమైనదనియు పెద్దవారగుటవలనను, తీవ్రముగా సంక్రమించిన నాడీ వ్యాధులవలన వారా పరిశోధన తట్టుకొనజాలక మరణించిరనియు శ్రీ గంధము వెంకటకృష్ణారావుగారు సెలవిచ్చిరి.

ఏమైననగుగాక, గోపాలరావుగారు మంచివారు, నిష్కపటులు, పరిశీలన స్వభావము గలవారు. అట్టివారు మరణించుటచే ప్రకృతి వైద్యమునకు తీరని లోటు సంభవించినది. భగవంతుడు వారి యాత్మకు శాంతి కలుగజేయుగాక!

## 5. కీ. శే. చేగొండి రామజోగయ్యగారు.

పశ్చిమగోదావరిజిల్లా దొడ్డిపట్ల వీరి నివాసస్థానము. ధనికులు. బెజవాడలో జరిగిన 5 వ ప్రకృతిశిక్షాశిబిరమునకు వచ్చిరి. అప్పటినుండి వారికీ ఉద్యమమునందు అభిమానము ఉండేది. 7,8, శిబిరవ్యయము అన్నీ వారే భరించారు. 'హోమియోపతిక్ ఇన్‌స్టిట్యూటు'లో సభ్యులుగా చేరి రు 200/-లు చెల్లించి యుండిరి. మరి జీవితాంతమువరకు ప్రకృతిచికిత్సాలయమును స్థాపించి ప్రకృతిఉద్యమమును అభివృద్ధి చేయవలెనని వారి కెంతో అభిలాష ఉండేది. అయితే పక్షవాతము వచ్చుటచేత వారు నిర్వహించి ఆ కార్యమును పూర్తి చేయలేక పోయిరి. అయినప్పటికీ వారికి గల అభిమానము ప్రశంసాపాత్రముగా నున్నది. 1940 సం. జూన్ నెలలో వీరు పరమపదించిరి.

## 6. కీ. శే. డా. స్థానం భావనారాయణగారు

బాపట్లలో కరణీకమున్నది. గంధం కృష్ణారావుగారి బంధువులగుటవలన వారివలెనే వీరుకూడా కూనే చికిత్సను అవలంబించిరి. వీరు జీవితాంతమువరకు ఎంతో మందికి నేర్పుగా జలచికిత్సను చేయించి రోగనివారణను చేయించిరి. వీరి తరువాత వీరి కుమారుడు పార్థసారథిగారీ వైద్యమును అభ్యసించి పాండిత్యమును గడించిరి. అందువల్ల నీ వైద్య కుటుంబము అభివృద్ధిలో నున్నదని చెప్పవచ్చును.

## 7. కీ. శే. డా. ఆగ్రా బాలముకుంద దాసుగారు

మొదటిలో ఆయుర్వేదవైద్యులుగానుండి తాము చేయు వైద్యమువల్ల రోగులకు మేలు కలుగకపోవుటను గుర్తించిరి అప్పుడే వాడుకలోనికివచ్చిన ద్రోణంరాజు వెంకటాచలపతి శర్మగారిచే ఆంధ్రీకరింపబడిన కూనే గారి వైద్యగ్రంథమును స్వయముగా పఠించి ఆ వైద్యమునందు విశ్వాసము గలవారై వందలాది వెలచేసే తమ మందులను పారబోసి కూనేవైద్యమును వ్యాప్తిలోనికి తెచ్చిరి. మధ్వశ్రీ కాశీ కృష్ణాచార్యుల వారికిని, గంధం వెంకట కృష్ణారావుగారికిని ప్రకృతి వైద్యమునందు అభిరుచిని కలిగించినవారు వీరేనని చెప్పుచుందురు. వీరికి ముఖవైఖరీవిద్యయందు మంచి ప్రావీణ్యము గలదు. ఆమరణాంతము ప్రకృతి వైద్యమందేజీవితమును వ్యయించిన ధన్యులు, కేవలము కూనే మతమును అవలంబించినవారు.

## 8. కీ. శే. ద్రోణంరాజు వెంకటాచలపతి శర్మగారు

ఆంధ్రదేశమునకు మొట్టమొదటగా ప్రకృతి వైద్యగ్రంథమును ప్రసాదించిన ధన్యమూర్తి. వారు కూనేచే రచింపబడిన 1. అభినవ వైద్యశాస్త్రము 2. ముఖవైఖరీవిద్య 3. రోగారోగ్య వివేకము మొదటిసారి తెనుగులోనికి అనువదించిరి తెనుగుదేశములో ప్రకృతివైద్యము వ్యాప్తిలో నున్నదంటే యీ గ్రంథాలే మూలకారణమై ఉన్నాయి. ఒక క్రొత్తశాస్త్రమును తెనుగులోనికి తర్జుమాచేయుట యెంతకష్టమో సామాన్యులు ఊహించతగ్గది కాదు. వారట్టి శ్రమకోర్చి ఆగ్రంథములను తర్జుమా చేయుటకు వారికా వైద్యమునందు గాఢవిశ్వాసము కలిగి ఉండవలెను. తమవద్దకు వచ్చిన వారికి ప్రకృతివైద్యమును గూర్చిన సలహా నిచ్చుటయే గాక దూరపు గ్రామస్థులకు దీర్ఘమగు లేఖలవ్రాసియు వైద్యములో ప్రబోధము చేసియుండిరి. ద్రోణంరాజు వెంకటాచలముగారు వీరికుమారులు. వారు పి. డబ్ల్యు. డి. ఓవర్‌సీరుగా ఉంటున్నారు. వారికిని ఈవైద్యమునందు గాఢాభిమానముగలదు. కూనేగారి శిశుపోషణము అను పుస్తకమును వీరు తెనుగులోనికి అనువదించియున్నారు.

## 9. కీ. శే. కాశీభట్ల సీతారామయ్యగారు



రాజోలుతాలూకా కడలి వీరి స్వగ్రామము. వైదిక కుటుంబమునందు జన్మించిరి. ప్రకృతివైద్యమువలన తమ రోగమును పోగొట్టుకొని అప్పటినుండియు ప్రకృతి వైద్యానికి మిషనరీ అయిపోయినాడు. ఎంతదూరమైనా నడచిపోయి, లేక తన స్వంతడబ్బును వెచ్చించి ప్రయాణముచేసి రోగులకు ప్రకృతివైద్యమునందు అభిరుచిని కలిగించేవారు. వారిదగ్గరకు సలహాకు వచ్చిన వారికి సలహా చెప్పుటయేగాక వైద్యమునంతా నూరిపోసేవారు. సూర్యనమస్కారములను శిబిరములలో చేసేవారు. వారు స్వయముగా సూర్యనమస్కారముల చేస్తే సదాశివుని తాండవనృత్యమువలె ఉండేది. పెదపాలెములో జరిగిన సౌరయాగమునకు వీరే అధ్వర్యులుగా నుండిరి. "నాకు స్మృతి తప్పినప్పుడు కూడా ప్రకృతివైద్యమే చేయండి" అని చెప్పి చివరవరకు ప్రకృతిమతావలంబిగానే జీవించిరి. వారు ప్రకృతి శిబిరములలో చేసే ప్రాతఃకాలపు భజనలు విన్నవారికి

నేటికీ చెవులలో గింగురుమంటున్నవి. పేదలయందు మాలమాదిగలయందు ఆయనకుగల కృపకు మితములేదు. అందువల్ల ఆయన యెంతో కష్టపడి వారికి తెలిసేటట్లుగా వైద్యాన్నంతా చిన్నచిన్న మాటల్తో చెప్పేవాడు. ప్రకృతిపత్రిక సంపాదకీయములో యిలా వ్రాసియున్నది.

"ఎక్కడో యెప్పుడో గాని మళ్ళీఅటువంటి నిరాడంబర మానవసేవాపరాయణులు లభింపరు" అని. ఇది వారివిషయములో ముమ్మాటికీ సత్యమేననుకుంటా.

## 10. డా. కే. శే. శ్రీపతి అన్నపూర్ణమ్మగారు, ఎన్. డి.

స్కూలుఫైనలు ప్యాసుఅయి, ట్రయినింగుగూడా అయి, గవర్నమెంటు స్త్రీల ట్రయినింగు స్కూలులో ఉపాధ్యాయినిగా పనిచేసెను. అయినవల్లిలో జరిగిన 3 ప్రకృతి శిక్షాశిబిరములకును హాజరై శిక్షణమును పొంది ఎన్. డి. పట్టమును బొందెను. తరువాత యెంతోమంది స్త్రీలకామె సూర్యనమస్కారములను నేర్పెను. ప్రకృతివైద్యమున అనేక సలహాల నొసంగుచుండెను. అకాలమరణము నొందుటవలన ప్రకృతి వైద్యమునకు యెంతయో లోటు వాటిల్లినది, ప్రకృతి వైద్యమును శాస్త్రీయముగా నభ్యసించినవారిలో నీమె అగ్రగణ్యురాలు. మూడవ ప్రకృతిశిబిరములో నీమె విద్యార్థులకు శారీరశాస్త్రమును బోధించెను.



# ఆంధ్రదేశమున
# ప్రకృతివైద్యమును వ్యాపింపజేయుచున్నవారు

## 1. దువ్వూరి వీరభద్రయ్యగారు

జీవించియున్న ప్రకృతివైద్యులలో వీరు భీష్మాచార్యుల వంటివారు. మహావాతపురోగము రాగా యెన్ని మందులు తిన్నను రోగము నయముగాక కూనేగారి జలచికిత్సను అవలంబించి ఆరోగ్యమును పొంది రాజమండ్రి యందలి వీరభద్రపురములో యెనుబదియేండ్ల ప్రాయమున సుఖముగా జీవించుచున్నారు. ఇప్పటికీ కూడ బలారోగ్యముల కలిగియున్నారు. అనేకమంది రోగులకు జల, సూర్యకిరణ చికిత్సలను బోధించి రోగ నివారణలను చేయుచున్నారు. వీరికి ప్రకృతివైద్యమునందు గల అభిమానము అనన్యము, అచంచలము.

## 2. రావుల గోపాలకృష్ణయ్యగారు

తెనాలిలో నాజరుగా ఉండేవారు. పక్షవాతము రాగా జలచికిత్సవలన ఆరోగ్యమును పొందిరి. తెనాలిలో ఉండగా యెంతోమంది రోగులకు జలచికిత్సను చేయించి ఆరోగ్యమును కలిగించిరి. ఎంతోమంది యువకులచేత తమవద్ద నున్న ప్రకృతివైద్యగ్రంథములు చదివించి వారికా వైద్యమునందు అభినివేశమును కల్గించిరి. ఇప్పటికినీ తెనాలితాలూకా వేమూరులో నుండి ప్రకృతివైద్యమును నడపుచున్నారు. 80వ యేట వారి ఆరోగ్యము, ఉత్సాహము, తగ్గక నిలిచియున్నవి.

## 3. మధ్వ శ్రీకాళీ కృష్ణాచార్యులుగారు

గుంటూరు నివాసము, పండితుడు, కవి, భక్తుడు. తమకు కలిగిన వ్యాధికి ప్రకృతి వైద్యము చేయుటతోడనే వారికి ఆరోగ్యము కలిగినది. అప్పటినుండీ వారు యెంతోమందికి ప్రకృతి వైద్యమును చేసి ఆరోగ్యమును కలిగించారు. తెనాలిలోను నెల్లూరులోను జరిగిన ప్రకృతి వైద్యసభలకు అధ్యక్షత వహించి గంభీరోపన్యాసముల నిచ్చారు. వారు స్వయముగా ద్వైతులయ్యును కూనేగారి అద్వైతము వారికి బాగా నచ్చినది. అందువల్ల వారు వైద్యవిషయికముగా అద్వైతమును ప్రచారము చేయుచున్నారు. ప్రకృతివైద్యమునందు నిశ్చలమైన విశ్వాసము, లోతైన పాండిత్యము గలవారు.

## 4. బొడ్డుపల్లి నరసింహముగారు

బాపట్లతాలూకా పెదుళ్ళపల్లి వీరి నివాసస్థలము. కూనే మతావలంబి. 70 యేండ్ల వయస్సున యిప్పటికి శ్రద్ధతో ప్రకృతి వైద్యమును నడపుచున్నారు. రోగులయందు దయకలిగి మిక్కిలి నేర్పుగా చికిత్స చేయుచున్నారు.

## 5. పువ్వాడ పేర్రాజుగారు

ప్రస్తుతము గోదావరిజిల్లాలో నున్నారు. కూనే మతమును బాగుగా వ్యాప్తిలోనికి దెచ్చిరి. ఫలాహారి. ఆరోగ్యతత్వము అనే పేరుగల సుప్రసిద్ధప్రకృతి వైద్యానుగుణ్యమైన ఆరోగ్యశాస్త్రగ్రంథమును వ్రాసి ఉచితముగా ప్రకృతి కార్యాలయ ట్రస్టున కొసంగియుండిరి. అనేకమందికి రోగనివారణము చేసిరి. స్కూలు మేష్టరుగా నున్నందున విద్యార్థులకు ఆరోగ్యశాస్త్రమును బోధించుటకు వారికెక్కువ అవకాశములు లభించుచుండెను.

## 6. డా॥ పాలపర్తి నరసింహంగారు

బాపట్లతాలూకా వేటపాలెము స్వగ్రామము - ఉపాధ్యాయుడుగా నుండియును ప్రకృతివైద్యమును ప్రచారము చేయుచుండిరి. తరువాత ఉపాధ్యాయ వృత్తిని మానివేసి ప్రకృతివైద్యవ్యాప్తియందే జీవితమును గడపుచున్నారు. మానసిక వైద్యమును పరిశోధించుచున్నారు. ప్రస్తుతము హైదరాబాదులోనుండి రోగులకు వైద్యము చేయుచున్నారు.

## 7. గంధం వెంకట కృష్ణరావుగారు



బాపట్లతాలూకా పుసులూరు స్వగ్రామము - ప్రస్తుతము బెజవాడ సత్యనారాయణపురంలో నుండి ప్రకృతి వైద్యమును వ్యాప్తిలోనికి తెచ్చుచున్నారు. అమెరికా, ఇంగ్లాండు, జర్మనీ, దేశములయందలి ప్రకృతి చికిత్సాలయములయందు స్వయముగా కనిపెట్టివచ్చిన ప్రకృతి వైద్యమును వ్యాప్తిలోనికి తెచ్చుచున్నారు.

## 8. చిత్రకళాధురంధర, డాక్టరు మాజేటి సత్యనారాయణమల్లికార్జునరావుగారు, ఎన్.డి.



మల్లికార్జునరావుగారు ప్రఖ్యాతిగాంచిన గొప్ప కుటుంబమున బుట్టినవారు. వీరి పితామహులు పెద్ద జమిందారులకు గూడ లక్షలు పెట్టుబడి పెట్టియుండిరి. దేవాలయాగ్రహారాది సప్తసంతానముల గావించిరి. వీరి మాతామహులు లోకప్రసిద్ధిజెందిన శ్రీ అత్మూరి లక్ష్మీనరసింహసోమయాజులవారు. జిల్లామునసబు పదవి నలంకరించి, D. G. W. C. T. బిరుదాంకితులై, ఉపనిషత్తులు, భగవద్గీత, బ్రహ్మసూత్రములకు భాష్యములను రచించి, హింసారహితయజ్ఞముం జేసి ఆదర్శప్రాయులైరి. ఇట్టి మాతాపితృవంశముల జనించి బాల్యము నుండియు శ్రీరంగాశధూతల వారి బోధనామృతాస్వాదనతత్పరులై వైరాగ్యాదిలక్షణంబుల చరించుచు, విద్యాభ్యాసంబున అగ్రస్థానము నలంకరించుచు మెప్పువడసిరి. వీరు సదా విజ్ఞానశాస్త్రవేదాంతగ్రంథపఠనమునే గావింపుచు, మాంసాహారఖండనమును, శాకాహార ప్రాశస్త్యమును ప్రతిపాదించుచు నాంగ్లేయభాషలో రచించిన యొక వ్యాసమునను, జంతుబలులు సర్వమతముల కసమ్మతములని నిరూపించిన మరియొక వ్యాసమునను, అఖిలహైందవ రాష్ట్ర యోగ్యతాపతకములను (All India medals) బొందిరి. మరియు మద్యపాననిరసనముం గూర్చి వ్యాసము వ్రాసి Star of Wellington Lodge వారిచే నీలగిరి జిల్లా కంతటిలో ప్రథమ బహుమానముగా బంగారుపతకమును బొందిరి.

వీరికి షుమారు 19 సం. వయస్సున క్షయవ్యాధి తటస్థించి ఆయుర్వేద, ఆంగ్ల, యునానీ మొదలగు చికిత్సల వల్ల వేనవేలు వ్యయమయ్యు ఫలితము లేకపోవుటచే ప్రకృతివైద్యము నవలంబించి రోగవిముక్తులైరి. తదాది ప్రకృతిగ్రంథముల బఠింపుచు ప్రకృతివైద్య విజ్ఞానమును, అనుభవమును సంపాదించి ప్రకృతి పత్రికా స్థాపకులలో నొకరైన శ్రీనారిశెట్టి హనుమయ్యనాయుడు గారికి మిగుల తోడ్పడిరి. పత్రికాముఖమున అనేక రోగులకు సలహాల నొసంగుచు చికిత్స చేయుచుండిరి అనేక వ్యాసములను వ్రాయుచుండిరి.

అంతేగాక వీరు ఆంధ్రదేశమున పేరుపొందిన చిత్రలేఖకులు. (ఆర్టిస్టు) నెల్లూరు ఆర్యవైశ్యమహాసభలో కవిపండిత సభయందు సన్మానింపబడిరి. "చిత్రకళాధురంధర" యను బిరుదమునుగూడ బడసిరి. అనేక Exhibitions లో బంగారు పతకములను బొందుటయేకాక యింగ్లాండునుంచి యోగ్యతాపత్రమును సంపాదించిరి. వీరు టెన్నిసు, చతురంగాది పోటీ పందెములలో అనేక బంగారు పతకములను బడసిరి.

వీరు ప్రకృతి వైద్యమున మిగుల ననుభవమును సంపాదించి నివారణగావించిన వ్యాధులలో ముఖ్యమైనవేవన, ఉబ్బసము, దీర్ఘాజీర్ణము (Dyspepsia), న్యూమోనియా, టైఫాయిడ్, రాచపుండ్లు, స్త్రీవ్యాధులు, సంజ, Obesity, Venereals, కర్కాటవ్రణము (Cancer,) మశూచికము, పెరిటోనైటిస్ (Peritonitis), సంధి మొదలగునవి.

వీరు మచిలీబందరులో ఆదర్శప్రాయమగు ప్రకృతి చికిత్సాలయమును నెలకొల్ప ప్రయత్నములను గావించుచుండిరి. భగవంతుడు వీరి యున్నతాశయములను అనతికాలములో కొనసాగించి లోకహితమును జేయునని కోరుచున్నాము.

## 9. అయ్యంకి వేంకటరమణయ్యగారు

స్వగ్రామము కృష్ణాజిల్లా, దివితాలూకా, అయ్యంకి. భూములు, యిల్లు అయ్యంకిలో నున్నప్పటికి తాము చేయవలసిన ప్రజాహితకార్యముల కా గ్రామము చాలనందున బెజవాడచేరి, అక్కడనే గృహాదులను నిర్మించుకొనిరి. గ్రంథాలయోద్యమమును సాగించుటకు ఒక అచ్చుకూటము (ఆంధ్రగ్రంథాలయ ముద్రాక్షరశాల) ను నిర్మించి అందు మంచి గ్రంథములను మాసపత్రికలను సర్వాంగసుందరముగా ముద్రించి యిచ్చు

చున్నారు. దేశదేశముల గ్రంథాలయోద్యమాన్ని వ్యాప్తిలోనికి దెచ్చుటకు వీరు పడినశ్రమ అపారము. దివ్యజ్ఞానసమాజ సభ్యులుగాను, బాలభటసంఘసభ్యులుగాను, ఉండి వీరు మానసిక, నైతికోన్నతిని గడించి దానియొక్క ఫలములను ప్రజానీకమునకు పంచిపెట్టుచున్నారు.

వీరు చిన్నతనమునుండి ప్రకృతివైద్యము నేర్చుకొనిపరిశోధనలు చేయుచున్న సంగతి అనేకు లెరుగరు. వెంకటరమణయ్యగారి తండ్రి అయ్యంకి వెంకటరత్నంగారు. వీరు గోదావరిజిల్లాలో డెల్టా సూపరింటెండెంటు (ఇప్పటి సబ్ఓవరుసీయరు వంటిది) ఉద్యోగములో నుండిరి. కూనేగారి అభినవవైద్యమును ముఖవైఖరీవిద్యను తెనుగుచేసిన కీ. శే. ద్రోణంరాజు వేంకటాచలపతి శర్మగారికి వీరు సమకాలికు లగుటవలన శర్మగారు వెంకటరత్నంగారిచేత ఆ రెండు గ్రంథములను కొనిపించిరి. వెంకటరమణయ్యగారు ఆ గ్రంథములను 13, 14 సంవత్సరముల వయస్సులోనే చదివియుండిరి. అప్పటినుండియు వారా వైద్యమును విశ్వసించి అందు యింకను కొన్ని పరిశోధనలు చేసిరి. ఉప్పులేని చప్పిడి తినిన కామము నశించిపోవుననియు దాంపత్యమునందట్టివారికి అభిలాష ఉండదనియు కొందరికి అపోహ గలదు. కారములేని పదార్థములనేగాక కేవలము పండ్లనేతిని కొంతకాలము జీవించి దాంపత్యమును అవలంబించి పరిశోధించిరి. వారుచెప్పున దేమనగా, అప్పుడు తమకు గల సంభోగశక్తి వృద్ధిపొందెననియు, కారము వస్తువులను తినినప్పటికన్న ఆ కాలమునందే యెక్కువ ఆనందము దాంపత్యమువలన లభించునని చెప్పుచుందురు. ఈ పరిశోధన వారి 20వ సంవత్సరమునందే జరిగెను. ప్రకృతి పత్రిక 1వ సంచికనుండి యిప్పటివరకు వారు పత్రిక శ్రద్ధగా చదువుచుండుటయేగాక ప్రకృతి ఉద్యమముతో 1919సంవత్సరము సెప్టెంబరు నెలనుండి సంబంధము గలిగియున్నారు. ప్రకృతి కార్యాలయ ట్రస్టు ఫండునకు భూరివిరాళముల నొసంగుటయేగాక ఇప్పటి కాగితపు కరువులో ప్రకృతి పత్రికను అపక సాగింపగలుగుటకు సహాయపడుచున్నారు. మనకున్న కొద్దిచందాదారుల చందా, పత్రికను నిర్వహింపజాలని మాట నిజము. అయ్యును వారు మనము ఎంత యివ్వగలమో అంత స్వల్పవ్యయముతే మనవద్ద తీసుకొని మిగతా మొత్తము వారే భరించుచున్నారు. వారి తోడ్పాటే లేనియెడల యిప్పటి మన పత్రిక యీ ఆకృతిలో ప్రచురింపక మానివేయవలసి వచ్చెడిది.

## ట్రస్టుతో సంబంధము

వారిశెట్టి హనుమయ్యగారితో మొదటినుండియు కలసి పనిచేయుచుండిరి. 1934 జూలై నెలలో హనుమయ్యగారికి ప్రబలమగు జబ్బుచేసెను. అప్పుడు హనుమయ్యగారు వెంకటరమణయ్యగారిని పిలిపించి ట్రస్టుకు సంబంధించిన ఆస్తిపాస్తులను వారికి తెలియజెప్పి ప్రకృతి ట్రస్టును స్వాధీనపరచుకొమ్మని కోరిరి. వెంకటరమణయ్యగారి కోరికపైన దంతలూరునుండి పుచ్చా వెంకటాద్రిమయ్యగారిని పిలిపించిరి. సోదరి జ్ఞానాంబ అప్పటికే అక్కడ హనుమయ్యగారికి ఉపచారము చేయుచుండెను. వెంకటాద్రిమయ్యగారికి గూడ ట్రస్టు విషయములు తెలుపబడెను. హనుమయ్యగారు ఈ యిద్దరి కోరికమీదను ఒకవిల్లును, ఒక సప్లిమెంటరీ ట్రస్టుడీడును రిజిష్టరు చేసిరి. దానివలన పుచ్చా వెంకటాద్రిమయ్య, అయ్యంకి వెంకటరమణయ్య, చెరువు శ్రీశైల మల్లికార్జునుడు, సీతారామావధూత, జ్ఞానాంబగార్లు అదనపు ట్రస్టీలుగా చేర్చుకొనబడిరి. జీవితాంతము వరకు హనుమయ్యగారే మేనేజింగు ట్రస్టీగను, వెంకటరమణయ్యగారు కార్యదర్శిగను పని చూచుచుండిరి. హనుమయ్యగారి అనంతరము అధ్యక్షపదవికి యెన్నికలు జరిగెను. అందు పుచ్చా వెంకటాద్రిమయ్యగారు యావజ్జీవ అధ్యక్షులుగా యెన్నుకొనబడెను. హనుమయ్యగారి కాలమునుండి పత్రికాధిపతిగా నున్న వెంకటాద్రిమయ్యగారే యావజ్జీవపత్రికాధిపతిగా నుండుటకును, వెంకటరమణయ్యగారు యావజ్జీవ కార్యదర్శిగా నుండుటకు హనుమయ్యగారే నిర్ణయించియుండిరి.

## ప్రకృతివైద్య శిబిర నిర్వహణము

వెంకటరమణయ్యగారు బాలభటులుగా నుండి పొందిన అనుభవము మన శిబిరనిర్వహణమున కెంతో తోడుపడెను. శిబిరముల స్వరూప, స్వభావములను భావించుటలో వారు మనకు మొదటినుండియు సహాయపడిరి. శిబిరములలో వారు స్వయముగా వసించియు, ఉపన్యాసముల నిచ్చియు ఉత్సాహపరచుట మనకందరకును తెలిసిన విషయమే. 1వ శిబిరమును ముగించునాడు వాయల్పాడునుండి వచ్చిన గండికోట నారాయణస్వామిగారు ప్రకృతి శిబిరమును ఒక రైలుతో పోల్చిరి. దానికి పుచ్చా వెంకటాద్రిమయ్యగారు ఇంజను అనియు, వెంకటరమణయ్యగారు డ్రైవరనియు, వారిశెట్టి హనుమయ్యగారు గార్డు అనియు శిబిరవాసులందరును మిగిలిన ప్యాసెంజరు పెట్టెలనియు చెప్పియుండిరి. ఎంతసహజమైన వర్ణన !

## క్రోమోపాతిక్ ఇన్‌స్టిట్యూట్

సూర్యకిరణ చికిత్సాది సునిశితవైద్యమును ప్రత్యేకముగా వ్యాప్తిలోనికి తెచ్చుటకు బెజవాడలోని క్రోమోపాతిక్ ఇన్‌స్టిట్యూట్ (The Chromopathic Institute) అను సంస్థను స్థాపించి రిజిష్టరు చేయించిరి. దానికి పుచ్చా వెంకటాద్రియయ్యగారు అధ్యక్షులుగను, వెంకటరమణయ్యగారు కార్యదర్శులుగను పనిచేయుచున్నారు. అప్పటికే డాక్టరు బ్యాబిట్ Human Culture and Cure(హ్యూమన్ కల్చర్ అండ్ క్యూర్) అనేఉద్గ్రంథము లభింపకుండెను. అట్టి గ్రంథమును సంపాదించి ధైర్యముచేసి పునర్ముద్రణముచేయించితిమి. ఇందు గూడ వెంకటరమణయ్యగారు అపారముగా తోడుపడిరి. ఇప్పటికీ వెంకటరమణయ్యగారికి ప్రకృతి ఉద్యమముమీద ఎంత ప్రేమ! ఒక ఆదర్శమైన ప్రకృతి చికిత్సాలయము, ఒక ప్రకృతి కళాశాల, ఒక తపోవనము యివే వారికి నిత్యజపవిషయాలు. ఇవే స్వప్నాలు. త్వరలోనే యీ మూడును కార్యరూపము ధరించి తీరుననియే నమ్ముచున్నాము. కార్యరూపము ధరింపవలెనని కోరుచున్నాము.

## 10. వాడపల్లి మురహరిరావుగారు



దివితాలూకా పోతార్లంక, నివాసము – తండ్రిగారు రామకృష్ణయ్యగారు, 80 యేండ్ల వృద్ధుడు – మురహరిరావు అమితోత్సాహము గలవాడు. ప్రకృతి ప్రేమమున మొనగాడు – వ్యవసాయశాస్త్రవేత్త. అర్థశాస్త్రము కరతలామలకము. ఏవిషయాన్ని గురించియైన కొన్ని గంటలు మాట్లాడగల వక్త. హోమోపతి వైద్యము ఎరుగును. హిందూదేశము పడుగూ పేకాగా తిరిగి లోకానుభవము గడించినవాడు. ప్రకృతివైద్యము ప్రచారముచేయుటలో ఎన్నిక గన్నవాడు.

## 11 చెన్నుభొట్ల భానుమూర్తిగారు

బి. ఎ.; ఎల్. టి.; ఎన్. డి



స్వగ్రామము నర్సాపురంతాలూకా, మేడపాడు. చాలాకాలము గుంటూరు జిల్లా బోర్డుహైస్కూళ్ళలో హెడ్‌మాస్టరుగా నుండెను. ఇప్పుడు చాలించుకొని ప్రకృతివైద్యము వ్యాప్తిలోనికి తెచ్చుటకై ఉద్యుక్తులుగా నున్నారు. బెజవాడలో ఆంధ్రప్రకృతి ధర్మపరిషత్తు తరపున సాగింపబోయే కేంద్ర చికిత్సాలయము కళాశాలలలోనుండి పనిచేయుట కేర్పాటులు జరుగుచున్నవి. ప్రకృతివైద్యమునందు వారిప్రజ్ఞను వ్యాప్తిలోనికి దెచ్చుటకు వారి ఉపాధ్యాయవృత్తి యెంతయేని తోడుపడినది.



## 12. డా॥ తాండవకృష్ణ, ఎం. ఎ., ఎన్. డి.

అయ్యంకి వేంకటరమణయ్యాగారి రెండవ కుమారుడు. ఈయన పూర్తిపేరు వెంకట కృష్ణమూర్తిగారు. నాట్యశాస్త్రము అభ్యసించి తమ పేరును తాండవ కృష్ణ యని మార్చుకొనిరి. అయినవల్లిలో జరిగిన 3 శిబిరములకును వీరు హాజరై ప్రకృతి వైద్యమును అభ్యసించి యన్. డి. పట్టమును పొందిరి. అనేకమందికి ప్రకృతి వైద్యమున సలహాల నొసంగి రోగవిముక్తులను జేయుచున్నారు. ఏ ప్రధాననగరము సందైనను త్వరలో ప్రకృతిచికిత్సాలయము నొకదానిని ఆరంభించి నడుపవలయునని అభిలషించుచున్నారు.

## 13. డా॥ భాగవతుల రామమూర్తిశాస్త్రిగారు

ఆయుర్వేదమును యథావిధిగా నభ్యసించిరి. ప్రకృతి వైద్యమునందు అభిమానము గలదు. యోగప్రక్రియలు వీరికి బాగుగా తెలియును. బెజవాడలో జరిగిన 6వ ప్రకృతి శిబిరమునందు విద్యార్థులకు యోగాసనములను, ధౌతికర్మను నేర్పిరి. త్రిదోషము లను గ్రంథమును వ్రాసి మనకు ఉచితముగా ప్రచురింప నిచ్చిరి. కాకినాడ తాలూకా, వేట్లపాలెము వీరి స్వగ్రామము. వా రచ్చట రోగులకు ప్రకృతివైద్యమున సలహా నొసంగుచున్నారు.



## 14. గండికోట నారాయణస్వామిగారు

తండ్రి ఆయుర్వేద వైద్యులైన గండికోట చంగన్నగారు. పుంగనూరు జన్మస్థలము. ఇప్పుడు కుప్పంలో నున్నారు. చిన్నప్పుడు తండ్రివద్ద నాడీ నక్షత్రమాల మొదలగు కొన్ని శ్లోకాలు చదువుకొన్నారు. తరువాత జబ్బుచేసినప్పుడు ఏ మందులూ పనిచేయక పోతే ప్రకృతి వైద్యము చేసినారు. అందువలన రోగ నివారణమైనది. చాలా సంవత్సరములు ఫలాహారి. వీరి కుటుంబ మందరును ఫలాహారముతో, చాలా కాలము గడపిరి. 1938 సంవత్సరమునకు ప్రకృతి శిబిరమునకు అయినవల్లి విద్యార్థిగా వచ్చెను. 1936 సంవత్సరములో మదనపల్లియందు జరిగిన ప్రకృతివైద్యశిబిరముచందాలు వసూలుచేసి చాల జయప్రదముగా జరిగించిరి. ప్ర వైద్యపట్టము (N. D.) పొందిరి. నిశితమైన బుద్ధిగల వాడు. ప్రకృతివైద్యము చేయుచు ప్రజాసేవ చేయుచున్నారు.



## 15. ఆయుర్వేదసుధానిధి, పొత్తూరి కృష్ణంరాజయోగీంద్రులవారు

ఈ పటమున కుడివైపున నున్నవారు రామరాజయోగీంద్రులవారు. వారిని గురించి యిదివరకే చదివియున్నారు. ఎడమవైపున నున్నవారు కృష్ణంరాజ యోగీంద్రులు. రామ రాజయోగీంద్రుని గురువులుగూడ వీరేను. ప్రకృతిపత్రిక ఆరంభించినప్పటినుండి అనుభ వానంద మను పేరుతో పద్యములను వ్రాయుచుండిరి. వీరిచరిత్ర యోగీంద్రుల స్వీయచరిత్ర అనే పేరుతో గ్రంథరూపమున వెలువడినది. రోగముచేసి అందు మనోవికలత్వముతో బాధ పడుచున్నారు. నరసాపురము తాలూకా, ఏనుగువానిలంకలో హఠయోగాశ్రమము స్థాపించి అందే యిప్పటికి నివసించియున్నారు.

## 16. కొలిపాక ఆదినారాయణశర్మగారు

ఎన్. డి.

తెనాలితాలూకా మున్నంగి స్వస్థలము. 1933 సంవత్సరము నుండియు ప్రకృతిశిబిరమునకు హాజరగుచున్నాడు. ఆంధ్రప్రకృతి ధర్మపరిషత్తు వారి 'ధర్మవేది' పట్టమును పొందుటయే గాక 9, 10 శిబిరములను స్వయముగా నడిపియున్నాడు. ఇప్పుడు బెజవాడలో ప్రకృతి ధర్మ పరిషత్తును స్థాపించి నడుపుచున్నాడు.

## 17. కందుకూరి వటుకభైరవమూర్తిపంతులు

బి. ఎ.; ఎన్. డి.

చాలా కాలము నర్సారావుపేటలోను, తరువాత బెజవాడలోను వకీలుగా నున్నారు. ప్రకృతిపత్రికతో సంబంధమున్నది. కార్యాలయట్రస్టునకు నూరు రూపాయిలకు మిగిలిన విరాళమొసంగి తోడుపడిరి. అఖిల భారత ప్రకృతి ధర్మప్రచారక సంఘమునకు చాలా కాలము అధ్యక్షులుగాను, ఇండియన్ నాచురోపాత్ పత్రికాసంపాదకులుగాను నుండి యిప్పుడు విశ్రాంతి తీసుకొనుచున్నారు. నివాసము బెజవాడ.

## 18 గుడిపల్లి శేషయ్యగారు - కర్నూలు

వైదిక బ్రాహ్మణులు. పూర్వాచార పరాయణులయ్యును ఆధునిక ఉద్యమములందు అభిలాషగలవారు. లవణము లేని పదార్థములనే భుజింతురు. కర్నూలు గోరక్షణ సంఘమునకు కార్యదర్శిగా నున్నారు. గోరక్షణశాల ఆవరణలోనే కొన్ని గదులను కట్టించి, అందురోగులకు వసతి గలిగించి ప్రకృతివైద్యము చేయించుచుందురు. నిరాడంబరమైన స్వభావముగలవారు. ఆత్మతృప్తికై లోకసేవ చేయుచున్నారు.

## 19 నోసం రామవర్మ – సంజీవవర్మగార్లు

పొద్దుటూరులో చాలా కాలమున్నారు. ప్రకృతివైద్యమునందు నిపుణులు - రామవర్మగారు ముఖ్యశైఖరీ విద్యను పద్యములుగా వ్రాసిరి. అందు కూనేగారు చెప్పిన వాటినేగాక, భారతీయ శిల్పశాస్త్రమునందలి కొన్ని విషయములనుగూడ చేర్చి వ్రాసియున్నారు.

## 20. కోట శ్రీరాములుగారు

జన్మస్థానము గుడివాడ. ప్రస్తుతము బెజవాడలో ఉద్యోగములో నున్నారు. జీవితములోని అనేక రసవంతములగు ఘట్టములను కథలుగా వ్రాసి ప్రకృతిపత్రికలో ప్రచురించిరి. ప్రకృతివైద్యమున అచంచల విశ్వాసము గలవారు.

## 21. మృత్తింటి ఆంజనేయులుగారు

ప్రకృతివైద్యమున మంచి అభినివేశము గలవారు. కనీనికానిదానమును ప్రత్యేకశ్రద్ధతో అభ్యసించిరి. కనీనికానిదానమును గురించి తెలుగులో ఉద్గ్రంథమును వ్రాసిరి. ప్రస్తుతము దంతలూరు అగ్రహారమున పుచ్చా వెంకట్రామయ్యగారికి చేదోడుగానుండి ప్రకృతి వైద్య వ్యాప్తికి తోడుపడుచున్నారు.

## 22. లక్బర్ ఆలీ సాహెబుగారు



ఆర్య సామాజికులు - అహింసా ప్రచారకులు. బారింగు పేటలోను తరువాత బెంగుళూరులోను, ఇప్పుడు హైదరాబాదులోనూ ఉండి ప్రకృతివైద్యము చేయుచున్నారు.

## 23. వి. దొండా సాహెబుగారు, ఎన్. డి.

చిత్తూరుజిల్లా కలికిరి నివాసులు. శాసనసభలలోను, ఆంధ్రయూనివర్సిటీ సినేటులోను మహమ్మదీయుల తరపున ప్రతినిధిగా నున్నారు. ప్రకృతివైద్యము చేయుచున్నారు. ప్రకృతి పత్రికలోను, ఇండియన్ నాచురోపాత్‌లోనూ అనేక వ్యాసములను వ్రాసియున్నారు. ప్రకృతి ఆరోగ్యవైద్యము అనే గ్రంథమును రచించిరి. అది రెండు కూర్పులు పడినది.

## 24. వేగిరాజు కృష్ణంరాజుగారు, ఎన్. డి.

స్వగ్రామము – గుంటూరుజిల్లా మర్రిపూడి. క్షత్రియులు. మొదట మర్రిపూడిలోను, తరువాత బాపట్లలోను, అందుమీదట భీమవరములోను, ఇప్పుడు కేశవరములోనూ ఉండి పెద్దయెత్తున ప్రకృతి చికిత్సాలయము నడుపుచున్నారు. వీరు మానసిక చికిత్సయందు ప్రత్యేక పరిశోధనలుజరుపుచున్నారు. ఫలాహారి.

## 25 జ్యోస్యుల శ్రీరామమూర్తిగారు

సూర్యోపాసకులు. సూర్యనమస్కారములను ప్రచారము చేయుచుందురు. ఫలాహారి. నైష్ఠికుడు. మన శిబిరములకు దయచేసి శిబిరవాసులకు సూర్యనమస్కారములను బోధించుచుందురు. వీరు వ్రాసిన లోకబాంధవోపాసన అనే సూర్యనమస్కారముల పుస్తకము చాలా వ్యాప్తిలో నున్నది.

## 26. డా. అడుసుమిల్లి వెంకటకృష్ణారావుగారు, ఎన్.



కృష్ణాజిల్లా చందాప్రోలు వీరి స్వగ్రామము మన శిబిరములలో ప్రకృతివైద్యము నభ్యసించి యన్. డి. పట్టము నందిరి. టీకాల ఖండనకై వైద్యవిప్లవమును ప్రచురించిరి. అనేకులకు ప్రకృతివైద్యమున సలహాల నొసంగుచున్నారు.

## 27. సీతారామావధూతగారు, ఎన్. డి.

బెజవాడ వద్దనున్న సాధనాశ్రమమును నడుపుచున్నారు. అక్కడ పెద్దభవనములు నిర్మించి విద్యుచ్ఛక్తితో నడుపబడే జలయంత్రముద్వారా తోట్లలోనికిని, వాడుకకును నీరు సప్లయి చేయబడుచున్నది. తెలుగుదేశములో నింతవరకు నిదే పెద్ద స్వంతభవనములు గల చికిత్సాలయము. త్వరలోనే ప్రకృతివైద్యమును నేర్పుటకు గూడా ఏర్పాటులు చేయుచున్నారు.

## 28. వేమూరి రామమూర్తి గారు.

బి. ఎ., బి. ఇడి., ఎన్. డి.



దంతలూరు అగ్రహారం వీరి కాపురస్థలము. ప్రస్తుతము తెనాలిలోని తాలూకా హైస్కూలులో ఉపాధ్యాయులుగా నున్నారు. ప్రకృతిశిబిరములలో ప్రకృతి వైద్యమును బోధించుచున్నారు. తెనాలిలో నుండి కావలసిన వారికి ప్రకృతివైద్యమున సలహా నొసంగుచున్నారు. మన పత్రికాధిపతియైన డా॥ పుచ్చా వెంకటరామయ్యగారి మేనల్లుడు. మేనమామగారివద్ద ప్రత్యక్షముగా ప్రకృతివైద్యమున శిక్షణముపొంది యుండుటచే వీరి సలహా నిచ్చుటలో గణనీయులై యున్నారు.



**29.**

## యోగి రాఘవేంద్రగారు

రేపల్లె తాలూకా మునులతోట యందుండి ప్రకృతి చికిత్సాలయము దీక్షతో నడుపుచున్నారు. బ్రహ్మచారి. ప్రకృతి వైద్యము సమర్థతతో నడుపుటయే గాక అనేక ఇతర పత్రికలతో గూడా ప్రకృతివైద్య ప్రబోధక వ్యాసములను ప్రచురించుచుందురు.

## 30. డా॥ పుచ్చా వెంకటరామయ్యగారు, ఎన్. డి.

(కోట శ్రీరాములు)

ప్రకృతి పత్రికతో మొదటి సంపుటమునుండియు సంబంధము కలిగియున్నారు. 1924 సంవత్సరమునుండియు సహాయసంపాదకులుగానుండి 1934 సంవత్సరమునుండి ప్రధాన సంపాదకులుగా పనిచేయుచున్నారు. ఎన్నో ఉద్గ్రంథములను స్వయముగా రచించియు, ఆంధ్రీకరించియు మన ట్రస్టునకు ఉచితముగా నొసంగియున్నారు. తమకు లాభమునచ్చే ప్రకృతి నికేతనము అందు ముద్రించి అమ్ముటకు సిద్ధముగానుంచిన గ్రంథములతోసహా ప్రకృతి కార్యాలయ ట్రస్టునకు ఉచితముగా నొసంగియున్నారు. యావజ్జీవసభ్యులుగా చేరుటయేగాక రోగులనుండి సంపాదించిన మొత్తం ధనమును ట్రస్టునిధికి ధర్మముచేసి యున్నారు. వీరి చరిత్రనుగురించి మీకు కొంత నివేదించుట మంచిది.



వీరు విళంబినామ సంవత్సర చైత్రశుద్ధచవితి స్థిరవారమున వెల్నాటి వైదికకుటుంబమున పుచ్చా చినసరసింహం, సుబ్బమ్మ గార్లకు జన్మించిరి. చిరకాలము మగసంతానము కలుగక తరువాత జన్మించుటచేత వీరికి సంసారమున గారాబము అధికముగ నుండెను. చిన్నతనమున అనేకతూరులు జబ్బుచేయుటయు మందు వైద్యముచే అవియెల్లనివారణమగుటయు సంభవించెను.

వ్యాజ్యములవలనను, గారాబమువలనను, శిశువ్యాధులవలనను, వీరికి 7వ యేడు వచ్చువరకు అక్షరాభ్యాసము చేయింపలేదు. తరువాత బస్తీలోఉండి చదువుచెప్పించే దక్షతలేక 12వ యేటి వరకును పల్లెటూరి చదువుతోనే కాలము గడచినది.

15వ యేట మొదటి వివాహమైనది. 17 వ యేట తండ్రిగారి అకాలమరణమువలన నింటిదక్షత మీదపడుటచే పాఠశాల చదువునకు స్వస్తి చెప్పవలసివచ్చెను. 18 వ యేట కాపురమునకు వచ్చిన మొదటిభార్యయు 4, 5 సంవత్సరములలోనే స్వర్గస్థురాలయ్యెను. మొదటిభార్య పోయినతరువాత వివాహమాడిన రెండవ భార్య కాపురమునకు వచ్చుటకు 4 సంవత్సరములు పట్టెను. ఈ 4 సంవత్సరములలోనే ఆయన యెంతో విద్యావ్యాసంగము చేసెను. దినమునకు 8, 10 గంటల కాలము మాతృభాష చదువునందే వినియోగించుచుండెను. అప్పుడు రామాయణము, భారత, భాగవతములేగాక, మనుచరిత్ర, రాఘవపాండవీయము, విజయవిలాసము, శృంగారనైషధము మొదలగు ప్రబంధముల నెన్నిటినో శ్రద్ధతో పఠించిరి. తెలుగులో వెలువడిన నవలలు, నాటకములు, శాస్త్రగ్రంథములు, చరిత్రలు, విమర్శ గ్రంథములు ఎప్పటికప్పుడే, వెలువడినతోడనే సంపాదించి చదువుచుండిరి. వేదాంతగ్రంథములను ప్రత్యేకశ్రద్ధతో పఠించుచుండిరి.

ఇంతలో వారికి మలబద్ధకము, శుక్లనష్టము, మొదలగు వ్యాధులు వెంటబడినవి. ప్రతి సంవత్సరము జ్వరము వచ్చుచుండెను. దానికి వాడిన మందులవలన దేహారోగ్యము చెడిపోగా కూనేగారి అభినవవైద్యమును చదివి తొట్టిస్నానములుచేసి ఆరోగ్యమును సంపాదించిరి. అప్పటినుండి ఎన్నో యింగ్లీషు గ్రంథములను, ఇంగ్లీషుపత్రికలను, తెప్పించి ప్రకృతి వైద్యమునందు తాను ఉత్తీర్ణుడగుటయే గాక, ప్రకృతిపత్రికలో వ్యాసములు వ్రాసియు, ప్రకృతివైద్య విషయిక గ్రంథములను ప్రచురించియు, ప్రకృతివైద్యమును వ్యాప్తిలోనికి దెచ్చిరి. అనేకసభలలో నుపన్యసించియు, అనేకమంది విద్యార్థులకు ప్రకృతిశిబిరములలో ప్రకృతివైద్యమును నేర్పియు, ప్రకృతివైద్యమునకు గట్టి పునాదులను వేయుచున్నారు. ప్రకృతివైద్యపద్ధతులను అడిగినవారికెల్ల ఉచితముగను, కొద్దిరుసుముతోను, బోధించి అనేకులకు వివిధరోగములను కుదిర్చియున్నారు. ఆహారశాస్త్రమున ప్రత్యేక పరిశోధనలు చేసి, సగ్గుష్టమైన ఆహారశాస్త్రమును రచించి యున్నారు. కామశాస్త్రగ్రంథములను శోధించి, తెలుగువారందరికి తెలియులాగున సులభశైలిలో సుఖసంసారము, ప్రణయలీల, మొదలైన ఉద్గ్రంథములను రచించి తెలుగువారి మన్ననలను పొందియున్నారు.

ఆయనకు యెన్ని విద్యలు వచ్చునో అనేకులకు తెలియదు.

ఆయనకు వేదాంతశాస్త్రము తెలియును. కామశాస్త్రము తెలియును. కవిత్వమును విమర్శింప గలరు. నాటకములను, నాట్యములను చూచి మంచి చెడ్డలు చెప్పగలరు. ఆధునిక ప్రకృతిశాస్త్రములను శ్రద్ధతో పఠించుచుందురు. దినములో యెక్కువభాగము వారు విద్యావ్యాసంగమునందే గడుపుచుందురు. కూటికి గుడ్డకు లోటులేకుండుటవలన వారు ప్రకృతివైద్యమును సర్వులకు నిష్కపటముగాను, బహిరంగముగాను బోధింప గలిగియున్నారు.

త్వరలోనే బెజవాడ కేంద్ర శాస్త్రీయ ప్రకృతి చికిత్సాలయమును, ఆంధ్రప్రకృతి వైద్యకళాశాలను మిత్రులయొక్కయు శిష్యులయొక్కయు సహాకారముతో నడుప దలచియున్నారు.

వీరికి శిష్యులయందుగల వాత్సల్యము అపారము. ఒకశిష్యునకు ధూమపానమలవా టుండెడిది. అట్టి వ్యసనమునకు తానెంతయో సిగ్గుపడి కించపడియు దానిని దాటు మనోనిగ్రహము లేనివాడై యుండెను.

దానిని గమనించి వారు ఒకరోజున "నీవు నాకు ముఖ్యుడవుగదా! నీకు ధూమపానమువలన నేదియో గొప్ప లాభముండియుండకపోయినచో నీవట్లు చేయవని నా తలంపు. దానిని నాకుగూడ తెలువరాదా? అంత స్వలాభము మంచిది కా"దనెనట. అందుల కతడు సిగ్గుపడి "అయ్యా! ఈ వ్యసనములోనుండి బయటపడజాలనంత దుర్బలుడనై యున్నా"నని విచారపడెను. "అట్లయిన నీవు విచారింపకుము. ఇక నీకు ఈవ్యసనమును పోగొట్టుకొనజాలిన మనోబలము లభించునులే" అని రట. అంతియే. ఆనాటినుండియూ మరల ఆవ్యసనమును తలంచనైన లేదా శిష్యుడు. అట్టి సత్య సంకల్పము. అట్టి యమోఘాశీర్వచన బలము.

ఇది చిన్ని విషయముగ కనుపించిననూ దుర్వ్యసనబలము, అట్టి వ్యసన లోలురకే అనుభవమని మనవి.

తన సంసారము దుఃఖభాజనముగ నున్నదని ఒకశిష్యుడు విచారపడెను. శ్రీవారు ఒకనాటి మధ్యాహ్నము అయాచితముగ అతని యింటికి అతిథులై అతనికి తండ్రిగను, అతనిభార్యకు తల్లిగను తోచి, దుఃఖకారణముల చూపించి, వాటిని నివారించి, ఇకముందు మీసంసారము సుఖవంతమౌనని ఆశీర్వదించిరట. తదాది వారు సుఖసంసారకులుగ నుంటున్నారు. అందరూ యిట్టిదానికేగా వెంపర లాడునది. అట్టిదానిని సమకూర్చువారు మహనీయులుగాక మరెవరు. వారిది మధురహృదయము. ప్రతివిషయములోనూ ఆనందరూపమునే స్ఫురింపచేయుదురు. అందరు వ్యక్తులూ దివ్యులూ, ఆనందస్వరూపులూ అందురు. ఏదో కించిత్తు కారణమున తన స్వస్థితినుండి చ్యుతుడై దుఃఖగానూ, దుష్టుడుగానూ భాసించునేగాని నిజమునకు అతడు ప్రేమస్వరూపుడే అందురు.

రోగులను నారాయణుని సేవించునట్లు ప్రేమ, భక్తి, స్వస్థచిత్తములతో సేవచేయుమని మాకు బోధింతురు. రోగులకు తమంతతామే రోగనివారణ చేసికొనునటుల వారికి బోధచేసి తద్ద్వారా మనోబలమును చేకూర్చుచుందురు.

ప్రయత్నపూర్వముగా కష్టించి ధర్మపథమును నడచుట అలవాటు చేసుకొనవలయునని చెప్పుదురు. ఇట్టివెన్నియో బోధలు వినుచుందుము.

అట్టి శ్రీవారికి భగవంతుడు అమరత్వమును ప్రసాదించి, వారిద్వారా ఆంధ్రలోకమునకే గాక యావద్భారతభూమికి సేవచేయించునుగాక అని ఈశ్వరుని ప్రార్థించుచున్నాను.

# 31. శ్రీ సీతారామావధూతగారు

(శ్రీ సిరిపి ఆంజనేయులుగారు రచించిన ప్రాకృతజీవనవిధానము సీతారామావధూత జీవితచరిత్రనుండి గ్రహింపబడినది.)

కూర్పరి:—డాక్టరు వి. నాగేశ్వరరావు, B. A., N. D., H. M. B.,



ఈ పురుషవర్యునిది అవనిగడ్డ వంశము. తండ్రి వల్లభరాయుడు. తల్లి మహాలక్ష్మమ్మ. ఈ దంపతుల చల్లని కడుపున బడిన కడపటి ఫలమే యీ ప్రశాంతమూర్తి. జన్మస్థానము పటమటలంక. తల్లిదండ్రులిడిన పేరు సీతారామయ్య. ఆరునెలల నిసువుగనున్నప్పుడే మొదటి పినతల్లి వెంకటాచలమ్మ సీతారామయ్యను దత్తుగా బందరు గొనిపోయెను. తొమ్మిదవ యేట బాలు నొక వీథిబడియందు ప్రవేశపెట్టిరి. నాలుగవ తరగతివరకు నచట చదివి, ప్రైమరీ (బహిరంగ) పరీక్షయందు కృతార్థుడయ్యెను. అనంతరము సి. యం. ఎస్. నార్మలు స్కూలులో మొదటి కక్ష్య చెల్లినది. అవల రెండుమూడు కక్ష్యలు బందరు నోబులు కళాశాలలో గడచెను.

అవనిగడ్డ వంశము గురుసంప్రదాయమునకు జెందినది. కావున భగవద్భక్తియు, సాధుజనసేవానురక్తియు సీతారామయ్యకు ఉగ్గుపాలతోనే యలవడెను. మాటలలో పాటపాటలలో క్రమముగా నవి రాణకెక్కినవి. ఈ సందర్భమందే పెంపుడుతల్లి క్షేత్రయాత్రకై భద్రాచలము గొంపోయినది. సీతారామయ్యలోని భక్తిబీజములు మొలచి, తీవలుసారి, నలువంకల బ్రాకదొడగుట కిదియొక ముఖ్యహేతు వయ్యెననదగును. యాత్రనుండి మరలినపిమ్మట వెంకటాచలమ్మ తన గురుడైన యలవలపాటి రామదాసుగారిగృహము కొడుకున కునికిజేసినది. బాలకుడు రామదాసుగారి యింట విచిత్ర విధముగు పెరగున వలయునంత వైరాగ్యతత్వ మనుభవపూర్వకముగ నవగాహనము చేసికొనజాలినాడు.

అట్టిస్థితిలో సీతారామయ్య బడికిబోవుచు నొకనాడు దారిలో తనకెదురగు నొక సన్యాసిని జూచుట తట

స్థించెను. ఆ సన్యాసి రంగావధూతయని ప్రసిద్ధికెక్కిన రంగదాసు. ఈ యవధూత సందర్శనము సీతారామయ్య వైరాగ్యవృత్తికి మరింత దోహదమయ్యెను. యననే గురువని నమ్మెను. ఆది మొదల లాతడు బంధువని తల్లియని యిల్లని తలంపక, ఆహార నిద్రల గోరక గురుసేవకై యుబలాటపడజొచ్చెను. రంగావధూత వెంట తిరుగుటచే బాలుడు పాడగుచున్నాడని తలచి మేనమామ చిత్రలేఖనమునందు ప్రవేశపెట్టెను.



సాధనాశ్రమము · పటమటలంక

అదియును ననిష్టమగు కళ. అటులుండినను కొన్ని పరీక్షలలో గెల్పు నీడ మందెను. తదుపరి బందరుపురమున దుర్గాచల మను వైద్యునిచెంత ఆయుర్వేదమున నాడీజ్ఞానము, కొన్ని ఔషధయోగములు, అనుపాన విధానములు గ్రహించినాడు. "నీవు గొప్ప వైద్యుడవు కాగలవుసుమా!" యని దుర్గాచలము వచించెనట.

సీతారామయ్యలో నానాట విరాగభావము పెంపొంద సాగెను. ఒక్క గురుపాదార్చనమే మోక్షసాధన మని బాలుని పరిపూర్ణవిశ్వాసము. ఇట్టి శిష్యునియెడ రంగావధూత సులువుగ సుముఖుడు గాడయ్యె. గాఢము లగు బహువిధనిగూఢశోధనలకు బాలుని పాల్పరచె నట. శిష్యు డవ్వాని యన్నింట అత్యంత వినీతభావమున జయము గాంచెనట. గురు డంతల కొంతయు నలరి, శిష్యుని గుంటూరికి గొనిపోయి శిష్యబృందము నకు జూపెట్టి "ఇతడు పన్నివిధముల నాకు నిష్టుడును, సమానుడును కాన నీతని నవధూతయని పేర్కొందును. ఇది మొదలు సీతారామవధూత యనంబడు. మీరు నా యీ యనుంగుశిష్యుని నన్నువలె గారవింపుడు" అని

వచించెనట. అయినను ఆచార్యముఖమున నెట్టి మహోపదేశము గాని, గురుమంత్రము గాని యీ శిష్యుడు సాధించియుండలేదు. భక్తిరసప్రపూర్ణములు, వైరాగ్య తత్త్వబోధకములు నగు పద్యములు కీర్తనలు తన కోపిన జాడలో నల్లి గురునిచే దిద్దించుకొనుచుండినాడు.

ఏలాగైన కళాశాలవిద్య పూర్తిచేయించి కొమార్తె నొసగి వివాహము చేయవలయు ననుట మేనమామ మతము. ఆ పొట్టకూటిగోడు తన కక్కరలేదనియు, పెండ్లిపిచ్చి యసలే లేదనియు సీతారామయ్య హితము. తన కుమార్తెను పెండ్లియాడక తీరదని మేనమామ యల్లుని నిర్బంధించెను. కన్నతల్లిని మించిన పెద్దవదినెయు మఱింది నందులకు ప్రోత్సాహించినది. బందుగు లది యవశ్యము కాదగినదనిరి. అవధూతగారికి నోరాడినది కాదు. ఇష్టము లేని యీ యుద్వాహ మిరువది రెండవయేట నెంతో కష్టముపై సాగినది. భార్య రజస్వలయై యింటిగడప త్రొక్కినది. సీతారామావధూతగారిది తెలిసి ఖిన్నుడైనారు. పత్నిని జేరబిలిచి "పెండ్లికి పూర్వమే నా నిర్ణయము చెప్పియున్నాను. ఈ వివాహము నాకు సమ్మతముగాదు. అవధూతల మతము నవలంబించి విరక్తుడనైతిని. ఇక నీకును నాకును బొత్తు కుదురదు. భర్త సన్యసించుచో భార్యకు రెండవ పెండ్లి విధాయకము. కనుక నీకిక నా యాస వలదు. నీదారి నీవు చూచుకొమ్ము. నీతోడి తగులము నాకు నష్టహేతు" వని వచించెను. ఈ పల్కులచే భార్య లక్ష్మమ్మ విచార మంతుగానిదయ్యెను. అప్పుడామె నుడివిన వాక్కులివి. "మీకులేని ప్రపంచసుఖము నాకు వలదు. నేను సయితము మీవలెనే యుండగోరదను. పతి ననుసరించుట సతికెప్పటికిని ధర్మము. తదన్య మవినీతి హేతువు".

పిమ్మట అవధూతగారు, ఆమెను తన సోదరుల కడ నునిచి, మౌనవ్రతము బూని యిలువిడిచి పోయినాడు. ఆదిమొదల లాయన కొక్కచోటులేదు. నిల్చినతావున నిలువరు, బట్టకట్టరు, తిండి కాకరు, నోట నెవ్వరేమి యుంచినను మరుమాటలేక మ్రింగివైచును. కృష్ణానదీతీరమునంగల యిసుక బయళ్ళయందలి కల్లుగడ్డిలో పడక. అందే తినుగు విరుగు లేని పగుగు. కావున జను లాయనను "కల్లుసామి" యని పిలువజొచ్చినారు. ఆ బూనినది కాష్ఠమౌనముగాదు. పృచ్ఛకు లడుగుటే తడవుగ దగు సమాధానములు పద్యరూపమున జెప్పుట వారి కాచారమైనది. ఇది తెలిసి పలుదెసలనుండి పలువురు వచ్చిపడజొచ్చిరి. తమ ఉద్దేశములు ఫలించునో ఫలింపవో, పోయినవి దొరకునో దొరకవో, బిడ్డలగుదురో కారో యిత్యాదిగ ప్రశ్నల పరంపర సాగింప మొదలిడిరి. ఆ ప్రశ్నలకెల్ల కల్లుసామి సూటియగు సమాధానములు చెప్పుచుండెను. చెప్పినవి తప్పక జరుగుచుండెను. అపుడు వారి దివ్యచక్షువునకు గోచరింపని సూక్ష్మవిషయము లేకుండెను. ఈ మౌనవ్రత సందర్భముననే కొన్ని ప్రశస్తకార్యము లాచరింప, నీ కల్లుసామి యంతరాత్మ ప్రబోధించినది. ఈ ప్రబోధము — ధర్మసత్రము, ధర్మవైద్యాలయము, ధర్మవిద్యాలయము, దేవమందిరము, ప్రకృతి చికిత్సాసదనము — మున్నగునవి నెలకొల్పి, తన్మూలమున మానవసేవ నొనరింపవలెననుట. ఆ ప్రబోధము ననుసరింప దీర్మానించుకొని యవధూతగారు ఆరేండ్లకు పిమ్మట వ్రతము చాలించినట్లు తెలియుచున్నది. మౌనవ్రతకాలమున దానును మౌనముద్ర ధరించి, అవధూతగారిని శుశ్రూషించుచుండిన ఎనిమిదేండ్ల బాల యొకర్తె యుండెను, ఆమె నాడు కనకదుర్గ, నేడు కీర్తిశేషురాలైన జ్ఞానాంబ. ఒకప్పుడు సీతారామావధూతగారు గుంటూరులో భక్తజనసమాజమున నుండిరి. ఆ సందర్భమున వారిని సందర్శించుట నారిశెట్టి హనుమయ్యగారికి దటస్థించినది. నాయుడుగారు గుంటూరు పట్టణమందలి యొక సబ్ పోస్టుమాష్టరు. అద్వైతమతసాంప్రదాయులు. అవధూతగారితో ప్రసంగించిన పిమ్మట, నాయుడుగారికి సంసారముపై విరక్తి తోచినది. కొలువునకు నీళ్లువదలినారు. అవధూతగారితో లంక జొచ్చిరి. నాయుడుగారికి నిరౌషధవైద్యమందు నగ్గలమగు నభిమానము. ప్రకృతిచికిత్సనుగూర్చి పలుగ్రంథములు చదివిరి. లంక చేరిన పిమ్మట నొక చిన్న యచ్చుకూటముంచి, ప్రకృతి పేర నొక మాసపత్రిక ప్రారంభించిరి. ఆ పల్లెయం దొక సంవత్సర కాల మది నడచినది.

సీతారామావధూతగారి సోదరి పున్నమ్మ గుండె నంజుతో బడిపోయినపుడు ప్రకృతివైద్యమూలమున స్వస్థతగాంచెను. మరియు, అవధూతగారు అతిసార విరోచనములతో బడినపుడును, మేహవాతము వలన వారి కాలొకటి సలుక జెందినపుడును, ప్రకృతివైద్యమే నివారణోపాయమైనది. ఇంతతో నవధూతగారికి ప్రకృతిచికిత్సపై అభిమాన మేర్పడెను. కొన్ని ప్రకృతి యుద్గ్రంథములు తెప్పించుకొని చదువ మొదలిడిరి. కొంతకాలమునకు నాయుడుగారు సన్నిపాతజ్వర

పీడితులైరి. 103°, 104° డిగ్రీలజ్వరము. కాళ్ళు చేతులు చలువలు గ్రమ్మినవి. స్మారకము లేదు. అప్పుడవధూతగారే చికిత్సనడుపవలె. అనుభవము చాలదు. ప్రమాదావస్థలో రోగి పడియుండెను. అయినను అవధూతగారు సంజాడలేదు. ప్రకృతివైద్యము మొదలిడినారు. మాసము దినము లగునప్పటికి రోగము చెక్కుముక్కలై పోయెను. అంతటితో అవధూతగారికి నిరౌషధచికిత్సయందు గాఢతమమగు విశ్వాస మేర్పడెను. తరువాత అట్లూరి సీతారామయ్యగారికి అతిమూత్రవ్యాధికి చికిత్స నడిపిరి. వైద్యు లచ్చెరు వందు నటుల రోగము నివారణకాబడెను. ఈసేవతో నవధూతగారి చికిత్సా ప్రౌఢిమ నలుగడల నగారు మ్రోగించెను. వచ్చెడు రోగులసంఖ్య నానాట హెచ్చుజొచ్చెను. చికిత్సానిలయ మొక టావశ్యక మయ్యెను. 1929 సంవత్సరములో పటమటలంక గ్రామమున కొద్ది ధనముతో నాల్గు గదులు కట్టించిరి. నాటినుండి నేటిదనుక ఆరోగ్యసదనము నభివృద్ధి



చేయుచునే యుండిరి. నేటి ఆరోగ్యసదనము (ప్రకృతి చికిత్సాలయము) ఒక లక్షరూప్యముల విలువ గల్గి ఎనుబదికుటుంబముల కాశ్రయ, మిచ్చుచున్నది. ఇచట నేటు వందలకొలదిరోగులు స్వస్థత గాంచుచున్నారు. 1944 సంవత్సరము జనవరి రెండవతేది నుండి 'యోగవ్యాయామప్రకృతికళాశాలను,' 'ప్రాకృతజీవనము' అను యోగవ్యాయామప్రకృతి వైద్య సచిత్రమాసపత్రికను ప్రారంభించినారు.

శ్రీ అవధూతగారి ఆదర్శము లారాధింపదగినవి. అవధూతగారు గృహస్థులయ్యు బ్రహ్మచారులు. విషయేచ్ఛయు, స్వాదేచ్ఛయు వా రేనాడు నెఱుగరు. వేషభాషాదుల నిరాడంబరమగు జీవనము. ఇరువదేండ్లుగా వీరు ధరించునది శుద్ధమగు ఖద్దరే. అపక్వాహారము మును మీటి యేదియును గైకోరు. అంయును సామాన్యాహారమే. ఈ వ్రతాచరణము ఇరువదియెనిమిది వత్సరములకు పైగా నిరంతరాయముగ సాగుచున్నది. ఎంతటి విషమపరిస్థితుల యందును గోపతాపములకు గురికారు. ఆహారవిహారములలో, ఆచారవిచారములలో భార్యాభర్త లభిన్నభావులు. వారిది మితజీవిక. ఒరుల కిచ్ఛాపూర్వకముగ నూడిగ మొనరింప నెల్లపుడు సంసిద్ధులు. అవధూతగారి సహధర్మిణి అచంచలమతిగారిని 'అమ్మగా'రనియు, అవధూతగారిని 'నాన్నగా'రనియు నెల్లరు బిల్చెదరు. సంతుగానని పలువురు బిడ్డల తండ్రి యీ పుణ్యమూర్తులు.

భోగపరంపరలనడుమ నుండు నిర్మలయోగిపుంగవు డీ పురుషవర్యుడు. సంసారగహనవాసి యగు సన్యాసి. బంధువర్గసంపర్కముగన్న పరివ్రాజకుడు. భాషణము మితమును హితమును, ప్రేమవిలసితమును మధురమును. దృఢమైన మనశ్శక్తి. నైశిత్యముగల ధీపటిమ. అచంచలమగు మనఃప్రవృత్తి గలమూర్తి. శాంతమున శాలవాలము. శుచి స్వరూపి. భగవద్ధ్యానరతుడు. "మందుల దినము. పక్వాహారము గైకోము. ఇంజెక్షనుల కొడమీయము. శస్త్రచికిత్సకు పాల్పడము" అని యవధూతగారును, వారి సహధర్మిణియు శపథమూనిరి. వారికి నివృత్తిమార్గమున నాదర్శపురుషుడు శ్రీరంగావధూత. నిష్కామకర్మయోగమునకు ప్రత్యక్షప్రమాణము మహాత్మా గాంధీ.

ముత్తెగలగు (హోమియోపతి, ఆయుర్వేదము, ప్రకృతి) వైద్యములలో చొరవ గల్గించుకొని, ముప్పదేండ్లుగా పరహితజీవనము గడపి, వేలకొలది రోగుల నిరామయులుగ నొనర్చి, సేవ వేలార్జించి, మానవప్రతిసందర్భమున అంతరాత్మ ప్రబోధించి నటుల ధార్మికసంస్థల ప్రతిష్ఠించి, మానవకల్యాణమునకై పాటుపడ కంకణము గట్టికొనిన సంకల్పసిద్ధుడగు వినిర్మలకర్మయోగి, మన సీతారామావధూతగారు.

# విదేశములలో ప్రకృతివైద్యమును ప్రచారము చేసినవారు



### 1. బెర్నార్ మేక్ ఫేడన్

న్యూయార్కు నగరమున బ్రాడ్వే, 1946 లో నున్న ఫిజికల్ కల్చర్ కార్పొరేషన్ అధిపతులు. సుప్రసిద్ధమైన ఫిజికల్ కల్చర్ పత్రికాధిపతులు. ఫిజికల్ కల్చర్ వంటి 13 మాసపత్రికలనే గాక, యింకా యెన్నో వార పత్రికలను, 2 దినపత్రికలను నడుపుచున్నారు. 78 సంవత్సరముల వయస్సు. వ్యాయామము, ఆహారనియములవలననే సర్వరోగములు కుదురు నని వీరి నమ్మిక.



2. లూయీ కూనే గారు

లీప్జిగ్, జర్మనీ. ముఖవైఖరీవిద్య యను నిదాన శాస్త్రమును కనిపెట్టెను. రోగాద్వైత చికిత్సా ద్వైతములను బోధించిరి.



3. డాక్టరు ఈ. డి. బ్యాబిట్, ఎం. డి., ఎల్. ఎల్. డి.

సూర్యకిరణచికిత్స, మానసికచికిత్స, కాంతచికిత్సాది సునిశితచికిత్సావిధానములను వ్యాప్తిలోనికి దెచ్చిరి.

లాస్ ఏంజలీస్, కాలిఫోర్నియావారు.

# మనశ్శక్తి : ఆరోగ్యము

డా॥ పాలపర్తి నరసింహారావు

ప్రకృతివైద్యులు, వేటపాలెం

ప్రకృతియందలి సునిశితశక్తులలో మనశ్శక్తి యొకటి యని ముందు వివరించియున్నాను. ఇది భగవచ్ఛక్తి యొక్క రూపాంతరము. ఇహపరలోకములందు మానవు డనుభవింపదగిన సకలైశ్వర్యములు మనస్సు మీద ఆధారపడియున్నవి. ఇచ్చట చర్చింపవలసిన విషయము ఆరోగ్యము గనుక, మనస్సునకును, ఆరోగ్యమునకును ఏలాటిసంబంధ మున్నదో తెలిసికొను టత్యావసరము. మనస్సునకును, స్థూలశరీరమునకును అత్యంత సన్నిహిత సంబంధము కలిగియున్నట్లు తెలియుచున్నది. అంధులు స్పర్శజ్ఞానమువలన వస్తువులయొక్క రంగుభేదములను, నేతభేదములను, ఛాయభేదములను గుర్తింపగలుగుచున్నారు. దీనినిబట్టి మనస్సు శరీరమునందొక ప్రత్యేకభాగమున కేంద్రీకరింపబడియుండక శరీరమంతటను వ్యాపించియుండుననియు అందుచే, శరీరమందన్నిభాగములకు ఆలోచనాశక్తి యుండుననియు ఆధునికమానసికశాస్త్రజ్ఞులు తేల్చినారు. స్థూలదేహమునకును; మనస్సునకును ఇంత పరస్పరసంబంధ ముండుటచే మనోవికారములవలన శరీరమునకును; శరీరబాధలవలన మనస్సునకును దెబ్బతగులుచుండును. మనస్సునందుత్పత్తియగు ఆలోచనలు (thoughts) బీజములవంటివి. శరీరము క్షేత్రమువంటిది. కాబట్టి ప్రతిఆలోచన స్థూలశరీరమునందేదో యొకచోట ముద్రితమగుచుండును. టెలిగ్రాం ద్వారా ప్రాణహానికరమగు వార్తలు వినినప్పుడు హృదయకోశమునందును, జీర్ణకోశమునందును, మెదడియందును తీవ్రమగు మార్పులు కలుగుచుండుట మనము ప్రత్యక్షముగ జూచుచున్నాము. ఇట్టి భయంకరమైనవార్తలు విని ఒకటి రెండు గంటలలో అనేకమందికి తల నెరసినటుల తెలియుచున్నది.

ఒకానొక ఉద్యోగి అధికకాలము ఆఫీసునందు పని చేయుటవలనను, విపరీతమగు వేడివలనను, కలిగిన ప్రయాసకు డాక్టరుగారి యొద్దకు వెళ్ళి సలహానడిగెను. డాక్టరు వానిని పరీక్షించి రోగకారణము, తచ్చికిత్సలు వ్రాతమూలమున మరునాడు ఉదయమున తెలిపెదనని చెప్పి పంపివేసెను. ఆ మరుదినము డాక్టరుగారు పంపిన జాబులో "నీ నాడుశ్వాసకోశము పూర్తిగ చెడిపోయినది. హృదయకోశము చాల దుర్బలముగనున్నది. 2, 3 వారములకంటె జీవించుట కవకాశములేదు గనుక, వ్యాపారమును చక్కబెట్టుకొని అత్యవసరమైన వానిని తక్షణమే పరిష్కరించుకొన వలయును" అని వ్రాయబడియుండెను. ఈ మరణవార్త చదివిన తక్షణమే గుండెలవిసిపోయెను. రాత్రివేళకు గుండెలో తీవ్రమైనబాధ ప్రారంభమై, ఉచ్ఛ్వాస నిశ్వాసములు కఠినమాయెను. తాను ఒకటి రెండు వారములలో మరణించుట నిశ్చయ మను నమ్మికతో పడకెక్కెను. ఆ రాత్రి నడిరేయి అతని పరిస్థితి ఇంకను విషమస్థితికి రాగా డాక్టరుగారికి వార్తపంపిరి. డాక్టరుగారు వచ్చి పరీక్షించి "నిన్న సాయంకాలము నిన్ను పరీక్షించినపుడు బాగుంటివే, ఇట్టి బాధలు లేవుగదా, ఏమిజరిగినది" అని అడిగెను.

రోగి:—(చెప్పలేక చెప్పలేక) "నాహార్టు, నాహార్టు" అని సన్నగా గొణిగెను.

డా:—నిన్న నీహార్టు చక్కగా నుండెనుగదా!

రో.—నా శ్వాసకోశములు.

డా:—నీవు త్రాగుబోతువు కానట్లు నాకు తోచును సందర్భమేమో తెలియజెప్పుము.

రో:—(ఎగయూపిరిబీల్చుచు) "మీ జాబు, మీ జాబు. నేను రెండు మూడు వారములకంటె జీవింపనని వ్రాసితిరి కదా" అని గొణిగెను.

డా:— నీవు స్థిరబుద్ధిలేనివాడవుగా కనిపించుచున్నావే. "కొండలమీద నొకవారము విశ్రాంతి పొందినచో నీయారోగ్యము చక్కబడు"నని వ్రాసియుంటిని.

రోగి విపరీతమైన మనోవేదనపడుచు తెల్లబారి పోయిన ముఖముతో తనపక్కక్రిందనున్న డాక్టరు గారి జాబు తీసియిచ్చెను

డా:—అయ్యో! ఎంత పొరపాటు. ఈజాబు మరియొక రోగికి వ్రాయబడినది. నా పరిచారకుడు తెలియక నీ జాబు వానికిని, వాని జాబు నీకును పొరపాటున పంపినాడు.

ఈ మాటలు వినిన తక్షణమే రోగి చివాలున లేచి కూర్చొని రెండు మూడు గంటలలో ఆరోగ్యమును పొందెను.

మరియొక పెద్దమనిషి విపరీతముగ బాధపడుచు వైద్యశాలకు వెళ్ళెను. ఏమిజబ్బని డాక్టరుగారు ప్రశ్నింపగా తన కృత్రిమదంతములను (artificial teeth) మ్రింగితిననియు, జీర్ణకోశములో చాల బాధ పెట్టుచున్నదనియు చెప్పెను. ఈరోగి తన కృత్రిమదంతముల నెచ్చటనో పెట్టి, నిద్రసమయములో వానిని మ్రింగినట్లు భ్రాంతిపడి లేచి వెతుకగా కనిపించనందున అతనిభ్రాంతి యథార్థమని నమ్మెను. ఈ భయభ్రాంతివలన వాని జీర్ణకోశములో బాధ కలిగెను. డాక్టరుగారు దంతములను మ్రింగుట అసంభవమనియు అదియొక భ్రమయనియు చెప్పి యొప్పించుటకు విశ్వప్రయత్నములు చేసెనుగాని ప్రయోజనము లేకపోయెను. కొంతసేపైనతరువాత రోగి భార్యయొద్దనుండి కృత్రిమదంతములు పక్కక్రింద గుడ్డపాగులో దొరకినవని తంతివార్త వచ్చెను. ఆవార్త వినిన తక్షణమే అతనిబాధ ఉపశాంతి నొందెను. వెంటనే గుడ్డలు ధరించుకొని, తాను పడిన బాధపాటునకు నగుచును డాక్టరుగారి ఫీజు చెల్లించి వెళ్ళిపోయెను.

అపరేషను నిమిత్తము వైద్యశాలకు వెళ్లుచు, క్లోరోఫారం వల్ల కలిగే మూర్ఛనుగురించి ఊహించుకొనుచు వెళ్ళిన రోగులు, క్లోరోఫారం ఇయ్యకముందే మూర్ఛ జెందినట్లు అనేకకేసులు రుజువుచేయుచున్నవి. ఇవి భయభ్రాంతివలన కలిగిన అస్వస్థతలు.

ఈ యుదాహరణలన్నియు మనస్సునకును, శరీరమునకును అత్యంతసన్నిహితసంబంధ మున్నదని తెలియజేయుచున్నవి.

తీవ్రమైనకోపము, భయము, అసూయ, విచారము మొదలగు మానసికవికారములవలన, శరీరమందు రాసాయనికమార్పులు గలిగి, విషాదు ఉత్పత్తియై రక్తవిషీకరణము (Blood poisoning) జరుగును. వాని ప్రతీకారమువలన తలనెరయుట, ముఖము ముడుతలు పడుట, ఆహారము ఒంటబట్టకపోవుట, అకాలవృద్ధాప్యము, మొదలగు చెడుగులుగలిగి, అకాలమరణములు గలుగును. అట్లే సంతోషము, ప్రేమ, భూతదయ మొదలైన వానివలన శరీరమునందు జీవరసము ఉత్పత్తియై శరీరమునకు కాంతి, పటుత్వము, యౌవనము, గలిగి దీర్ఘాయురారోగ్యములు పెంపొందును.

స్వప్రయోజనపరత, దురాశ, అసూయ, మొదలగు మనోవికారములవలన పైత్యమధుర కోశములందు తీవ్రమగు మార్పులు గలిగి తత్సంబంధమగు వ్యాధు లంకురించును. కోపము వలనను, భయము వలనను, వ్యాకులత వలనను, హృదయకోశమునకు దౌర్బల్యము కలుగును. ఈ మనోవికారములు దీర్ఘకాలము బాధించుచో అకాలమరణము గలుగును.

కర్కటవ్రణములకు వ్యాకులత ప్రధానకారణ మని డాక్టరు స్నో గారు తెలియజేయుచున్నారు. అసహజమైన మానసిక ప్రయాసలవలన చర్మరోగము లంకురించును. మూర్ఛ, హిస్టీరియా, ఉన్మాదము మొదలగు నాడీవ్యాధులు తీవ్రమగు మనోవికారముల వలన కలుగుచున్నవి.

సంతోషముతో సుప్వాంగసమయమందు వెలువడు మూత్రస్వేదములకును, తీవ్రమగు మనోవేదన గలిగి బాధపడు సమయమందు వెలువడు మూత్రస్వేదములకును చాల భేదమున్నట్లు పరిశోధనలు తెలుపుచున్నవి. తీవ్రమగు మనోవికారములతో నుండు సమయమందు తల్లిపాలు విషతుల్యమై బిడ్డల యారోగ్యమును చెరచును.

ప్రతిమానవుడు తన అనారోగ్యమును గురించి గాని, దారిద్ర్యమునుగురించిగాని, గృహసంబంధమైన చిక్కులను గురించిగాని, వ్యాపారసంబంధమైన లాభనష్టములను గురించిగాని, ఆందోళన పడుచుండును. అప్రయత్నముగ మనస్సెల్లప్పుడు వానిని గురించి చింతపడుచుండును. అట్టి చింతవలన లాభము లేకపోయినను ఆ విషయములను పదే పదే మననము చేయుచుండును.

**ఏ మానవుడు ప్రయత్నపూర్వకముగ గాని, అప్రయత్నపూర్వకముగ గాని, ఏ భావములను పదేపదే మననము చేయుచుండునో, అవియే వాని శరీరమందును, వాని జీవితమందును ప్రతిఫలించుచుండును. Like attracts like. ఇది యొక గొప్ప ప్రకృతిరహస్యము. ఇదియే జపతపములయొక్క అంతరార్థము.**

ఒక భావమును (ఆలోచనను) పదేపదే మననము చేయుటవలన అనగా జపముచేయుటవలన అదియొక

గొప్ప మహత్తరమగు శక్తిగా మారిపోవును. ఆలోచనలు బీజముల వంటివనియు, శరీరము క్షేత్రమువంటిదనియు పైన వ్రాసియున్నాను. చేదు విత్తనములు నాటిన చేదుకాయలు కాయును. మంచి విత్తనముల నాటిన మంచిపంట లభించును. అలాగే మనస్సెల్లప్పుడు చెడ్డఆలోచనలను జపముచేయుచుండినచో ఆజీవితము దాని ననుసరించియే మారుచుండును. మనస్సెల్లప్పుడు సద్భావములను మననము చేయుచుండినచో ఆ జీవితము సుఖప్రదమై వర్ధిల్లును.

మనస్సు మహత్తరమగు నొక భగవచ్ఛక్తి. సూదంటురాయి (magnet) వంటిది. దేనినైనను తనవంకకు ఆకర్షింపగల సామర్థ్యము గలది. ప్రతివస్తువు, ప్రతి సుఖము, ప్రతిఐశ్వర్యము, మానసిక క్షేత్రమున ముందుద్భవించిగాని బాహ్యమున వస్తురూపమును బొందదు. సుఖమునుగాని, కష్టమునుగాని, ధనమునుగాని, దారిద్ర్యమునుగాని దేనినైనను పొందట మనస్సు గాఢముగ కోరనిదే అది లభింపదు. మనస్సు నడకనుబట్టి జీవితము మారుచుండును. అది మానవజీవిత మను ఓడకు చుక్కాని వంటిది.

ఉదాహరణముగ దరిద్రుని మనోభావములను గమనింతము. దరిద్రుని మనస్సెల్లప్పుడు దారిద్ర్యమునే కోరుచుండును. అతడెవరితో మాటలాడినను దారిద్ర్యమును గురించియే మాటలాడుచుండును. దరిద్రులతో నివాసము చేయుచుండును. దరిద్రుల సలహా అడుగును. దారిద్ర్యమును గురించి తీవ్రముగ ఆలోచన చేయును. రేపు అన్నము లేక మాడి చావవలసి వచ్చునేమో యని భయపడును. ఆస్తి అప్పుల పాలై పోవుచున్నట్లును జప్తులు వేలములు జరుగుచున్నట్లును, తానొక గర్భదరిద్రుడై మలమల మాడి పోవుచున్నట్లును ఊహించుకొనుచుండును. ఇంట దొంగలు పడినట్లును కాలిపోయినట్లును కలలు గనుచుండును. ఇది యంతయు దారిద్ర్యమును గురించి అప్రయత్నముగ చేయు జపము. ఇట్టి జపమువలన అతనికి దారిద్ర్యమే లభించితీరును.

ఇక ధనికుని ఆలోచనలను గమనింతము. ధనికుడు తనకు వ్యాపారములో లక్షలకొలది ధనము వచ్చుచున్నట్లును ఏడంతస్థులమేడలో హంసతూలికాతల్పముపై పవ్వళించుచున్నట్లును, అష్టైశ్వర్యములు తనకు వచ్చుచున్నట్లును, మననము చేయుచుండును. మానసికదృష్టిలో ఇవి యన్నియు స్పష్టముగ గోచరించుచుండును. అతడు ధనికులసాంగత్యము చేయును. ధనికులతో మాట్లాడును. ధనము లభించు మార్గములను ముచ్చటించును. వానిని గురించి ఆలోచించును. ఈ విధముగ జపము చేయువానికి ధన మప్రయత్నముగ లభించును.

రోగి ఆలోచనలను గురించి పరికింతము. రోగి తన వ్యాధి క్రమేణా పెద్దదగుచున్నట్లు ఊహించుకొనుచుండును. నివారణ కాదని తలంచును. మరణము సమీపించుచున్నదని భయపడుచుండును. "అయ్యో! నేను మరణించినచో నా భార్యాబిడ్డలగతి యేమగునో? వారికెట్లు జీవనము జరుగునో" యని మననము చేయుచుండును. అనారోగ్యవంతులు, రోగమువలన మరణించినవారు వానికి జ్ఞాపకము వచ్చుచుందురు. పీనుగులు, శ్మశానము కనిపించుచుండును. ఈవిధముగ జపము చేయువానికవియే ప్రతిఫలించుచుండును.

ఇకను ఆరోగ్యవంతుడు ఆరోగ్యవంతులతో స్నేహము చేయును. వారితో ఆరోగ్యమును గురించి ప్రసంగము చేయుచుండును. తాను రామమూర్తి శాండోలవలె కీర్తి సంపాదించవలెనని కోరుకొనుచుండును. దీర్ఘాయుష్మంతుడై శతవర్షములు జీవించునని గట్టి విశ్వాసముతో నుండును. ఆరోగ్యమును గురించిన గ్రంథములను చదువును. దానినిగురించి మననము చేయును. ఆరోగ్యవంతులయొక్కయు శాండోలయొక్కయు ఫోటోగ్రాఫులను తనగోడమీద తగిలించి చూచి ఆనందించుచుండును.

ఈ విధముగ ఏమానవుడు దేనినిగురించి గాఢముగ చదువుచు, వినుచు, ముచ్చటించుచు, మననము చేయుచుండునో, అది మంచిగాని, చెడుగాని వాని జీవితమందు ప్రతిఫలించి తీరును. దానిని వాడనుభవింపక తీరదు. మనశ్శక్తిని గురించిన యీ ప్రకృతి రహస్యమును గ్రహించినవాడెవ్వడును, అనవసరముగ వ్యాకులత పడడు.

తన శక్యముకాని విషయములను గురించి చింతించడు, మననముచేయడు. జనసామాన్యమున కీరహస్యము తెలియకుండుటే గొప్పలోపము.

మానవజీవితముల నధోగతిపాలు చేయుటకు జ్యోతిషము మిక్కిలిగా తోడ్పడుచున్నట్లు తెలియుచున్నది. ఒకానొక జ్యోతిష్కుడు, ఒకనికి 40 సంవత్సరములకు గండమున్నదనిగాని, మారకమున్నదనిగాని జ్యోతి

షను చెప్పుననుకొనుడు. ఆ విషయమును వినినప్పటి నుండి వాని మనస్సెట్లు ప్రవర్తించునో ఊహించుడు. ఆ గడువు వచ్చేవరకు గంటలను నిమిషములను లెక్కించుకొనుచుండును. తన జీవితమందలి ప్రేమ నశించిపోవును. ఉత్సాహము నశించును. గాఢమైన నిద్రపోలేడు. తన మరణముకొరకు నిరీక్షించుచుండును. తన జీవితాశయమును మరచిపోవును. ఆహారము ఒంటబట్టదు. జ్ఞాపకశక్తి నశించిపోవును. తన సంసారచిక్కులను చక్కబెట్టుటకు ప్రయత్నములు చేయుచుండును. ఈవిధముగ తన మరణమును గురించి జపముచేయుట వలన, శరీరము క్రమముగ క్షీణించి, ఆ నిర్ణీతసమయము నకు యథార్థముగ మరణము సంభవించితీరును.

ఈవిధముగ జ్యోతిషమువలన వ్యతిరేకమనోభావము లేర్పడి (Negative attitude) జీవితములు వ్యర్థమై పోవుచున్నవి. అందువలన యోగ్యులైన జ్యోతిష్కులు పొట్టాత్రముకొరకు, తాము చెప్పు జ్యోతిషము నిజము గాని, అబద్ధముగాని, ఏవోకొన్ని మంచివిషయములను మాత్రము చెప్పి పోవుచుందురు. అందువలన జాతకములలోని విషయములు నూటికి 99 జరుగుటలేదు.

నా చిన్నతనములో మాతండ్రిగారు నా కోటి నొక జ్యోతిష్కునకు జూపెను. అతను నా అరచేయి జూచి ఆయుఃరేఖ బాగులేదని పెదవి విరచెను. 25, 30 సంవత్సరములకు మారక మున్నదని మాతండ్రిగారికి చెప్పినట్లు, నే నితరులవలన తెలిసికొంటిని. అప్పటికి దీనినిగురించిన పరిజ్ఞాన మంతగా లేనందున నేను దానిని చెవిని బెట్టుకొనలేదు. కాని నా అరచేతిని జూచుకొనినపుడెల్ల గుండెలో ఏదోభయము తోచెడిది. నాకు యుక్తవయస్సువచ్చి, ప్రపంచజ్ఞానము సంపాదించిన తరువాత, ఎవరు, ఏ హస్తసాముద్రికుడు చేయి చూపమన్నను నేను చూపలేదు. ప్రతిఫల మియ్యనక్కరలేదు, చేయి చూపమని బతిమాలినను చూపలేదు. పై కారణమువలన అప్పుడప్పుడు వ్యాకులత గలుగుచుండెడిది. ఈ వ్యాకులతవలన కాబోలును నాకు అకాలవృద్ధాప్యము గలిగినది. నేను ప్రకృతిరహస్యములను చదివి, గ్రహించి, నమ్మి, ఆచరణలో బెట్టుకొనిన తరువాత, నా కా మారకభయము పోయినది. ప్రకృతి మాతదయవలనను, ఆశీర్వచనములవల్లను, జ్యోతిషము మైనదని నమ్మి, జీవయాత్ర గడుపుచున్నాను.

జ్యోతిషమువలన ఎప్పుడు లాభమంటే - ఒకానొకనికి 30 సంవత్సరములకు మారకమున్నదని అతని జాతకము సూచించు ననుకొనుడు. 30 సంవత్సరములకు చావనున్న వానికి 50 సంవత్సరములు జీవించుటకు వలయు మార్గములను చూపుచో, జ్యోతిషము గొప్పశాస్త్రమగును. ఆ శాస్త్రము, మానవజీవితములు, ధన్యతనొందును. కాని, అకాలమరణమని చెప్పినంతమాత్రమున నేమి ఫలము? ఉపకారముకంటె అపకారమెక్కుడు గలుగుచున్నది. దరిద్రుడగునని సూచింపబడు జాతకునికి ధనమును, సంతతిలేదని సూచింపబడు జాతకునికి సంతానమును, ప్రసాదింపగల మార్గములను చూపినపుడు జ్యోతిషమువలన ప్రపంచమునకు లాభము కలుగును.

అంతేగాని దారినిపోయ్యే కొరిశాంగరాయలచేతిలో అణాడబ్బులు పెట్టి తెలుసుకునే జాతకములన్నియు వ్యర్థము. మీదుమిక్కిలి అతని జీవితము అన్యాయమై పోవును. శకునములను గురించి నమ్మకముగల మానవులెందరో అవసరమైన కార్యముల నెన్నో పాడుజేసికొనుచున్నారు. పీటలమీది పెండ్లిళ్ళుసహితము మానుకొనుచున్నారు. ఒకని కేదైనా చెడ్డ శకునమైన దనుకొనుడు. అతను నా శకునము జూచినదాది తనపని కాదని నమ్మును. అపని కాదేమో, కాదేమో, యని భయపడుచు అట్టితలంపులను మననము జేయుచు వెళ్ళిన, అపని కానే కాదు. ఎందువలన? మనశ్శక్తి అటువంటిది. మంచిగాని, చెడుగాని, ఏ విషయమును గురించి మనస్సు నమ్మునో, దేనిని పదేపదే మననము చేయునో, అది వానికి ప్రత్యక్షమగును. Like attracts like అని ముందు వ్రాసియున్నాను.

కాబట్టి సోదర సోదరీమణులారా! మనశ్శక్తిని గురించి బాగుగ తెలిసికొనుడు. ఆ విషయమును అనుభవములో బెట్టినపుడుగాని, ఆశక్తి యెట్టిదో గోచరింపదు. కాబట్టి జాతకములమీదను, శకునములమీదను నమ్మకమును పోగొట్టుకొనుడు. పరమేశ్వరుని గాఢముగ నమ్ముడు. వాని అనంతశక్తిని ఆకర్షింపుడు. ఆనాడు జ్యోతిషముతో మనకు పనిలేదు.

కొంతకాలము క్రిందట అమెరికాదేశములో, తోకచుక్క పుట్టి గొప్పప్రళయము సంభవించునని యొక జ్యోతిష్కుడు ప్రకటన చేసెనట. ఆ ప్రకటన చూచినది మొదలు ప్రజలు అదిరిపోసాగిరి. ప్రళయ మెట్లువచ్చునో

మరణమెట్లు సంభవించునో యని, ముందుగనే కొందరు విషముపుచ్చుకొని మరణించిరట. జ్యోతిషప్రకారము లోకచూశక్రుపుట్టి, దేశమున కేవిధమైన అపకారము లేకుండ అదృశ్యమైనది. ఈ సంవత్సరము అగష్టు నెలలో హిందూదేశమునకు ప్రళయము సంభవించునని చెప్పిన జ్యోతిష మేమైనది? జనులను కలవరపెట్టినదే గాని, దానివలన నేమి ప్రయోజనము గలిగినది?

గాంధిమహాత్ముడు తన జీవితమును 10 వేలకు భీమా చేసి మొదటి ప్రీమియము చెల్లించిన తరువాత తాను దుకు భీమా చేసితి నని ఆలోచించుకొనెను. భగవంతునిపై విశ్వాసములేక పోవుట యొకటి, అకాలమరణము సంభవించునేమో యను భయ మొకటి. ఈరెంటివలన భీమా చేయవలసివచ్చిన దనుకొని, అట్టిభయమువలనను, భగవంతునిపై విశ్వాసరాహిత్యము వలనను, జీవితము నాశనమై పోవునని తలచి, అభీమాను రద్దుచేసికొనెను.

మనస్సు (1) ఇచ్ఛామనస్సుఅనియు, (Conscious Mind) (2) అనిచ్ఛా మనస్సు అనియు, (Sub-conscious Mind) రెండు రకములు. ఇచ్ఛామనస్సు మన ఆజ్ఞకు లోబడి మన జాగ్రదవస్థలో ఆలోచించుచుండును. అనిచ్ఛామనస్సు మన ఆజ్ఞలతో పనిలేక సుషుప్త్యవస్థ యందు మన కవసరమైనవానిని ఆలోచించి సిద్ధపరచును. అనిచ్ఛామనస్సునకు క్రమశిక్ష (Proper Training) నిచ్చెదమేని మానవుని కది మహోపకారి యగును. ప్రియమిత్రు డనవచ్చును. క్రమశిక్ష పొందిన అనిచ్ఛామనస్సుగలవారు రాత్రి పరుండబోవు ముందు తా నెన్నిగంటల ఎన్ని నిమిషములకు లేవవలెనని గాఢముగ మననము చేసి నిద్రించునో అదే ప్రకారము అనిచ్ఛామనస్సు సరియైనకాలమునకు నిద్ర లేపును. ఇచ్ఛామనస్సు ఆలోచించుటకు సాధ్యపడని చిక్కుసమస్యలనుసహితము పరిష్కరించును. గణితజ్ఞులు, రసాయనశాస్త్రజ్ఞులు, జ్యోతిశ్శాస్త్రజ్ఞులు మొదలగువారు జాగ్రదవస్థలో ఆలోచించుటకు సాధ్యపడని సమస్యలను అనిచ్ఛామనస్సునకు వదలి నిద్రింపగా వారు మరునాడుదయము నిదురనుండి లేచుసరికి సమస్యలు పరిష్కరింపబడి సిద్ధపరుపబడియుండెనట. ఆలాగే దీని సహాయమున మన మారోగ్యము వృద్ధిజేసికొనవచ్చును. దారిద్ర్యమును పోగొట్టుకొనవచ్చును. మన కోరికలన్నింటిని నెరవేర్చుకొనవచ్చును. కాబట్టి అనిచ్ఛామనస్సు మన కుపకారియగుటకు మన మెట్టి శిక్షణ నొసంగవలెను.

ఈ శిక్షణకు ఆదేశము (Suggestion) ప్రధానమైనది. ఆదేశమనగా ఒకవిషయమును గురించి పదేపదే చూచుట; వినుట, మాట్లాడుట, మననముచేయుట, అనగా జపము చేయుట. ఈశతాబ్దములో వర్తకులు ఆదేశముయొక్క గొప్పశక్తిని గ్రహించినారు. ప్రకటన చేయుట (advertisement) ఒకవిధమగు ఆదేశము. ప్రకటన యొక్క అంతరార్థమేమనగా, ఒకవస్తువు మంచిదిగాని, చెడుదిగాని మంచిగుణములు కలదని ప్రకటనచేయుట వలన దానిని ప్రజలు నమ్ముదురు. ఓవల్‌టిన్, గ్లాక్సో, హార్లిక్సు, సెనటోజిన్, లాక్టోజిన్ మొదలైన పానీయములు ఎంత ఉపయోగకారులో సూక్ష్మబుద్ధితో ఆలోచించి పరిశీలనచేసినవారికి తెలియును. ఇవి ఆరోగ్యము నిచ్చుటలో మిక్కిలి శక్తివంతములైనవని విపరీతముగ ప్రకటన చేయుచుండుటవలన ప్రజలు గుడ్డిగ నమ్మి కొనుచున్నారు. ఎందువల్ల కొనుచున్నారంటే, వాని మంచిచెడ్డలు గ్రహించికాదు. ఆదేశముయొక్క శక్తి అటువంటిది. అడ్వర్‌టైజ్‌మెంటుమూలమున పదేపదే చూచుచుండుటవలనను, వినుచుండుటవలనను, మనస్సు యథార్థమని నమ్మును. బాలురకు ఒక విషయమునుగురించి పదేపదే బోధించెదమేని అది వాని జీవితములో స్థిరపడిపోవును. అట్టి ఆదేశము వలన అభ్యాసములవడిపోవును. ఆదేశముచేయు విషయము మంచిదైనచో సదభ్యాసము లేర్పడి జీవితము బాగుపడును. ఆ ఆదేశమే చెడ్డమార్గమున నడచినచో దురభ్యాసములవడి జీవితము నాశనమగును. అందువలననే తల్లిదండ్రులు తమ బిడ్డలకు మంచివిషయములను పదేపదే బోధించుచుండవలెను. ఆబోధనలే వారి జీవితములకు పునాదిగా నేర్పడును. తల్లిదండ్రుల కేదైన త్రాగుట మొదలగు దురభ్యాసము లుండి, తమ బిడ్డలను ఆ దురభ్యాసముల నుండి కాపాడదలచినచో వారు వానిని మానుకొనుట ఉత్తమము. మానుకొనలేనివారు రహస్యముగ బిడ్డలకు తెలియకుండ జేయవలెను. ఆ దురాచారములను బిడ్డలు పదేపదే చూచుటవలన అవి మంచి వని వారు నమ్మి వానిని నేర్చుకొందురు.

కాబట్టి పైవిధముగానే ఏమానవుడు విచారగ్రస్తమగు ఆలోచనలను పదేపదే చింతించుచుండునో వాని అనిచ్ఛామనస్సు ఆ విధముగ తయారగును. మనస్సు ఆవిచారముచే వానిజీవితమునకు సంపాదించి యిచ్చును. సుఖకరమైనట్టియు, సంతోషకరమైనట్టియు ఆలోచనలను జపము చేయుచో వాని జీవితము



సుఖప్రదముగ మారును. కాబట్టి మన జీవితమునకు మేలుచేయునవియు, ముఖ్యమైనవియు అయిన మనోభావములను మననము చేయుచుండవలెను. జీవితమునకు ప్రతికూలమైన ఆలోచనలను మనస్సులోనికి రానీయకుండ కాపాడుకొనుచుండవలెను. 24 గంటలలో ఒక్క గంటయయినను ప్రశాంతముగ నుండుటకు ప్రయత్నములు చేయవలెను. ఒక గంటసేపు ఏకాంతముగ కూర్చొని మీ మనస్సులోని కెట్టి ఆలోచనలు పొంగిపొరలుచున్నవో బాగుగ పరిశీలించుకొని ఆ యాలోచనలు జీవిత పరమావధికి వ్యతిరేకమైనవైనయెడల వానిని వెంటనే తరిమివేసి అనుకూలభావముల నా స్థానమందు రాబట్టుటకు ప్రయత్నించవలెను. సాయంకాలము మీ వ్యాపారము చాలించి ఇంటికి రాగానే వృత్తిసంబంధమైన ఆలోచనలను, తత్సంబంధమైన ఆందోళనమును మరచిపోవలెను. ఇంటికి రాగానే మీ భార్యాపుత్రాదులతో కలసి పరమానందభరితుడవు కావలెను. చెడ్డతలంపులు మరచిపోవలెను. ఈ విధముగ నిత్యమొకగంట;గంటన్నర కాలములను మీ మానసిక రాజ్యమును ఆక్రమింపజేయుదురేని మీ ఆరోగ్యము చక్కబడి మీజీవితము ఆనందముతో కూడియుండును. మానవుడు ముఖ్యముగ నిద్రించుటకుముందు ఏ యాలోచనలు మనస్సు నాక్రమించునో, అవియన్నియు నిద్రలో స్థూలశరీరమందు ముద్రితమగును. ఏ భావములను మననముచేయుచు నిద్రింతురో, ఆ తీరుగ అనిచ్ఛా మనస్సు తయారగును. కాబట్టి నిద్రపోవుటకు ముందు మనస్సు ప్రశాంతముగ నుండునట్లు చూచుకొనవలెను. మనస్సు స్వాధీనపడక యున్న సమయములో భారత భాగవతములవంటి సద్గ్రంథపఠనము చేయుడు. వెంటనే మనస్సు శాంతపడును. వెంటనే బహిరంగప్రదేశమునకు వెళ్ళి దీర్ఘముగ గాలిపీల్చి వదలుచు "దైవశక్తి నా శరీరములో ప్రవేశించుచున్నది. ఈ భగవచ్ఛక్తితో నా శరీరమంతయు నిండిపోవుచున్నది. నేను ఆరోగ్యవంతుడను. సంపూర్ణారోగ్యవంతుడను" అని మననము చేయుచు పడకవద్దకు వెళ్లి ఆ భావములనే నిద్రవచ్చువరకు జపముచేయుచు, నీవు సంపూర్ణారోగ్యస్థితిలోనున్నట్లు, ఆ ప్రతిబింబమును మనస్సునందు ప్రత్యక్షముగ చూచి ఆనందించుచు నిద్రించవలెను. ఈలాగున ప్రతినిత్యము మననము చేయుటవలన దినక్రమేణ ఆరోగ్యము వృద్ధియగును. దీర్ఘాయువు కలుగును. మొదట మొదట ఇట్టిప్రయత్నము కొంచెము కష్టముగ నుండవచ్చును. ఒకటి రెండు మాసములు విడువక ప్రయత్నింతురేని చాల సులభమగును. వెంటనే ఫలితములు కనబడకపోయినను విడువవలదు. మనశ్శక్తి యింత మహత్తరమైనదని నీకు స్పష్టముగ గోచరించువరకు కష్టము. ఆ తరువాత నీ జీవిత మెట్లు నడువవలెనని నను కొందువో, ఆ లాగున నడచును. అప్పుడరచేతిలో వైకుంఠము చూడగలవు.

ఆరోగ్యసంబంధమైన ఆదేశముతో పనిలేనివారు, వారి జీవితాశయమునకు సంబంధించిన ఉత్తమమైన ఆలోచనలను జపము చేసికొనవచ్చును. దేనిని కోరినను, దేనిని జపము చేసినను, గాఢముగ చేయవలెను. 212° F వేడిమి వచ్చినపుడే నీరు ఆవిరిగా మారును. 200° డిగ్రీల వేడిమి చాలదు. 210 డిగ్రీలు కూడ చాలదు. గోరువెచ్చని నీటితో నెవ్వరును రైలును నడుపజాలరు. ఆలాగే మనకోరిక నెరవేరవలెనంటే, మనస్సులో ఊహించినంత మాత్రమున రాదు. గాఢముగను అతితీవ్రముగను కోరవలెను. అప్పుడు నీ కోరికలు నెఱవేరును.

*

Physiologists tell us that the mental processes which are active on retiring, continue far into the night. These mental impressions on retiring, just before going to sleep, the thoughts that dominate the mind, continue to exercise influence long after we become unconscious.

We are told, too, that wrinkles and other evidences of age are formed as readily during sleep as when awake, indicating that the way the mind is set when falling asleep has a powerful influence on the body.

Many people cut off the best years of their lives by the continuation in their sleep of the wearing, tearing, rasping influence that has been operating upon them during the day.

Thousands of business and professional men and women are so active during the day, live such strenuous, un-natural lives,

---

N. B. ఈ వ్యాసకర్తనగు నేను మనశ్శక్తిని గురించి అనేకగ్రంథములను చదివి, దానిని నమ్మి, ఆచరణలో పెట్టి (సంపూర్ణముగ కాకపోయినను) కొంత వరకు దాని ఫలితముల ననుభవించి ఆనందించుచు ఈ వ్యాసము వ్రాసినాను. స్వానుభవము వలన వ్రాసిన విషయములని మనవి చేయుచున్నాను.

that they cannot stop thinking after they retire and sleep is driven away or only induced after complete mental exhaustion. These people are so absorbed in the problems of their business or vocations that they do not know how to relax, to rest; So they lie down to sleep with all their cares, just as a tired camel lies down in the desert with its great burden still on its back.

The result is that, instead of being benefitted by refreshing, rejuvenating sleep, they get up in the morning weary, much older than when they retired; when they ought to get up full of vigour, with a great surplus of energy and bounding vitality, strong and ambitious for the day's work before them.

All this shows the importance of preparing the mind to exercise a healthful, uplifting influence during sleep. It is more important to prepare the mind for sleep than the body. The mental bath is more necessary than the physical one.

Never allow yourself under any circumstances to retire in a discouraged, despondent, gloomy mood or in a fit of temper. Never lie down in a frown on your brow, with a perplexed, troubled expression on your face.

Life is too short, time too precious to spend any part of it in unprofitable, health wrecking, soul-racking thoughts. Be at peace with all the world, at least once in every 24 hours.

Persistency in preparing mind for peaceful, healthful, happy sleep will prolong your life and your health.

Discordant thought of every kind tends to shorten life. Youthful thought should be a life habit. We are all conscious that there is something in us which is never sick and which never dies, something which connects us with the Divine. There is a wonderful healing influence in holding the consciousness of this great truth.

The coming man will not grow sick or old as he now dies. The tendency of the race will be more and more toward perpetual youth.

He can who thinks he can, and he cannot who thinks he cannot.

O. S. MARDEN.







# ఆరోగ్యము, బలము, మన కెట్లు చేకూరుచున్నవి?

యోగి రాఘవేంద్రగారు

మన భరతఖండ తత్వవేత్తలు నుడువురీతిని, ప్రకృతి యంతయు, రెండు పదార్థముల కలయికచే నేర్పడుచున్నది. అందొకటి, పదార్థము (Matter) రెండవది శక్తి (Spirit). మంచుగడ్డ ఉష్ణమునకు కరిగి నీరై ఆ నీరు వేడివల్ల ఆవిరిగా మారుచున్నదికదా? ఆ యావిరిని చల్లబరచిన మరల నీరుగను, దానిని చల్లబరచిన మంచుగడ్డగను, అగుచున్నదికదా! ఆ విధముగానే ప్రపంచ నిర్మాణమునకు పూర్వము పదార్థము (Matter) అంతయు ఆకాశరూపమున నుండును. ప్రపంచారంభమందు నీ యాకాశమే ఖనిజములుగను, ద్రవములుగను, వాయువులుగను, మారుచున్నది. ఇంతియేగాక మనము చూచు సూర్య, చంద్ర, నక్షత్రములును, జీవముగల మానవ, పశు, పక్ష్యాదులును, నవి యివి యననేల, ప్రకృతి యందున్న సర్వము నీ ఆకాశమునుండి పుట్టుచున్నవి. ఈ ఆకాశము, సూక్ష్మరూపమై యుండుటచే మనము దానిని కనులచేత చూడనేరము. కాని అది స్థూలాకారమున ప్రకృతియందు రూపము నొందినపుడు మనకు గోచరమగును. ప్రపంచప్రళయమగు నప్పుడు ఖనిజములును, ద్రవ్యములును, వాయువులును మరల నీ యాకాశములోనికే మరిగిపోవుచున్నవి.

ఏ దైవశక్తివలన నీ ఆకాశము ప్రపంచమందు సర్వవ్యాపకమైన పదార్థముగ నిర్మింపబడినదో, ఆ ఈశ్వర శక్తివలననే అపారమగు నీ ప్రాణము (Spirit) గూడను ప్రపంచమందు సర్వవ్యాపకమై జీవశక్తిగ నిర్మింపబడెను. ప్రపంచప్రారంభమందును, అంతమందును, ప్రకృతియును, ఆకాశముగ మారునట్లు ప్రపంచమున గలుగు సర్వశక్తులీ ప్రాణముగ మారును. మరల గలుగు యుగనిర్మాణమందు జవమనియు, సత్వమనియు, పిలువబడు ప్రకృతియు నీ ప్రాణమునుండి గలుగుచున్నది. చలనముగను, ఆకర్షణశక్తిగను గన్పడునది, ఈ ప్రాణమే. ఈ ప్రాణమే శరీరమందలి వృత్తులుగను, నాళజవముగను, భావనాశక్తిగను, మారుచున్నది. ప్రపంచమున గలుగు మానసిక శారీరిక శక్తులన్నియును గమ్యస్థానమున నేకమగునప్పుడీ ప్రాణమగుచున్నది. ఇట్టి శక్తిప్రదమైన ప్రాణమే నాడు చలనముడిగి స్తంభించునో ఆనాడు ప్రపంచమందలి సమస్తపదార్థములు ఆకాశమందు లీనమగుచున్నవి తిరుగ జరుగు రెండవ నిర్మాణమందీ శక్తి ఉద్భోధమయి ఆకాశము దాక, నా ఆకాశమునుండి మనము జూచు నీ వివిధరూపములు వెలువడుచున్నవి. ఈ ఆకాశ మెన్నివిధములుగ మారునో యన్ని శక్తులుగ నీ ప్రాణముగూడను మారుచున్నది

మనము నిత్యము చూచు యంత్రములునహా ఈ రెండు వస్తువులయొక్క (Matter and Spirit) కలయిక వల్లనే నడపబడుచున్నవి. అనగా ఆవిరిచే ఇంజనులు మున్నగునవి నడపబడుచున్నవి. ఆ విధముగానే మన దేహము, అనగా చర్మము, రక్తము, నరములు, కండరములు, ఎముకలు, మున్నగు పదార్థము (Matter), శక్తి (Spirit) యొక్క సహాయముతో నడపబడుచున్నది. ఆ శక్తియే మనము భుజించు నాహారమును రక్తముగా మార్చి సర్వేంద్రియములకును బ్రసరించునట్లు చేయుచున్నది. మరియు మన దేహమందలి సమస్తవిధములగు మాలిన్యములను వెలువరించుచున్నది. ఇట్టి శక్తి మనయం దెంత విస్తారముగా నుండునో మన మంత ఆరోగ్యముగాను, బలముగాను, ఉండి చిరకాలము జీవింపగలుగుదుము. ఇది మన దేహమందు తగినంతలేక లోపించినప్పుడే, దేహమందు నిత్యము తయారగు మల, మూత్ర, స్వేదములు, మున్నగు మాలిన్యములు సక్రమముగా వెలువరింపబడక అవి దేహమందే నిలువయుండి అందే కుళ్ళి సమస్తవిధములగు వ్యాధులకును, దుర్బలతకును, అకాల మరణమునకును, హేతువగుచున్నది.

ఈ ప్రాణశక్తి పంచభూతముల యన్నింటి యందును నిండియున్నది కావున, ఆ భూతపంచకముతో సన్నిహితసంబంధము కలిగి మనము జీవించినప్పుడు అందలి ప్రాణశక్తి మనకు చేకూరుచుండును. అనగా మృత్తికాస్నానములు, భూశయనాదికార్యములవల్ల మట్టియందలి ప్రాణశక్తియును, జలస్నాన, పానాదులవల్ల నీటియందలి ప్రాణశక్తియును, సూర్యరశ్మిలో తిరుగాడుచుండుటవల్ల ఆ తేజస్సునందలి ప్రాణశక్తియును, శుద్ధవాయుసేవనము, పరిశ్రమచేయుచుండుటవలన గాలియందలి శక్తియును, ఉపవసించుటవలన ఆకాశమందలి ప్రాణశక్తియును మనకు

లభ్యపడుచుండును. తద్వారా మనకు ఆరోగ్యము, బలము చేకూరుచున్నవి.

ఈ ప్రాణశక్తి మనలోనికి నాడీమండలముద్వారా ప్రవహించుచున్నది. కావున దీనిని నాడీశక్తి (Nerve Force) లేక ధాతుశక్తి (Vitality) యని కూడ నందురు. నాడీమండలము విచ్ఛిన్నమైనప్పుడు గాని లేక దానియందు మార్గనిరోధము కలిగినపుడు గాని ఈ ప్రాణశక్తి మనలోనికి ప్రవహింపనేరదు. అప్పుడు మనశరీరము కదలనేరదు. కాన మనము జీవింపజాలము. కావుననే మనదేహమందు నాడీమండలము ప్రధానమైనదని చెప్పబడుచున్నది. పక్షవాతము వచ్చినప్పుడు



ఆ పార్శ్వమందు చర్మము, రక్తము, నరములు, కండరములు, ఎముకలు మున్నగునవన్నియు నున్నప్పటికిని ఆ పార్శ్వమందు కదలిక ఉండనేరదు. ఎందుచేత?

దేహచలనమునకు ప్రధానమైనశక్తి అచ్చట లోపించినది. సునిశితమగు నీప్రాణము ప్రవహించు మార్గము పూడిపోయినది; లేక మలినపదార్థములతో నిండిపోయినది కాన మన మే నాడు ఆ ప్రాణశక్తి ప్రవహించుటకు వలయుమార్గములను బాగుచేయుదుమో ఆనాడు ఆపార్శ్వమునకు కదలిక గలుగును. కావున చర్మము, రక్తము, నరములు, కండరములు, ఎముకలు, మున్నగు వానికన్న నీ ప్రాణశక్తియే, మన జీవితమునకు ప్రధానమైనదని విశదమగుచున్నదికదా! కాన మనమెంతగా ప్రాణశక్తిని మనదేహములలోనికి ఆకర్షించుకొనగలమో అంత ఆరోగ్యవంతులుగను, బలవంతులుగను, దీర్ఘాయుష్మంతులుగను ఉండగలము.

మనము జన్మించినది లగాయితు చనిపోవువరకు ప్రకృతియందున్న ప్రాణశక్తి అప్రయత్నముగ మన దేహములలోనికి ప్రవహించుచునే యున్నది. కాని మన దేహమందలి రక్తముయొక్క శుభ్రత ననుసరించి ఈశక్తి మనలోనికి ప్రవహించుచుండును. మన రక్తము మాలిన్యముగా నున్నచో ఈశక్తి మనలోనికి తగినంత ప్రవహించనేరదు. కావున మనము ప్రకృతిమాతనుండి ప్రాణశక్తిని ఎక్కువగా స్వీకరింపవలయునన్న మన రక్తమును ఎక్కువగా శుభ్రతగా నుంచుకోవలయును. రక్తము శుభ్రతగా నుంచుకోవలయునన్న మనము పవిత్రమగు ఆహారమును తినుచుండవలయును. అనగా త్వరగా కుళ్ళిపోయి రక్తమును చెరచు మాంసము, గ్రుడ్లు, మరియు నాడీమండలమును ఉద్రేకపరచి రక్తమును మలినముగా చేయు ఉప్పు, కారము, చింతపండు పులుసు, మసాలాదినుసులు మున్నగు వానిని విసర్జించి, రక్తమును శుభ్రపరచునట్టి ముడిధాన్యములు, ఆకుకూరలు, కాయగూరలు, పాలు, పండ్లు, మజ్జిగ మున్నగువానినే ఆహారముగా తీసుకొనుచుండవలయును. ఇట్టి పవిత్రమగు ఆహారమును గైకొనుచు ప్రకృతిమాతనుండి మరింత ప్రాణశక్తిని స్వీకరించి సంపూర్ణ ఆరోగ్యభాగ్యమును బడసి, మాతృదేశమును దాస్య శృంఖలములనుండి తొలగించి శాశ్వతకీర్తిని బడసి సుఖింతురుగాక?



# ప్రకృతివైద్యము - జలచికిత్స

## మృత్తింటి ఆంజనేయులు

It is a complete revolution in the art and science of living. It is the practical realization and application of all that is good in natural science, philosophy and religion.

(Lindlahar)

అన్ని మతములలోని అన్ని శాస్త్రములలోని గొప్పతనమును, దేహములోని నిర్మాణశక్తికి అనుకూలముగా సమన్వయము చేయుటయే ప్రకృతివైద్యతత్వమని సుప్రసిద్ధుడగు హెన్రీలిండ్లహార్ నిర్వచించినాడు. దేహములోని నిర్మాణశక్తికి వ్యతిరేకముగా నుండరాదు.

ముఖవైఖరీవిద్య, కశేరుకానిదానము, కనీనికానిదానము, అను మూడురకములగు నిదానశాస్త్రములు గలవు. ఈ నిదానములవలన వైద్యుడు రోగముయొక్క నిజస్వరూపమును గుర్తించవలెను. పుట్టుపూర్వోత్తరములను వైద్యుడు సరిగా తెలుసుకొనవలెను. చికిత్సా విధానములలో అయిదు రకములు గలవు. అవేవన (1) మానసికచికిత్స, (2) జలచికిత్స, (3) మృత్తికాచికిత్స, (4) సూర్యకిరణచికిత్స, (5) కాంతిచికిత్సలు. ఈ అయిదు విధానములలో నే విధానము రోగికి అందుబాటులోను వీలుగాను ఉండునో చూచుకొని సరిగా చికిత్స చేయవలెను. ఈ విధానములలోని ప్రకృతుల నన్నిటిని సరియగు మార్గములలో ప్రయోగించిన యెడల దేహములోని నిర్మాణశక్తి పోషకలుగ సహాయపడును. అన్ని ఉపయోగకరమైన విధానములు అందుబాటులో నుండక కేవలము ఒక దానితోనే చికిత్సింప చూచుట కష్టసాధ్యము. రెండెడ్లబండికి (రెండు ఎడ్లు అందుబాటులో నుండగా) ఒక ఎద్దును కట్టినట్లుండును. రోగియొక్క మనస్సునకు చికిత్సచేసి రోగము నయము చేయుట ముఖ్యమే. ఇది ముఖ్యము గదా అని మిగిలిన జలచికిత్స, మృత్తికాచికిత్స, సూర్యకిరణ చికిత్స మొదలగు చికిత్సావిధానములు అప్రధానములని త్రోసివేయుటకు వీలులేదు. యథాక్రమముగా వాటిని ఉపయోగింపవలసినదే. జలచికిత్సవలన దేహవ్యాపారములో జరుగు మార్పులను తెలిసికొందాము.

పంచభూతములలో నీరు ఒకటి. ఈ నీటిని మానవకోటి అనేకవిధములుగా ఉపయోగించుచున్నారు. లోనికి త్రాగుటకును, తడికట్లకును, స్నానములకును, ఆవిరిగాను ఇంకా అనేకవిధములుగాను వాడుకొనుచున్నారు.

తొట్టిస్నానము అనగానే, కటిస్నానము, లింగస్నానము అని వెంటనే మనకు ద్యోతకమవుతుంది. దేహమునకు చేసిన చన్నీటి ప్రయోగమువలన రోగపదార్థము ఎట్లు బయటకు పోయేదీ, ఆరోగ్యము ఎట్లు కలిగేది, శాస్త్రసమ్మతముగా తెలుసుకొనగలందులకై యీ వ్యాసము వ్రాయుచున్నాను.

చన్నీటి ప్రయోగమువలన రెండురకములగు ఫలితములు కలుగును. (1) ప్రత్యక్షఫలితములు (2) పరోక్షఫలితములు. చన్నీటి ప్రయోగమువలన చర్మములో కలుగు మార్పులు, ఉచ్ఛ్వాస నిశ్వాసములలో కలుగు తేడాలు, కండరములలో కలుగు చైతన్యము, నాడులలో కలుగు ఉజ్జీవనము మొదలగునవి ప్రత్యక్షఫలితములు. రక్తముయొక్క గుణములో కలుగు మార్పులు, జీర్ణావయవములలో కలుగు ఉత్తేజము, బహిష్కార్యావయవములలో కలుగు ఉద్దీపనము, దేహముయొక్క ఉష్ణధర్మములో కలుగు మార్పులు మొదలగు పరోక్ష ఫలితములను గూర్చి సంగ్రహముగా నీ వ్యాసములో తెలుసుకొందాము.

దేహములో నాలుగు బహిష్కార్యావయవములు గలవు. ఈ నాలుగు బహిష్కార్యావయవములలోను చర్మము

చాలా ప్రధానావయవము. నఖశిఖపర్యంతము వ్యాపించి యుండును. చన్నీటిని లోనికి త్రాగినందు వలనను, చన్నీటితో ఎనిమా చేసినందు వలనను, లోపలి ఆమత్వాచమును చల్లబరచి నట్లగును. ఇట్లు ఆమత్వాచమును చల్లబరచుటచే కలిగిన ఉపయోగముకన్న చర్మమునకు చేసిన చన్నీటిప్రయోగమువలన నెక్కువ ఉపయోగములు కలుగును. అందును వేడినీటిని వాడుటకన్న, చన్నీటిని వాడినందువలన నెక్కువ ఉపయోగములు కలుగును.

దేహము ఒక కొలిమివంటిది. ఈ కొలిమిలో అనుక్షణమును, రాసాయనిక ధూమము తయారగుచుండును. పదార్థమంతయు ఘనద్రవవాయురూపము లని మూడు విధములు. దేహము మొత్తమునకు నాల్గు బహిష్కార్యవయవములు గలవు - మలకోశము, మూత్రకోశము, ఊపిరితిత్తులు, చర్మము. ఘనరూపమైన మలినములు మలకోశము ద్వారాను, ద్రవరూపమైన మలినములు మూత్రకోశము ద్వారాను, వాయురూపమైన మలినములు ఊపిరితిత్తులద్వారాను, బయటకు పోవును. చర్మముద్వారా ఘన, ద్రవ, వాయు రూపమైన మూడు రకములైన మలినములు బయటకు పోవును. దేహమునకు చన్నీటిప్రయోగము చేసినయెడల ప్రకృతి క్రియాఫలితముగా చర్మరంధ్రములు వికసించును. ఈ వికసించిన చర్మరంధ్రములద్వారా దేహములో తయారగు ఘనద్రవవాయు రూపము లగు మలినములు బయటకు పోవును.

చన్నీటిప్రయోగమువలన రక్తప్రసరణములో కలుగు మార్పులను తెలుసుకొందాము. రక్తముయొక్క వేగము తగ్గును. బాగా వేగముతో ప్రవహించుచున్న రక్తము చన్నీటిప్రయోగమువలన తక్కువ వేగముతో పరుగిడును. ఒక్కమారుగా చేసిన చన్నీటిప్రయోగమున మొదటగా హృదయస్పందనములు హెచ్చును. నాడి త్వరలోనే క్రమమునకు వచ్చును. క్రమేపీ తగ్గును. స్నానములయొక్క కాలము, సంఖ్యనుబట్టి హృదయస్పందనములు తగ్గును. చన్నీటిప్రయోగమును అనగా కటిస్నానమును, లింగస్నానమును పావుగంట చేయవలెననువారును, అరగంట చేయవలెననువారును, ముప్పావుగంట చేయవలెననువారును, గంటచేయవలెనను భిన్నమతములవారు లేకపోలేరు.

స్నానము నెక్కువకాలము చేయుటకన్న పదినిమిషములకు లోపుగా చేయుటవలననే యెక్కువ ఉపయోగములు కనబడినట్లు మిచిగాన్ లోని బాటిల్ క్రీక్ ఆరోగ్యసదనాధిపతులగు డాక్టరు జె. హెచ్. కెల్లాగు, యమ్. డి. గారు తమ 'Rational Hydrotherapy'లో సోదాహరణముగా సెలవిచ్చియున్నారు. శాస్త్రసమ్మతముగా రుజువుపరచినారు. నీపు, బిల్జు, లిండ్లహార్, మొదలగువారందరిదే అభిప్రాయమును చెప్పినారు. జలచికిత్సను గూర్చి శాస్త్రసమ్మతముగా చెప్పినవారిలో హాలే, ఫ్లూరీ, జాన్‌సన్‌లు ముఖ్యులు. వీరందరును జలచికిత్సవలన ఉచ్ఛ్వాస,నిశ్వాసములలో చెప్పదగిన మార్పులెవ్వియు రావని సెలవిచ్చిరి. శీతల, సమశీతల, ఉష్ణోదకములను వివిధరీతులుగ ప్రయోగించినందువలన ఉచ్ఛ్వాసనిశ్వాసములలో క్రమమైన మార్పులు వచ్చినట్లు, నవీనపరిశోధనలు చెప్పుచున్నవి. చన్నీటిని ప్రయోగించినందువలన ఉచ్ఛ్వాస నిశ్వాసలు ఎక్కువగును. బొగ్గుపులుసుగాలి యెక్కువగా బయటకు పోవును. ప్రాణవాయువును ఎక్కువగా పీల్చుదుము. సిరారక్తమునకును, ధమనిరక్తమునకును, గల తేడా యెక్కువగునని జలచికిత్సను గూర్చి గొప్ప శోధనలు జరిపిన క్రిఫర్డ్ గారు 1781 సంవత్సరములోనే సెలవిచ్చారు.

వ్యాయామము వలనను చన్నీటిప్రయోగము వలనను కండరములలోని చైతన్యము వృద్ధియగునని ఒక శతాబ్దముక్రిందటనే హైబిక్ నిశ్చయపరచినాడు. చన్నీటిప్రయోగమును యెక్కువ కాలము చేసినయెడల కాళ్ళు, చేతులు కొంకరులు పోవును కండరములలో నీరసము కల్గును. ఈ ప్రయోగమును కొంత కాలమే చేసినయెడల కండరములలోని ఉద్రేకము తగ్గును.

చర్మములోని సన్ననికండరములలో చైతన్యము కలుగును. దేహములో ఇచ్ఛాకండరములు, అనిచ్ఛాకండరములు అని రెండురకములగు కండరములు గలవు. చన్నీటిప్రయోగము వలన ఇచ్ఛాకండరములలోని ఉద్రేకము తగ్గును. చర్మములోని సన్ననికండరములలో చైతన్యము వృద్ధియగును. అందువలననే చర్మము ఎర్రబారును. దేహములోని యేదొక భాగమును చల్లపరచినప్పటికి మొత్తము దేహమంతయు చల్లబడును. కొన్ని ప్రతినిధిస్థానములు బాగా చల్లబడును. పాదములనుగాని, పొత్తికడుపునుగాని, చల్లబరచినపుడు చిన్నప్రేగులలోను మూత్రకోశములోను గల అనిచ్ఛాకండరములలోను ఉద్దీపనము కలుగును.

తలను, మెడను, ముఖమును, పాదములను, చేతులను

చల్లబఱచిన యెడల మెదడు చల్లబడును. మెడను, ముఖమును, మెడప్రూసను, పాదములను, చేతులను, చల్లబఱచిన యెడల ముక్కులోని అనుత్వచము చల్లబడును.

5, 6, 7, 8 మెడప్రూసలను చల్లబఱచినయెడల జీర్ణాశయము చల్లబడును.

రొమ్ముఎముకలోని క్రిందిభాగమును, పాదములను చల్లబఱచిన మూత్రపిండములు చల్లబడును.

పొత్తికడుపును పాదములను చల్లబఱచిన మూత్రకోశములోని ఉద్రేకము తగ్గును, చల్లబడును.

కుడివైపు రొమ్ములోని క్రిందిభాగమును చల్లబఱచిన మధుకోశము చల్లబడును

ఎడమవైపు రొమ్ములోని క్రిందిభాగమును చల్లబఱచిన ప్లీహము చల్లబడును.

రొమ్మును, తొడలను, చల్లబఱచిన, ఊపిరితిత్తులు చల్లబడును.

లోపలితొడలను, పాదములను చల్లబఱచిన యెడల గర్భాశయము చల్లబడును.

తొట్టిస్నానమువలన నాడీమండలములో కలుగు సంకోచ, వ్యాకోచములను అందువలన కలిగిన ఫలితములను తెలుసుకొందాము. దేహములో నే భాగమునకు చన్నీటి ప్రయోగమును చేసినా, నాడీమండలము పరోక్షముగా చల్లబడును. చన్నీటిప్రయోగమును ప్రత్యేకముగా నాడీమండలమునకు చేసినయెడల నేమేమి ఫలితములు కలుగునదియు తెలిసికొందాము.

ఇతః పూర్వమువరకును నాడీమండలమునుగూర్చి వివిధాభిప్రాయము లుండెడివి. పూర్వప్రభావములను నవీనపరిశోధనలు తాఱుమాఱుచేసినాయి. నాడీమండలమంతయు ఒకే అవయవమని వెనుకటి శాస్త్రజ్ఞులు సెలవిచ్చినారు. నాడీమండలమంతయు చిన్న చిన్న న్యూరాన్లసమూహమని నవీనపరిశోధనలు తెలియచెప్పాయి. మానవదేహములోని సూక్ష్మాతిసూక్ష్మమైన భాగమునకు కణమని పేరు. వివిధకణములు కలసి మానవదేహమెట్లు తయారైనదో అట్లనే అనేక న్యూరాన్లతో నాడీమండలము తయారైనది. ఈన్యూరాన్లన్నియు ఒకదానితో మరొకటి లంకె వేయబడి యున్నవి. శీతల, ఉష్ణప్రయోగములవలన ఒక న్యూరాన్లో వచ్చిన సంకోచ, వ్యాకోచములు అన్నిన్యూరాన్లలోను వచ్చును. చన్నీటి ప్రయోగమువలన కలుగు శీతలత్వము వలన ప్రతిన్యూరాన్ కూడా ముడుచుకొనును. ఇట్లు ముడుచుకొనుటవలన ప్రక్కనఉన్న న్యూరాన్తోడి సంబంధము తాత్కాలికముగా తెగిపోవును. నాడీమండలములో ఉద్వేగము కలిగినదంటే న్యూరాన్లలో ఉద్వేగము కలిగినదన్నమాటేను. న్యూరాన్లకన్నిటికి ఇట్టి సంబంధ ముండుటవలనను, అతిశీతలప్రయోగమువలన న్యూరాన్లలో మార్పు కనబడుటవలనను, అతి శీతలప్రయోగములుగాని అత్యుష్ణప్రయోగములుగాని చేయువాడు మంచుగడ్డనుకట్టి చల్లపఱచుటగాని, అత్యుష్ణప్రయోగమును చేసి ఉద్రేకములను కలుగింపుటయు హానికరమే. నుదురుమీదను, నెత్తిమీదను మంచుగడ్డను కట్టినందువలన రక్తనాళములలో సంకోచము కలుగును. మానసిక స్తబ్ధత యేర్పడుటయే గాక స్మృతిలేకుండా పోవుటయు కలుగును.

జలముయొక్క ఉష్ణధర్మమును బట్టిన్ని, రోగియొక్క ధాతుశక్తినిబట్టిన్ని, ప్రక్రియను బట్టిన్నీ, ఫలితములు మారుచుండును. గనుక వైద్యుడు యుక్తాయుక్తములను విచారించి చన్నీటిని వాడవలెను.

దేహమునకు చేసిన చన్నీటి ప్రయోగమువలన గలిగిన ప్రత్యక్షఫలితములను గూర్చి యింతవరకును తెలుసుకొన్నాము ఇక పరోక్షఫలితములను గూర్చి తెలుసుకొందాము. ఈరకమగు ఫలితములలోకెల్లా రక్తములో కలుగుమార్పులు ముఖ్యము. దేహమునకు చన్నీటి ప్రయోగమును చేసినయెడల తెల్లకణముల సంఖ్యయు, ఎర్రకణముల సంఖ్యయు పెరుగును. చన్నీటి ప్రయోగము చేయుటకు పూర్వముఉన్న సంఖ్యకును, తరువాతి సంఖ్యకును ఏమియు సంబంధముండదు. 1893 సంవత్సరములో ప్రొఫెసరు వింటర్నిట్జ్ యేమన్నాడంటే దేహమునకు చన్నీటిప్రయోగమును చేసినయెడల తెల్లకణముల సంఖ్యయు, ఎర్రకణముల సంఖ్యయు విపరీతముగా పెరిగిపోవును. అందును తెల్లకణములసంఖ్య ఎర్రకణముల సంఖ్యకన్న మరీ పెరుగును. వేడినీటి ప్రయోగము చేసినవెంటనే చన్నీటిప్రయోగము చేసినయెడల వెనుకటికన్న ఒక క్యూబిక్ మిల్లీమీటరు (c. m, m) లోనే 1860000 తెల్లకణముల సంఖ్య యెక్కువైనదని ప్రొఫెసరు వింటర్నిట్జ్ రూపించినాడు. అంతవరకును లేని రక్తకణములు చన్నీటిప్రయోగముతో నెక్కడనుండి వచ్చినవని మా చదువరులకు సందేహము కలుగవచ్చును. దీనికి వింటర్నిట్జ్ యేమని సమాధానము చెప్పాడంటే – దేహములో నే ఒకమూలను

చల్లబఱచినా, మధుకోశము, ప్లీహము, మూత్రపిండము లలో అంతవరకును కదలిక లేకుండాను, మారుమూల లలోను పడియున్న తెల్లరక్తకణములన్నీ రక్తప్రవాహములోనికి వచ్చుటచేత తెల్లకణముల సంఖ్య పెరుగును. పై అభిప్రాయము తృప్తికరముగా లేదని డాక్టరు జె. హెచ్. కెల్లాగు, యం.డి. గారు చెప్పుచున్నారు. వారు చెప్పునదేమంటే దేహములోని ఏ భాగమునకు చన్నీటిప్రయోగము చేసినా ఆ భాగములోని రక్తకణముల సంఖ్యయే పెరుగును. మిగిలిన భాగములలోని రక్తకణములసంఖ్య పెరుగుటలేదు.

జలచికిత్సనుగూర్చి పెక్కుపరిశోధనలు జరిపిన Strasser 1896 సంవత్సరములో సేమన్నాడంటే దేహమునకు చేసిన చన్నీటిప్రయోగమువలన రక్తములోని క్షార సంపద పెరుగును. రక్తములోని ఆమ్లములు తగ్గిపోవును. చన్నీటిప్రయోగమువలన జీర్ణక్రియలో కలుగుమార్పులను గూర్చి తెలుసుకొందాము. దేహమునకు చేసిన చన్నీటిప్రయోగమువలన జీర్ణాశయములోని ఆమాశయ చములోను, చిన్నప్రేగులలోని ఆమత్వాచములోను, ఉజ్జీవనము (Stimulation) కలిగి జీర్ణక్రియ బాగుపడును. ఆహారము బాగుగా అరుగును. ఉత్సాహము కలుగును. ఈవిషయములను ఫ్లూరీ, సోదాహరణముగా నిరూపించినాడు,

జీర్ణాశయముమీద తడి పొత్తిని వేసినయెడల జీర్ణాశయములో తయారగు HCL (Hydrochloric acid) ఎక్కువగా తయారగును. ఈరసము జీర్ణక్రియకు బాగా తోడ్పడును. జీర్ణాశయముమీద తడిపొత్తిని వేసిన యెడల ఈరసమే యెక్కువగా తయారగును. అగ్నిమాంద్యము (Hypopepsia) మొదలగు రోగములు త్వరగా కుదురును.

మధుకోశము చెడుటచేత వచ్చిన జబ్బులకును, చిన్నప్రేగులు సరిగా పనిచేయకపోవుటవలన కలిగిన సన్నిపాతము మొదలగు రోగములకును, చలిజ్వరము లకును, అజీర్ణమునుండివచ్చిన నాడీవ్యాధులకును చన్నీటిప్రయోగము బాగుగా సహాయకారియగును. స్కర్వీ మొదలగు ఎముకసంబంధమైన వ్యాధులకును చన్నీటి ప్రయోగము బాగా సహాయపడును.

చన్నీటి ప్రయోగమువలన బహిష్కరణక్రియలలో నేమైనా మార్పులు కలుగునేమో తెలిసికొందాము.

చన్నీటిప్రయోగము కొంతకాలమే చేసినయెడల ప్రతిక్రియాఫలితముగా చర్మరంధ్రములు వికసించుకొని చెమట బయటకువచ్చును. చన్నీటిప్రయోగమును ఎక్కువకాలము చేసినయెడల చర్మరంధ్రములు మూసికొనిపోయి చెమటరాదు. చెమట యెక్కువగా పోయుచున్నయెడల మూత్రము తక్కువగును. అతిశీతలోదకమును జంతువుల దేహముల మీద ప్రయోగించినపుడు ఆయాజంతువుల మూత్రపిండముల లోని చిన్నచిన్నకణములు సంకోచమును పొందినట్లును అందువలన మూత్రపిండములు చిన్నవైనట్లును డా. కెల్లాగుగారు గ్రహించినారు.

బొగ్గుపులుసుగాలి యెక్కువగా బయటకుపోవును. ప్రాణవాయువును ఎక్కువ గాలిలోనికి పీల్చెదము.

చన్నీటి ప్రయోగమువలన మూత్రపు పరిమితి హెచ్చును జ్వరము వచ్చినప్పుడు చన్నీటిప్రయోగమును చేసిన యెడల మూత్రపుపరిమితి అరురెట్లు పెరుగుటయు, కలదు. మూత్రపు పరిమితి పెరుగుటయేగాక రోగ పదార్థము లవణములుగా బయటకు పోవును.

దేహమునకు చేసిన చన్నీటిప్రయోగమువలన దేహము యొక్క ఉష్ణధర్మములో నేమేమి మార్పులు కలుగునో పరిశీలిద్దాము. సామాన్యారోగ్యవంతుని ఉష్ణధర్మము 98.4°F రక్తముయొక్క ఉష్ణధర్మము 102° F డిగ్రీలుండును. దేహములోని వేరువేరు అవయవముల లోని ఉష్ణధర్మము వేరువేరు రకములుగా నుండును. 102°F కన్న తక్కువమాత్రము ఉండదు.

సిరా రక్తముయొక్క ఉష్ణధర్మముకన్న ధమని రక్తపు ఉష్ణధర్మము 2°F హెచ్చుగానుండును.

జలచికిత్సనుగూర్చి శాస్త్రీయమైన పరిశోధనలు జరపిన వారిలో క్యూరే మొదటివాడు. 1797 సంవత్సరములో క్యూరే యేమన్నాడంటే - దేహమునకు చేసిన చన్నీటి ప్రయోగమువలన, దేహముయొక్క ఉష్ణధర్మమేగాక, రక్తముయొక్క ఉష్ణత్వమూ తగ్గును. జ్వరము వచ్చినప్పుడు చేసిన చన్నీటిప్రయోగమువలన ఉష్ణము చాలా త్వరగా తగ్గిపోవును. చన్నీటిస్నానమువలన కలిగిన ప్రతిక్రియాఫలితము తరువాతగూడా, రెండుమూడు నిమిషములదాక రక్తము చల్లబడియేయుండును. చన్నీటిప్రయోగము జరిగినతరువాత దేహమును వేడిగాను, సుఖముగాను మర్దన చేసిన యెడల దేహము యొక్క ఉష్ణధర్మము చాలా త్వరగా తగ్గును.

దేహము మొత్తమునకు చన్నీటి ప్రయోగమును లేని దుర్బలులు చన్నీటిని లోనికి త్రాగవచ్చును. అటులైనను ఉష్ణధర్మము తగ్గును.

దేహమునకు చేసిన చన్నీటి ప్రయోగమువలన కలిగిన క్రియాఫలితమును ప్రతిక్రియా ఫలితమును గూర్చి దరహాముగా (General) తెలిసికొందాము.

దేహమునకు చేయు చన్నీటి, వేడినీటి, ప్రయోగముల వలన కలిగిన ఫలితములగూర్చి వైద్యశాస్త్ర పితామహుడగు హిపొక్రిటీసు ఏమన్నాడంటే - దేహమునకు చన్నీటిప్రయోగమును చేసినయెడల ప్రతిక్రియా ఫలితముగా వేడికలుగును. వేడినీటిప్రయోగమును చేసినయెడల ప్రతిక్రియాఫలితంబుగా చలువకలుగును. దేహమునకు ప్రతిప్రక్రియవలననూ రెండు ఫలితములు కలుగును. ఒకటి క్రియాఫలితము రెండవది ప్రతిక్రియా ఫలితము. క్రియాఫలితమునకు ప్రతిక్రియాఫలితము వ్యతిరేకముగా నుండును. క్రియాఫలితముగా చలువకలిగిన ప్రతిక్రియాఫలితముగా వేడి కలుగును. క్రియాఫలితముగా వేడికలిగిన ప్రతిక్రియాఫలితముగా చలువ కలుగును.

అలోపతివైద్యము క్రియాఫలితమునే ప్రధానముగా తీసికొంటుంది. రోగము వచ్చిందీ అంటే దానిని అణచిపెట్టుటకే మందులను వాడుతారు. వారి నిఘంటువులన్నీ యీ అణచిపెట్టుమందులతోనే నిండియున్నవి. ప్రకృతి వైద్యమన్ననో ప్రతిక్రియాఫలితమునే ప్రధానముగా తీసుకొంటుంది. చన్నీటికటిస్నానము వలన, క్రియాఫలితముగా వేడికలుగుతుంది. ప్రతిక్రియాఫలితముగా చలువ కలుగుతుంది. చన్నీటిప్రయోగమువలన ప్రతిక్రియాఫలితముగా వేడి కలిగితే, వేడినీటి ప్రయోగమువలన క్రియాఫలితముగా వేడి కలిగి ప్రతిక్రియాఫలితముగా చలువ కలుగుతుంది.

ఈ క్రియాఫలితముకన్న ప్రతిక్రియాఫలితమేయెక్కువ కాలము నిలుచును.

దేహమునకు చన్నీటిప్రయోగమును చేసినయెడలక్రియాఫలితముగా వేడికలుగునా, చలువకలుగునా అనువిషయమై గతశతాబ్దములోని మొదటి యేబది సంవత్సరముల వరకును వాదోపవాదములు చెలరేగినవి. పర్యవసానముగా నేమని నిశ్చయపరచినారంటే దేహమునకు చన్నీటి ప్రయోగమును చేసినయెడల క్రియాఫలితముగా దేహములో వేడికలుగును. ప్రతిక్రియాఫలితముగా చలువకలుగును.

## చన్నీటి ప్రయోగము చేసినయెడల దేహములో కలుగు

### క్రియా ఫలితములు

1. చర్మములోని సన్నని రక్తకుటికలు ముణుచుకొని పోవును. వాటి అడుగున ఉన్న సన్నని కుటికలు ముందుగా ముణుచుకొని తరువాత విరివిపొందును.
2. చర్మము తెల్లపడును.
3. చర్మము బిరుసెక్కును.
4. చలిగా నుండును.
5. పళ్లు జివ్వుమనును. దుర్బలులగు రోగులకు పళ్ళు బిగుసుకొనుటయు కల్గును,
6. నాడి వడిగా కొట్టుకొనును. తరువాత ఆ వడి తగ్గును.
7. శ్వాసపీల్చునపుడు గట్టిగాను కష్టముగాను ఉండును.
8. చర్మము చల్లగా నుండును.
9. చాలామందికి దేహముయొక్క ఉష్ణధర్మము పెరుగును.
10. చెమట తగ్గును.

### ప్రతిక్రియా ఫలితములు.

1. చర్మతలమున ఉన్న సన్నని రక్తకణములు విరివి పొందును. ఈసన్నని రక్తకణముల అడుగున ఉన్న రక్తకణములు సంకోచము పొందును.
2. చర్మము ఎర్రపడును.
3. చర్మము మెత్తపడును. నున్నితమగును.
4. వెచ్చగా నుండును.
5. సుఖముగాను, హాయిగాను నుండును.
6. నాడి మెల్లగా కొట్టుకొనును.
7. ఉచ్ఛ్వాస నిశ్వాసలు సుఖముగా నుండును.
8. చర్మము వెచ్చగా నుండును.
9. ఉష్ణధర్మము తగ్గును.
10. చెమట యెక్కువగా పోయును.

క్రమప్రకారముగా చన్నీటికటిస్నానము చేసినయెడల దేహమునకు ప్రతిక్రియాఫలితము తప్పక కలుగును. ఈ చన్నీటిప్రయోగమునే దేహము భరింపకలిగిన కాలముకన్న నెక్కువకాలము చేసినయెడల ప్రతిక్రియాఫలితము కలుగదు. అపకారము కలుగును. రోగియొక్క ధాతుశక్తిని బట్టి స్నానముల సంఖ్యను, కాలమును, నిర్ణయించవలెను.

ప్రతిక్రియాఫలితములు సంతృప్తికరముగా నుండవలెనంటే యీ క్రింది మూడురకములగు నియమములను మనస్సులో నుంచుకొని స్నానకాలమును, సంఖ్యను నిర్ణయించవలెను. (1) స్నానము చేయుటకు పూర్వము అవలంబింపవలసిన పద్ధతులు, (2) స్నానకాలమున పాటించవలసిన నియమములు, (3) స్నానము తరువాత ఆచరింపవలసిన పద్ధతులు.

ముసలివారిలోను, పసిపిల్లలలోను, నాడీవ్యాధులతో బాధపడువారిలోను, స్థబ్ధులుగా నుండి పాండురోగముతో బాధపడువారిలోను, మూత్రికామ్లము ఎక్కువగా తయారగుటవలన కలిగిన సంధివాతపురోగ ప్రవణతలవల్ల బాధపడువారిలోను, చెమట బాగాపోయని వారిలోను, చెమట యెక్కువగా వచ్చుటచే నీరసముతో బాధపడువారిలోను, నాడీవ్యాధులతో బాధపడువారిలోను, ప్రతిక్రియాఫలితము ఆలస్యముగా కలుగును. మరీ నీరసపడినవారిలో ప్రతిక్రియాఫలితము కలుగకపోవుటయు కలదు.

కాబట్టి పర్యవసానముగా చెప్పవచ్చిన దేమంటే, మన ప్రకృతివైద్యములోను అయిదు ఆరు రకములగు చికిత్సావిధానములు గలవు. ప్రతిఒక చికిత్సావిధానములోను అనేకప్రక్రియలు గలవు. ఇన్ని విధానములును ప్రక్రియలును అమలులోనుండగా ఒక చికిత్సావిధానములోని ప్రక్రియలతోనే రోగమును నయముచేయజాలుట కష్టసాధ్యము. ఏవిధానము రోగికి ఉపయోగపడునో, అందుబాటులో నుండునో, చూచుకొని ఆ విధానమును ఉపయోగించుకొనవలెను. మిగిలిన విధానములును యథాక్రమముగా ఉపయోగించుకొనవలెను.

తృప్తికరముగా వైద్యముచేయగోరువారు ఈ అయిదు ఆరు రకముల విధానములలోని ప్రతిఒకవిధానములోని గ్రంథరాజములను శ్రద్ధగా చదివి, శాస్త్రమును అవగాహనము చేసికొని, ప్రసిద్ధవైద్యులవద్ద ఉండి, అనుభవమును సంపాదించి, రోగముల కుదిర్చి మానవకోటికి సేవచేయుదురుగాక. అప్పుడే ప్రకృతివైద్యము కూడా ఆయుర్వేదము, అలోపతీ, యునానీ, మొదలగు వైద్యములకన్న బాగా అమలులోనికి వస్తుంది.

మా వైద్యసోదరులకు ఒకసలహా యిస్తూ యీ వ్యాసము ముగిస్తాను. అన్నివైద్యములలో మాదిరిగనే మన వైద్యములోను, అందును ముఖ్యముగా వైద్యముమీదను వైద్యునిమీదను నమ్మకములేనిది రోగము కుదరదు. మీమీద నమ్మకములేని రోగులరోగములను, నయము చేద్దామని ప్రయత్నించి వ్యర్థులు కాబోకండి. శాస్త్రమర్యాదను మంటకలపకండి. ఎంత అయినవాడైనప్పటికీ మీమీదను శాస్త్రముమీదను పూర్తినమ్మకము లేనిదీ రోగమును నయముచేయజాలి అపహాస్యమును పొందకండి.

మీకు తెలియని విషయమైతే తెలియదనిన్నీ, తెలిసినవారిని కనుగొని తెలియచెప్పుదు ననండి గాని, ఉన్నదీ, లేనిదీ చెప్పి మోసము చేయకండి.

"కిం దేహవతామ్ భాగ్యమ్, ఆరోగ్యమ్" అను ఆర్యోక్తినిబట్టి అన్నింటిలోనికి ప్రధానమైనది మానవదేహము ఇంత విలువకల మానవదేహముమీద మీ యిష్టము వచ్చినట్లు ప్రయోగముల చేయకండి.

# ప్రకృతి దేవతాస్తుతి

విశ్వనాథ వేంకటేశ్వరకవి, బెజవాడ.

విశ్వపూరిత పురీవితతులెల్లను జొచ్చి, సాక్షిచేతనత సాక్షాత్కరించి
ఖాద్యష్టమూర్తి విఖ్యాతయై పరశివా, వైరాజ్య భావసంపద నెసంగి
షట్చక్రమండల స్వామినియై మహా, యోగసామ్రాజ్య చిద్భోగిని యయి
కుండలినీకుల కూటస్థయై కాది, గుప్త విద్యాతత్త్వ గోప యగుచు
నోషధులు నోషధీశయై యుజ్జ్వలించి, పద్మములు పద్మమిత్రయై పరిఢవిల్లి
శక్తియును శక్తిమతియునై జగములేలు, ప్రకృతి దేవత మమ్ముఁ గాపాడుగాక!

జిహ్వోపస్థలకున్ వశంగతులునై జీవుల్ సుఖభ్రాంతిచే
బహ్వన్నంబులు నిత్యమైథునములై వ్యాధ్యాధి సంక్లిష్టులై
ప్రహ్వీభూతగతాయుషుల్ చెడక యే భద్రాత్మ శ్రీమత్తప
స్స్వాహ్వం దాల్చి రమించుఁ దత్ప్రకృతిదైవత్యం బుపాసించెదన్.

యమనియమాది యోగినియు, నాంతర బాహిరదోషశాంతిచే
శమనియు, సుందరప్రియ నిసర్గపదార్థ నిషేవణంబునన్
రమణియుఁ, గర్మపాశ విధురత్వ విధూనన వృత్తిఁ బౌరుష
ప్రమ నిడు తల్లియుం, బ్రకృతి పంకజహస్త నుపాస్తి చేసెదన్.

కంటన్ మింటను నేకతానరుచిమత్కైవల్యమూర్తిన్ కళా
ఘంటామార్గము లెల్ల గుత్తగొని, వ్యక్తావ్యక్త సుజ్యోతియై
మంటిన్ జీవకళోపబృంహితముగా మన్నించు సూర్యుం డస
ల్లుంటాకన్ దమి నెవ్వతం గొలిచి, తల్లోలాక్షి సేవించెదన్.

మృత్స్నామూర్తియు జ్యోతిరాత్మయగుచున్ సృష్టాఖిలాకారయై
కృత్స్నత్రైగుణదూరయున్ ద్విగుణతాక్లిష్టాత్మయుం గాగఁ జి
జ్జ్యోత్స్నారూపత దివ్యయోగ సుతపశ్శ్రీభాక్ప్రియాబోధజా
గ్రత్స్నిగ్ధాకృతిఁ బొల్చు మాతృప్రకృతిన్ జేమోడ్పుతో మ్రొక్కెదన్.

"సర్వం కర్మవశంహి, పౌరుష విధా స్యాన్నాస్తి" యంచుం గ్రియా
ఖర్వత్వంబున నాత్మధీబలతితిక్షాదక్షతా శూన్యులై
యుర్విస్థుల్ వెడఁగొందగా నహామితి ప్రోద్యోగవత్ప్రత్యయాం
తర్వాణుల్గఁ బొనర్చు తల్లిఁ గొలు తద్వ్యోపదేశాత్మకన్.

పాలేటి తరఁగలపై జిడ్డుదేరిన, మొదటి మీఁగడ క్రొత్త మోసులెత్తి
తొలినాగరాజు జిహ్వలు దేఱు నమృత భాండములోని చిద్రుకలు చెమరు పొంది,
ప్రాక్తనఋషిపుంగవ ప్రభుచిత్త సత్కరుణార్ద్ర చంద్రికల్ కందళించి
ప్రాచ్య పాశ్చాత్య విద్వన్మధువ్రతపాళి, నీలితెక్కల నిగనిగలు నిండి,
జీవగతవాసనాదోషభావ ముడిపి, త్రికరణంబులు లోవెలి మకిలిఁ ద్రోచి
పులుగడుగు ముత్తెములయట్లు పొలుపుదిద్ద, వెలలెఁ బ్రకృతిమాతృక, మోదవిధునిభాత్మ.

ఇంద్రియ పంచకంబు నదలించి యరిప్రకరంబు నొంచియున్
సాంద్రకృపాతిరేకమునఁ జక్రివిశుద్ధిని జేసి, రాగని
స్తంద్రములం బొనర్చి ఘనధాతుసమూహము, జీవశోకమున్
రుంద్రవినూత్నశోభలను బ్రోచెడు తల్లిని జూడరే జనుల్.

కృత్రిమౌషధ సేవనాక్లిశ్యమాన, తనువు లాప్యాయయుతములై తనరుఁగాక
సకలజీవాంతరంగ చిత్ప్రకృతిదేవి, శాంతమధుపూర్ణహస్త సంస్పర్శవలన.

## ప్రాంజలి

టి. అనసూయ, రేటూరు

నెలనెల కేగుదెంచి కడు నిర్మలభావ పరంపరావళిన్
సలలితమంజుభాషణల సత్యముపీడక వాడవాడలన్
బలుకుచు ప్రాజ్ఞభావముల భాసిలజేసెడు పత్రికామణీ!
వెలయుమ యెల్లకాలములు విశ్వవిలాసుని ప్రేమ పెంపునన్.

ఎన్నియొ శాఖలై వెలసె నీజగతీస్థలి వైద్యవిద్య, వా
నన్నిటియందదేలనొ రహస్యము చొప్పడియుండుఁగాని నీ
ప్రన్నుడులందు సత్యము సురంజితమౌ నుపమానరాశితో
నున్నతమార్గనేతవయి యొప్పెడు నీసరి నీవ చెల్లెడిన్

వక్రవర్తనచే వచ్చు వ్యాధులెల్ల, పంచభూతాత్మకమ్మైన ప్రకృతిచేత
సుఖకరంబుగ రహితమౌ సునిశితంపు, విధములన్ దెల్పు సద్వైద్యవిబుధ వీవు.

నీ పరిశుద్ధితత్వమును నిందు కృపాకలితాంతరంగవై
వ్యాపనజేయుచుంటి వెటువంటి యవాంతరవేళలందునన్

శ్రీ పరమేశు డెల్లపుడు క్షేమముగా నినుఁ గాచుచుండెనో
పాపవినాశనార్థమయి పావనజీవని! స్వార్థత్యాగినీ!

పరమపవిత్రమై ప్రభవించు ప్రకృతిసు, పథము లభ్యమౌట నధికతరము
సహజసజీవంపు సాత్వికాహారంబు, సమకూర్చు సత్కళా సౌఖ్యములను
వ్యాయామ నియమాది కాయశ్రమంబుల, సబలసౌష్ఠవశక్తి ప్రబలగల్గు
శాంతదయాదాంతి సంతృప్తి ప్రాపింప, మాలిన్యరహితమా మానసంబు
అమలతరమైన యివ్విధు లందజేసి, నరకయాతనలోనుండి దరికిఁజేర్చ
కరుణ కంకణమును దాల్చి వరలుచున్న, ప్రకృతిమాతకు "ప్రకృతికి" ప్రణతిశతము.

# ప్రకృతి వైద్య ప్రశంస

ఉభయ భాషాప్రవీణ : పింజల సుబ్రహ్మణ్యకవి

సీ. ఆపాదమస్తకం బణగియున్నట్టి రో, గపదార్థము వెలార్పఁ గలుగునేది?
సకల సంకటము లాశ్చర్యంబుగాఁ బాపి, స్వాస్థ్యసంపత్తి నొసంగునేది?
వయసుఁజెల్లినయట్టివారికిఁ నూత్న యౌ, వన బలోత్సాహముల్ పెనుచునేది?
అపుడ చావఁగ సిద్ధమగువారికేని దీర్ఘాయుః ప్రదాత్రియై యలరునేది?
గీ. నియమనిగ్రహములఁగూర్చి భయముఁదీర్చి, ప్రవిమలాధ్యాత్మికానందపదముఁ జేర్చి
మానవుల నుద్ధరింప సమర్థమేది? అట్టి ప్రకృతివైద్యంబు శ్లాఘ్యంబుగాదె?

సీ. ఎపుడు మందులు మాత్రలెల్ల మ్రింగుడటంచు, నించుకయేని శాసింపఁబోదు
రసవిషగంధక ద్రవములం దనువున, నింపుఁడంచు బలాత్కరింపఁబోదు
పగలు రాత్రులు మూలఁ బడియుండు టవసరం, బిది తప్పదనుచు గర్జింపఁబోదు
ఎండ, గాలి, జలము, లెవియు దేహమున సో, కింపరాదనుచు భాషింపఁబోదు
గీ. అమితమగు విత్తమెల్ల వ్యయంబొనర్చి, ఆస్తి పాస్తులఁ గోల్పోయి యువలఁగూటి
పేదలై యేడ్వుడంచు శపింపఁబోదు, ప్రకృతి వైద్యంబు సకల సౌభాగ్యదంబు.

సీ. అమృతోపమానంబు లగు ఫలాదులనెల్ల, నారగించి సుఖింపు డని వచించు
భూతపంచకసముద్భూతలాభంబుల, విరివిగాఁ గొనుఁడంచు వరములిచ్చు
క్రమముగా నుపవాకారమ్ములం బులుసును, దరిఁజేరనీయక తరిమివేయు
అనువుఁ దప్పుచు క్షణక్షణము బల్ పోకలం, బోవు నా జిహ్వకు బుద్ధిసెప్పు
గీ. అన్నివైద్యముల్ చచ్చుదద్దమ్మలగుట, నవల "దింపుడు గళ్లపు" టానతోడ
నన్నుఁ జేరితి రా! యంచు నవ్వఁబోక, ప్రకృతివైద్యంబె యారోగ్యభాగ్య మొసఁగు.

సీ. వికృతరూపములెల్ల వీడి సమగ్ర సౌం, దర్యంబుఁ బొందంగఁ దలతురేని?
ముక్కుమూలుగులు నిర్మూలమై యుత్సాహ, మెంతేని గలుగ నాశింతురేని?
కాల్గదల్పఁగలేని గతిదాటి ఘనబల, స్థితివహింపంగ వాంఛింతురేని?
గొడ్డుఁబోతుఁదనంబు నడ్డి సంతాన సు,శ్రీ వడయంగ గాంక్షింతురేని?
గీ. దేబె మొగములఁ బాసి యుత్తేజ మెనసి, స్వార్థపరతనడంచి బల్ త్యాగమూని
దేశసేవ నొనర్ప నర్థింతురేని, ప్రకృతివైద్యంబు శరణంబు ప్రజలకెల్ల.

సీ. కూనే ప్రముఖులు సద్గురువులై గ్రంథాల, దిద్ది తీరిచి ప్రబోధించుచుండ
ప్రకృతితత్త్వంబెల్లఁ బరిశోధన మొనర్చి, వ్యాసంబు లెందఱో వ్రాయుచుండ
ఇతరవైద్యులదాడి నెదిరించి ధీరాగ్ర,గణ్యుల్ చికిత్సల జరుపుచుండ
సకలవైద్య రహస్యసారజ్ఞులిదె మహా, శ్రేయస్కరంబంచుఁ జెప్పుచుండ
గీ. ప్రకృతిపత్రికాధిపతులు సంపాదకులును, శ్రమలకుసహించిపలుమారుచాటుచుండ
ప్రకృతివైద్యమహత్త్వతత్త్వంబు నెఱిఁగి, ఫలముఁగనకుంటజనులదౌర్భాగ్యమకట.

సీ. కల్లు సారా బ్రాంది గంజాయి మద్దత్తు, నల్లమందులకు వినాశకారి
కాఫీ ఓవల్టైను గరముచా కోకోల, యార్భాటములకు మహావిరోధి
చుట్ట బీడీ సిగరెట్టు కిల్లీ నశ్య,ముల మట్టుబెట్టెడు పోటుబంటు
జింజరు లిమ్నొ ఆరంజి సోడా మొద,లగు పానములకు సంహార హేతు
గీ. వడ్లు కుడుములు లడ్లు బొబ్బట్లు గారె,లలు పకోడీలు మొదలుగా నన్నివిష ప
దార్థ కలితంబులైన భక్ష్యాలకెల్ల, ప్రకృతివైద్యంబె సుండు ఫిరంగి గుండు.
సీ. తెల్లచక్కెరయన్నఁ దేరి చూతురుగాని, దానిలోని విషంబుఁ దలఁపలేరు
పరబియ్యమనిన మై మఱచిపోదురుగాని, వాని చెట్టతనంబుఁ గానలేరు
పొట్టుఁగోల్పడిన పప్పుల భుజింతురుగాని, యవి చేయు నపకార మరయలేరు
అలమసాలాద్రవ్యముల కుబ్బుదురుగాని, పరమశత్రువు లంచు నెఱుఁగలేరు
గీ. కరము నూనెలో నేతిలోఁ గాల్చి ప్రేల్చి,నట్టి కూరలఁ దిని భళీ యందురుగాని
తమకుఁగల ప్రాణశక్తి యంతయు నశించు, స్థితిని గాంచరు ప్రకృతిసద్గతిరహితులు.

సీ. నిరుపమవ్యాయామకరణధుర్యులకెల్ల, సమ్మదం బొసఁగుచుట్టమ్ము ప్రకృతి
అసమానయోగాసనాసక్త చిత్తులఁ, దనియించునట్టి మిత్రమ్ము ప్రకృతి
అప్రతీకాశ ప్రాణాయామ నిపుణుల, సాకి రక్షించెడు జనని ప్రకృతి
అశ్రాంతభవ్య పరిశ్రమ ప్రవణులఁ, దనకుఁదానై ప్రోచు తండ్రి ప్రకృతి

గీ. పరమ పావనాత్ములకు సద్గురువు ప్రకృతి, వరపరోపకారులకు దైవంబు ప్రకృతి
రాగరహితభావులకు సర్వంబు ప్రకృతి,నికృతి యణుమాత్రమునులేనిసుకృతిప్రకృతి.

సీ. సర్వసర్వంసహాచక్రశాసకుఁ డౌచు, వర్తించు నాచక్రవర్తియేని
వేదవేదాంగాది విద్యాధురీణుఁడై, నుతిఁగన్న గొప్ప పండితుఁడె గాని
సకలలోక రహస్య సారసంవేదియై, జగతిఁ బేర్వడిన విజ్ఞానియేని
బహువిధవ్యాపార పారీణతఁ మహా,ధనముఁ గూర్చినయట్టి ఘనుఁడెకాని
గీ. లేశమేనియు సౌఖ్యంబు లేక యున్నఁ, బ్రబలరోగాలచే బాధపడుచు నున్న
నతనిజీవితమే వ్యర్థమగును గానఁ, బ్రాకృతచికిత్సలఁ మేలు పడయఁ దగదె.

# ప్ర కృ తి ప త్రి కా ప్ర శం స

**(స్వామి సీతయ్యల స్వానుభవము, సోంపేట)**

గీ. ప్రకృతి పరమతత్త్వంబును బ్రస్తుతింప, వశమె యెవ్వారికైన నీ వసుధలోన
అనుభవైకవేద్యం బహో! యమృతమయము, సత్యజయభేరి వినుడోయి సరసులార!

సీ. పంచభూతములెగా ప్రపంచమునకెల్ల, శక్తి సంజీవియు శాంతిసుఖము
అరసిన జాణలే యానందజలధిలో నోలలాడుచు ముక్తి నొందగలరు
మాయమోహాగ్నిలో మ్రగ్గి చచ్చుటదేల, మంచికాలం బిదే మరలి రండు
కోతలు పోటులు కుళ్ళించుమందులు, దేహయాత్రికె రోత తెలియరయ్య
గీ. జాతి క్షీణించె, జగతిని జనము వీడె, బానిసపు ప్రబోధంబులు ప్రబలజొచ్చె
అవని సత్యుగ్రమృత్యుతాండవము చెలఁగె, నాగరికమట యిదియట నవ్వుగాదె?

క. కూనే ప్యాబిటు లష్టులు, జ్ఞానాం బనుమయ్య ముఖ్యజ్ఞానులు యోగుల్
ఏనా డందిచ్చిరొ? మన, కానాడె విముక్తి సుదిన మవనికి హెచ్చెన్.

క. వెంకటామవధూతలు, సంకటహారి రాఘవేంద్ర సన్మూర్తులతో
పొంకముగా వర్ధిల్లుత, జంకేలిక ప్రకృతిమాత జయ మవుగాతన్.

గీ. అనుభవముచేత రోగము లణచినాము, అద్భుతంబగు మహిమచే నలరినాము
తల్లి ప్రకృతి దీవనలచే దనరినాము, దినదినాభివృద్ధిని జెంది తేరినాము,

# ప్రకృతివైద్య ప్రశంస

చెన్నుభొట్ల భానుమూర్తి బి. ఎ. ఎల్. టి.

ప్రకృతి పత్రిక వెలువడినది మొదలు నేను చందాదారు నున్నాను. శ్రీ నారిశెట్టి హనుమయ్య నాయుడు గారు మొదటి సంచికను అప్పటి రోజులలో ఆయనకు తెలిసిన ప్రకృతి అభిమానులందరికిని పంపియున్నారు. వారిలో నే నొకడనని చెప్పుటకు ఎంతయు గర్వపడుచున్నాను.

మొదటినుండియు స్వాభావికచికిత్సయందు నాకు అభిమానము. 1910 సంవత్సరములో బాపట్లలో గంధం కృష్ణారావుగారి పరిచయ భాగ్యమున నాకీ తొట్టివైద్యమునుగూర్చి తెలుసుకొను అవకాశము కలిగినది. ఆ రోజులలో కూనే పుస్తకములో నున్నట్లుగా నేను రెండు ఏండ్లు ఈ జలచికిత్స చేసితిని. చిన్ననాటనుండి నన్ను బాధపెట్టుచున్న మలబద్ధమునుంచి విమోచనము పొందితిని. అంత చిన్నవయస్సులోనే నెరసిన నా తలవెంట్రుకలు నల్లబడినవి. 1912 లో నా సోదరునికికూడ ఈ వైద్యమే చేసితిని. అంతకు పూర్వము ఏ వైద్యము పనిచేయక పోవుటచే నిరాశజెందిన నా సోదరుని ఈ ప్రకృతి చికిత్స బ్రతికించుటయే గాక నన్ను అంతటినుంచి ప్రకృతిమాతకు సేవకునిగా చేసినది. మా తమ్మునికికూడ చిన్నతనమునందే నడినెత్తిమీది వెంట్రుకలు నెరసినవి. ఆరునెలలు జలచికిత్స చేయగానే తెల్లవెంట్రుకలు నల్లబడుటయేగాక ఒకవిధమైన తళుకుకూడ కనబడినది. జలచికిత్సయు సాత్వికాహారమును ఇట్టి మార్పు చేయగలుగునని నే నెన్నడును అనుకొనలేదు. ఈ విషయము వార్తాపత్రికలకు వ్రాయగా ఇట్టి మార్పు నిజముగా జరిగినయెడల ఎట్లు జరిగెనో వ్రాయుమని అడిగినారు. జలచికిత్స సాత్వికాహారమే ఇటి మార్పు చేసెనని వ్రాయగా నమ్మువారెవరు? సుఖముగా పడకకుర్చీమీద పండుకొని ఏవో రెండుమాత్రలు మ్రింగిన రోగములు కుదురునని నమ్మువారు ఈ జలచికిత్స నియమములు ఎట్లు పాటింపగలరు? తెల్లవెండ్రుకలు నల్లబడునట్లు చేయు చికిత్స వేరొండు లేదని నేను ఘంటాపథముగా చెప్పగలను.

ప్రకృతియన, ఒక్క జలచికిత్సయే కాదు. సూర్యకిరణచికిత్స, మృత్తికాచికిత్స, ఉపవాసచికిత్స, యోగచికిత్స, మానసికచికిత్స. ఇంకను ఎన్నియో, ఈ ప్రకృతిచికిత్సలలో ఇమిడి యున్నవి.

ఈ రోజులలో రోగము లెక్కువగుచున్నవి. మందు వైద్యులెక్కువగుచున్నారు. కాని ఆయుర్దాయము తక్కువగుచున్నది. సూర్యకిరణచికిత్సనుగూర్చి వ్రాసిన డాక్టరు బ్యాబిట్ మందువైద్యశిఖామణి, శస్త్రచికిత్స ఎంత అనవసరమో స్పష్టముగా వ్రాసినాడు. 'ఎప్పెండిసైటిస్' (appendicitis) జబ్బులో, మూడువందలలో రెండుమాత్రమే చికిత్స కోరునవనియు, ఆ చికిత్సకుకూడ శస్త్రము చేయనక్కరలేదనియు, సూర్యకిరణచికిత్సవల్లనే కుదర్చ వచ్చుననియు, బాగుగ వ్రాసినాడు. Kellog అను ఒక అమెరికను డాక్టరు, శాస్త్రసమ్మతమైన జలచికిత్స యను పేరుతో ఉద్గ్రంథమొకటివ్రాసి మందు వైద్యుడయ్యును ప్రకృతిచికిత్సయందు తన యభిమానమును బుజువుచేసెను.

ఈ ప్రకృతి చికిత్స అమెరికాదేశములో ఎక్కువగా వాడుకలోనున్నది. బీద దేశమైన మన హిందూదేశములో దీని కెక్కుడు వ్యాప్తి అవసరము. ఇక్కడ శీతోష్ణస్థితులుకూడ ఈ వైద్యమునకు చాలా అనుకూలమైనవని వేరుగా చెప్ప నక్కరలేదు. ధనవంతులు దీనికి చేయూత నొసంగి ప్రకృతిచికిత్స అభివృద్ధికి తోడ్పడి దేశము నుద్ధరించెదరు గాక అనియు మా ప్రకృతి పత్రిక ఈ ఇరువది ఏండ్లుచేసిన సేవకంటె ఇకముందు ఎక్కువ సేవచేయ గలుగునని ఆశించుచున్నాను.



# రజతసంచికకుఁ గానుక

పైఁడిమఱ్ఱి వేంకట సుబ్బారావుగారు

సీ. జగమెల్ల నున్నవాస్తవ మెఱుంగుటకునై, పెడత్రోవలను కాలు పెట్టిపోవ
నిజమైన యారోగ్యనిర్వచనంబైన, దెలియక వెఱ్ఱిచూపులను జూడ
ఒక రోగమును బాప నంకించి యంతకు, పెద్దరోగము తెచ్చిపెట్టుకొనఁగ
నీరోగులై యుండగోరుట లేయంద, రానిపండై యాకసాన నుండ
తే. ప్రకృతియే తనలోని దివ్యప్రకాశ,మును తళుకుకన మెఱపించి పుణ్యులైన
కూనె, జస్టు, మహాశయ శోధనలను, జూపినందుకు నర్పింతు జోత లెన్నొ?

సీ. రసగంధకములకు అత్యంత తగ్గని, వ్యాధుల నీటితోఁ బాఱఁద్రోలి
మార్ఫియా, కోకయిన్ మందు లుడుపని రోగ,ముల నుపవాసాన పుటముపెట్టి
కోఁతలు కాల్పులకును లొంగకున్నట్టి, బాధల ఫలభుక్తి నదలఁజేసి
స్థలమహాత్మ్యము విని చనినఁ దక్కవగాని, దోషాల మృత్తికతో హరించి
తే. ఉన్నతప్పులు దిద్ది యాయువు బలంబు
వృద్ధిచేసెడు తెన్నుల వెలుగుపఱచి
పాంథులకుఁ ద్రోవఁజూపించు వారి విధులఁ
'ప్రకృతి' పత్రిక యొకటె యాంధ్రమునఁ దెలుపు.

సీ. నైతికాభ్యుదయకంటకమైన బూతుల, కథలు వ్రాసెడు పత్రికలును గలవు
పరదేశముల మహత్తరశోధ లుగ్గడించెడు పత్రికల లెక్కసేయలేము
రాజకీయముల సంగ్రామ విశేషముల్, వివరించు పత్రికల్ వేనవేలు
దేశదారిద్ర్యంబుఁ దెలుపు వార్తాపత్రి,కలును నెన్నెన్నియో గలవు మిగుల
తే. ఆయురారోగ్యముల పేర నౌషధములఁ
బ్రకటనల మొనర్చునవె యన్నిపత్రికలును
నిజమయిన రోగహర మగు నియమములను
దెలుపునది యొక్క ప్రకృతియే తెలుఁగునందు.

సీ. మొదట నాయుర్వేదమున మహర్షులచేతఁ, గొనియాడఁబడియె మేలనుచు నేదియు
దేశదేశముల శోధించి గన్గొనఁబడి, వేనోళ్లఁ గీర్తింపవెలసె నేదియు
విషమునూదుల గుచ్చు వెజ్జులెద్దాని ప్ర,శస్తిని తలలొగ్గి చాటుచుండ్రు
ధనికులు, బీద లెద్దాని యాశ్రయమున, నారోగ్యభాగ్యమ్ము నందఁగలరు

తే. అట్టి ప్రకృతి చికిత్స నత్యంత ప్రీతి, దినదినంబొక ఛాయ వృద్ధి పఱచుచును
నిఱువదై దేండ్ల యీడుదై నేటికిపుడు, రజతసంచికగా మన "ప్రకృతి" దనరె.

చ. ప్రకృతిమతల్లి! చింతపడవద్దిటు కాలము నొక్కరీతిగా
వికృతిని బొందియుండ దిఁక వేఁసరికంబులు కాపురంబు లే
మొకొ? రజతంబు కాన్కలిడుచుంటిమి యిప్పుడు, ముందు ముందు ప్రా
యికముగ స్వర్ణరత్నచయమే యగు పెట్టెడు సొమ్ము లమ్మరో!

## ప్రమాదకరమైన ఉబ్బసము పటాపంచలైనది

**అష్టావధాని : మేడబలిమి సూరయ్యచౌదరి**

తే. మేటి యుబ్బసమందు రా మాటనిజము, చంపదొరకొన నరనిమునంబునేని
శ్వాసనాడఁగ నీయ దే సరణినైన, సుఖమునకుఁ దావొసంగ దీ చోద్యమేమొ.

ఉ. ఆ రుజ నన్వరించినది యందునఁ గొందలమంది పెక్ వ్యథల్
గూరి కృశింపుచున్ గుమిలి కూగుకు కంటికిరాక దైవ మీ
తీరునఁ జేసెనంచు వెతఁ దీర్చెడు వారెవరంచు వైద్యులన్
జేరఁగఁబోవ వారలు వచించిన తీరును విన్నవించెదన్.

సీ. వలదు చికిత్స యేావంత విశ్రాంతిని, గొనుఁడని పల్కెడు ఘనుఁడొకండు
శొంఠి, కరక్కాయ, చూర్ణంబుగాఁ జేసి, సేవింపుమనియెడు శిష్టుఁడొకఁడు
నల్లయుమ్మెత్తకాయ లెల్లఁ జూర్ణము సేసి, పొగపీల్చుమనియెడు ప్రాజ్ఞుఁడొకఁడు
"టానిక్కు"లనుగొని పూనిక సేవింప, నడలు జాడ్యం బను సదయుఁ డొకఁడు

తే. నాడితెలియని వైద్యులు నా కనేకు, బోధలను జేసినారు నా బుద్ధికెక్క
దందు నొకఁడేని మరియొక్కఁడనియె లేదు, 'ఔషధం బుబ్బనంబున' కనుచుఁ జేర్మి.

ఆ. ఆంగ్లవైద్యమనిన నరయ నాయుర్వేద, మనిన రోతగలిగె నాత్మకకట
రుజను బాపఁజాలు నిజమైన వైద్యుఁ డె, వ్వాఁడొ యనుచు మదిని వంతగదుర.

చ. పదుగురిలోఁ జరింపఁగల ప్రజ్ఞయు వాక్పటిమంబుగల్గి నం
పదలఁ జెలంగి సర్వసుఖభాజనమై తగు జీవనంబుచేఁ
బొదలెడు నాకు నీవ్యథలు పోవుటయెట్టులు? దీనిఁదీర్చు నా
సదయుఁ డెవండొ? యంచును విచారము సేయుచునుండ నొక్కటన్,

తే. అంతఁ బొడకట్టె నామది కద్వితీయ, మానసికశక్తిసహితుండు మహితయశుఁడు
ప్రేమతత్త్వస్వరూపుండు ప్రియతముండు, రాఘవేంద్ర మహాయోగిరా జొకండు.

సీ. మునులకావాసమై యొనయుట సర్వదా, వినుతికెక్కెఁ బాత్రిమా మునులకోట
కృష్ణాతరంగిణి కెలన ముక్త్యేశ్వరుం, డలఘుమహిమతోడ నవతరించె
శీతలచ్ఛాయలఁ జెన్నొంది తతదీర్ఘ, శాఖావృతంబయి సదమలమయి
వటవృక్ష మొండట వర్ధిల్లు నాచక్కిఁ బ్రకృతి చిహ్నములతోఁ బరిఢవిల్లి
తే. తనరు యోగాశ్రమము మఱి తన్నియంత, నూవె మన్మానసంబునఁ జూడనైన
రాఘవేంద్రుఁ డతండు విరాగులందు, నందె వేసిన చేయి యీ యవనియందు.

చ. ప్రకృతిచికిత్సలో నతఁడు పారగుఁ డార్యనుతుండు ధీరుఁ డే
వికృతియు లేనివాఁడు సువివేకుఁడు నీతిపదావలంబుఁ డు
త్సుకుఁడు దయాలవాలుఁడు విశుద్ధచరిత్రుఁడు నిర్మలాత్ముఁ డా
సుకృతి మహత్త్వ మెన్నుటకుఁ జొప్పడునే ఫణినేత కేనియున్?

తే. పరిచయముగల్గె నా యోగివరునితోడ, మున్నొకప్పుడు దాన నా మునిసమాను
చరిత మెఱిఁగిన కతమునఁ జనుట కటకు, బుద్ధిపుట్టెను నాపూర్వపుణ్యమునను.

ఉ. జాగిఁక కూడదంచుఁ గడు సత్వరతం బయనించి ధీనుతున్
యోగివరేణ్యుఁగాంచి కర మున్నతి వంగి నమస్కరించి నా
బాగును నోగుఁజూచి ననుఁ బాలనసేయుఁ డటంచు వేడ న
భ్యాగతివైతి మా కనుచుఁ బంబిన కూర్మి నతండు నిట్లనెన్.

క. నాలుగు నెల లిచ్చటఁ దము, రోలిని వసియింప శుభము లొదవును నటపై
నేలీలనైనఁ ద్రిమ్మరుఁ, బోలుననుచు నానతిచ్చెఁ బూర్ణగరిమతోన్.

చ. అని యిటు లా మహాత్ముఁ డనఁగా నిక జన్మఫలించె నంచు నే
జని యటఁ బర్ణశాలను విచక్షణతో వసియించి తౌర! ఏ
ఘనతరమౌ మహత్త్వచటఁ గల్గెనొ గాని క్రమక్రమంబు గా
నను విడిపోవఁగాఁ దొడఁగె నా వ్యథలెల్ల సమూలమై వెసన్.

ఉ. చప్పిడికూరలే నమల సాగితి జిహ్వను గట్టివైచితిన్
దప్పక మానిమార్గ మెదఁ దార్కొనఁ జేసితిఁ బెన్ రుజార్తికిం
దప్పి సుఖించి ముక్తికిని దారి యిదే యని యెంచితిన్ మదిన్
జెప్పఁగరాని మోక్షపదచిహ్నము లున్నవి యీ చికిత్సలోన్.

క. రెన్నెలలు తొట్టిస్నానము, లెన్నగ నొనరించినాఁడ నెంతయు నిష్ఠన్
సన్నుతిని నేకభుక్తమె, మిన్నక సల్పుచును ముదము మేకొన మదిలోన్.

మ. ఉపవాసంబు పదైదుగోజు లటపై నున్నాఁడ నిశ్చింతతో
నుపవాసంబున నున్న నిశ్చలత యా యుత్సాహముల్ శక్తియుల్
ఉపమాతీత మనంతయోగమున కోహో సాధనం బిద్దియుం
దపముల్ భక్తియు నిందులోనివె సుమీ తర్కింపఁగా నెమ్మదిన్.

చ. దినదినముల్ రుజార్తిమెయిఁ దీరని దుర్వ్యథలందు నేను బెం
పున సుఖమందఁగాఁ గలిగి పొంగితి దగ్గును రొప్పు మాయమై
చనియెను మేనికెంతయును సత్తువ వచ్చెను నిర్మలత్వ మ
బ్బెను గడువింతగా మదికిఁ బేర్కొనశక్యమె రాఘవేంద్రునిన్?

ఉ. జీవిత మింక వ్యర్థమని చిత్తము కుంగెనుగాని నాకు నా
భావములో వికాసమును బల్కఁగ నేర్పును జిత్తశుద్ధియుల్
దేవునియందు భక్తియును ధీపటిమంబును గల్గె యోగియే
దేవుఁడు నాదుపాలిఁటికిఁ దీరని నావ్యథఁ దీర్చినందునన్.

క. ఏము జగన్నాథుల మని, స్వామిద్రోహంబుచేసి చనియెద లుబ్ధుల్
కాముక నిడుమలఁ గుడుచుచు, నీమహి దురపిల్లుచుండు లేమి యరుదగున్.

చ. అది యిది యిత్తుమంచుఁ దుద కన్నియు మిన్నక సున్నచేసి యే
గెదరు, రుజార్తిఁ బాపుకొని కీర్తివిదూరులునైన లుబ్ధులే
నెదియు నొసంగలేక తమి నిట్టులు వ్రాసితిఁగాని యేగతిన్
సదయత రోగులం గనెడు స్వామి ఋణంబును దీర్చుకొనగున్.

సీ. కీర్తనీయంబగు కృష్ణాతరంగిణీ, తోయంబులను భక్తితో మునింగి
ముక్తిదాయకుఁడగు ముక్తీశ్వరస్వామి, సన్నిధి భక్తి సాష్టాంగ మెఱఁగి
ఆకు జొంపములచే నడరి బెడంగగు, సిద్ధవటంబును జేరి నిలచి
పెదవిఁ గదల్చినఁ బీయూషమును జిల్కు, రాఘవేంద్రుని భక్తి రంజిలంగ

గీ. దర్శనముజేసి నిశ్చల తత్త్వ మొప్ప, ఆ మహాత్ముని యాజ్ఞల కడుగుదాట
కఖిలరోగంబులను బాసి యవనిలోన, భోగులై విలసిల్లుఁడో రోగులార!

# స్వీయ చరిత్ర

కొలిపాక ఆదినారాయణశర్మ

నేను ఈ నూతన దేహమును ధరించి జనసంఘములోనికి మరలవచ్చినది 1915 సంవత్సరం ఏప్రియల్ ఎనిమిదవ తేదీ. ఈ జన్మలో నా తల్లిదండ్రులు నిరాడంబర జీవులైన బ్రాహ్మణులు. సరళస్వభావులు. ఆరోగ్య భాగ్యము గలవారు. స్వశక్తిపై ఆధారపడి కష్టార్జితముతో జీవించు స్వభావము గలవారు. వారికి భుక్తికి లోటులేదు, గాని దాచుకొనుటకు ఆస్తిని పోగుచేసి, దానిని సంరక్షించుకొనుటలో వ్యసనపడుటకు తగు వసతి గాని కోరిక గాని లేకుండెను.

నాకు అయిదవసంవత్సరమున అక్షరాభ్యాసము చేసిరి. పదవసంవత్సరమున ప్రాథమిక పాఠశాలలో అయిదవతరగతివరకు చదివికొని పదకొండవయేట ఆంగ్లేయోన్నతపాఠశాలలో ఒకటవ ఫారమునందు ప్రవేశించి పదహారవయేట అనగా 1931 సంవత్సరమున స్కూలు ఫైనల్ క్లాసులో కృతార్థుడనైతిని. నేను చదువుకొనునపుడు నాకు శరీరశాస్త్రము, ఆరోగ్యశాస్త్రము, భూగోళశాస్త్రములలో ఎక్కువ అభిరుచి యుండెడిది

నా తల్లిదండ్రులు నాకు కాలేజీవిద్యల చెప్పించ ఆర్థికశక్తి లేనివారుగ నుండిరి. నాకు ఆ విద్యావిధానముమీద గౌరవమును లేకుండెను. ఇంతవరకు నేర్చికొన్న భాషాజ్ఞానమును ఆధారముగ చేసికొని నాకు పారమార్థిక, ధర్మశాస్త్రములను చదువ కుతూహలము గలిగెను. వైద్యవృత్తియందు జాతీయజీవనసాధనయందుకూడ నాకు అభిరుచి గలిగెను.

నా తండ్రిగారిది ఉపాధ్యాయ వృత్తి. ఆయన అభిమాన శాస్త్రములు దేశచరిత్ర, భూగోళశాస్త్రము. ఆయన నాకు విద్యావిషయములో చాల సహాయపడుచు ప్రపంచ చరిత్ర, దేశము, సంఘము, జాతియొక్క పరిస్థితులు బోధించుచుండెడివాడు. మహాత్ముల జీవిత చరిత్రలు భాగవతము చదువ నన్ను ప్రోత్సహించుచుండెడివాడు. మహాత్ములచరిత్రలు చూపుడు అద్దముల వంటివనియు, మనము ప్రపంచమంతటిని చూడగలుగుచున్నప్పటికిని మనముఖమును చూచుకొనుటకు మాత్రము అద్దముయొక్క సహాయమును కోరి మన ముఖమందలి లోపములను సవరించుకొని ఎట్లు తేజోవంతముగ నుంచుకొనగల్గుచున్నామో, అటులనే మహాత్ములజీవితములను చూచి మన జీవితమందలి లోపములున్న సవరించుకొనుటయు క్రొత్తశక్తులను సంపాదించుటయు సంభవించుననియు మహాత్ములు అద్దములవలె పరిశుద్ధులనియు వారిలోనే భగవానుని తేజస్సు బాగుగ ప్రతిబింబించుననియు చెప్పెడివాడు. నాకు ఆ కాలములో ఆటలలో ఆసక్తి నేర్పు ఎక్కువగా నుండెడిది. కాని మా నాయనగారు ఆటలకు పోవుటకు, స్నేహితులతో కలిసి విహరించుటకు నాకు అవకాశ మిచ్చెడివారు కారు.

"నీకు వ్యాయామము కావలెనంటే నేను చెప్పినట్లు చెయ్యి. దానివల్ల ఆరోగ్యము, బలము, ఆర్థికముగ అభివృద్ధి కాగలశక్తి, సేవాతత్పరత, లభించగల"వని చెప్పుచూ ఇంటిలో విస్తళ్ళకు కావలసిన ఆకులకొరకై బాదము చెట్లు, మఱ్ఱిచెట్లు, ఎక్కించి ఆకులు కోయించేవాడు. నాగుడ్డలు శుభ్రముగా నన్ను కాలువకు వెళ్ళి ఉదికికొని, బాగా ఈతకొట్టి స్నానముచేసి రమ్మనేవాడు. ఇంటిని రోజూకు రెండుమారులు ఊడిపించేవాడు. దొడ్డిలో కూరగాయలు పండించమనేవాడు. కాలువనుండి బావినుండి నీరు చేరబోయమనేవాడు. "ఈ పనులు చేస్తే వైసిద్ధులు కలుగుతాయి. పూర్వము ఆశ్రమాలలో విద్యార్థులు ఈ పనులే చేసేవాళ్ళని, అందువల్లనే వారు దైహిక మానసిక శక్తులలో అంత అభివృద్ధి పొందినా"రని చెప్పేవాడు. వాటినన్నిటిని ఆయనభయము చేత అపుడు ఆచరించేవాడిని. కాని అవి ఇపుడు అలవాటుగా మారినవి. వానిని వదలిపెట్టుమని ఎవరైనా చెప్పితే ఇపుడు మానుటకు నాకు అసాధ్యముగ నున్నది.

నేను చెడ్డస్నేహితులతో కలసి దురభ్యాసాలకు లోను గాకుండా ఆయన చాలా కావలికాసేవాడు. ఆయన దయవల్లనే ఈ జన్మ యెత్తినతర్వాత ఒక కప్పు కాఫీ గాని, టీ గాని, ఒక పొగచుట్ట, అట్టి రకములు గాని, సేవించకుండా కాపాడబడ్డాను.

నన్ను మంచి స్నేహితులతో సహవాసం చెయ్యమనేవాడు. పుస్తకం ఒక స్నేహితుడు. కలము ఒక స్నేహితుడు. సిరాబుడ్డి ఒక స్నేహితుడు. ఇట్లాంటి స్నేహితులకు చూపించేవాడు. నాకు ఆ కాలంలో అది చాల కష్టంగానే ఉండేది. కాని ఇప్పుడు ఆ స్నేహితులకు నాకు అత్యంత సన్నిహిత సంబంధం ఏర్పడింది. ఇంకా

మానవస్నేహితుల సాన్నిధ్యం లభించకపోయినా అశాంతి కల్గుటలేదు.

నా తండ్రిగారు మానవజీవనవిధానంలో ఆదర్శమైన పంథాను తెలిపి దానికి ఉదాహరణలుకూడ చూపించినారు. "స్వాతంత్ర్య జీవులైన పక్షులలో జీవితం ఎంత ఆదర్శకరంగా ఉన్నదో మనం పరిశీలిస్తే గోచరిస్తుంది. పక్షిదంపతులు గూడ్లనుపెట్టుట, పొదుగుట, పిల్లలు చేయుట, శత్రువులనుండి కాపాడుట, ఆహారమును తీసికొనివచ్చి పోషించుట; మొదలగు కార్యములలో అన్యోన్యసహాయము చేసికొనుచు తమ సంతానమును రెక్కలు వచ్చుదనుక ఆహారమిడి పోషించి రెక్కలు రాగానే వాటిని సోమరులుగ నుంచక స్వశక్తిపై ఆధారపడి జీవించుమని బయటికి పంపివేయును. పరతంత్ర జీవితము పక్షిజాతికి అవమానకరము. ఆపద్ధతినే ఉత్తమ జాతి మానవులుకూడ ఆచరింతురు. ప్రాచ్యపాశ్చాత్య దేశములలో కొన్నిచోట్ల యువతీయువకులకు మైనారిటీ లోనున్నంతవరకు మంచివిద్య, శిక్షణ, యిచ్చి మెజారిటీ రాగానే తమ స్వశక్తిమీద ఆధారపడి జీవించి గృహస్థులు కండని పంపివైచి తమ స్వార్జితమైన ఆస్తిని తమకు సరిపోయినంతవరకు ఉంచుకొని మిగతాది ధర్మకార్యములకు, అనాధులకు పంచిపెట్టెదరు. వారు ప్రయోజకులైన తర్వాత తల్లిదండ్రులకు, కుటుంబమునకు, సంఘమునకు సేవచేయుదురు. ఈవిధంగా అమెరికాలో ఆదర్శజీవితం జీవించిన మహావ్యక్తులలో ఒకరు బెర్నార్ మ్యాక్ ఫేడన్. ఇట్టి జీవితవిధానము ప్రకృతి ధర్మబద్ధమైనది. ప్రతివారును అనుసరింపతగినది. అదే మానవకళ్యాణానికి సహాయపడేది.

ఈ సిద్ధాంతము ధనికవాదులకు నచ్చకపోవచ్చు. కాని లోకకళ్యాణం కోరే సత్యవాదులు, ధర్మవాదులు, సామ్యవాదులు ఒప్పుకుంటారు."

మానాన్న ఇట్లా చెప్పుతూ "నిన్ను కూడా బయటకు బంపివేస్తాను. కార్యరంగంలో విహారం చేయడానికి స్వచ్ఛంద సైనికుడిలాగా సిద్ధంగా ఉండు" అన్నాడు ఒకరోజున.

నాకూ ఈ సిద్ధాంతం బాగానే నచ్చింది గనుక సంతోషంతో సరే నన్నాను.

1932 సంవత్సరంనుండీ నా జీవితం గడపటానికి జన్మతరించడానికి అనుకూలమైన వృత్తికొరకు నేను అన్వేషింప మొదలుపెట్టినాను. లౌకికజ్ఞానంతో పొట్టపోసికొనే వృత్తులు నాకు సరిపడలేదు.

1933 సంవత్సరంలో నేను చేస్తున్న అన్వేషణను ఒక అమ్మ పరికించింది.

ఆమె చాల భాగ్యవంతురాలు. సర్వజ్ఞ, సర్వశక్తిమంతురాలు. ఆమె నేను సోమరితనము లేకుండ కష్టపడి జీవించవలెనని కుతూహలము గలవాడనని గ్రహించి నన్ను ప్రోత్సాహించాలనుకొంది. ఆమె అధీనంలో అనేక సంస్థలు, పొలములు, వ్యాపారములు, ఉన్నవి. అందులో నాకు ఇష్టమైన ఉద్యోగం ఏదో కోరుకో మన్నది. నాకు లోకకళ్యాణకరమైన వైద్యవృత్తి నవలంబించవలెనని కోరికగలదని చెప్పితిని. అందులకు ఉత్తమమైన వైద్యశిక్షణ పొందవలెననియు, జీవితమంతయూ సాధనచేయవలెననియూ, ధర్మబద్ధమైన జీవనమును గడుపవలెననియు, అందుకు సర్వవిధముల సిద్ధమై త్రికరణశుద్ధిగ సాధన చెయ్యగలిగితేనే మొదలుపెట్టమనియు అన్నది. సరేనని ప్రమాణంచేసి 1933లో మొదలుపెట్టి మూడుసంవత్సరములు ప్రకృతిధర్మపరిషత్తువారి పాఠశాలలో సామాన్యశాస్త్రమును చదివి విద్యార్థిధర్మములను అనుసరించితిని. అమ్మ అనుంగు బిడ్డలైన అనేకమంది అన్నలతోను అక్కలతోను సహవాసము చేసితిని.

ఒక కవీశ్వరుడు ఆ పాఠశాలనుగురించి ఇలా చెప్పాడు

గీ|| ప్రకృతిరంగమె నిజమైన పాఠశాల
మూలవాస్తవతత్వము బోధ్యవస్తు(వు)
అఖిలవస్తుగణమ్ము పాధ్యాయులమ్ము
అర్హశిష్యులు స్వస్వరూపాప్తిపరులు.

నాకు కావలసిన అన్నివసతులు ఆయమ్మ దయవలన లభించుచుండెడివి. ఆమెయందు నాకు తల్లిభావము కుదిరి స్థిరపడినది. అందువలన ఆమెను "అమ్మా" యని పిలుచుట కలవడినాను. ఆమెకూడ నన్ను పెంపుడుబిడ్డవలె చూచుచు నన్ను సర్వవిధముల ప్రోత్సహించుచున్నది. నాకుగల సర్వసందేహములను ఆమె చక్కగా పరిష్కరించుచున్నది.

ఆ యమ్మ జగద్విఖ్యాత. సర్వశక్తిస్వరూపిణి. సర్వతంత్రస్వతంత్ర అనే బిరుదు ఆమెకు ఒక్కతెకే తగును.

ఆమె ఇదివరలో తనను నమ్మిన అనేకమందిని పెంచింది. పోషించింది. అమ్మయొక్క గుణాలను అనేకమంది ఆమె భక్తులు, కవీశ్వరులు కీర్తించారు.

అమ్మయొక్క ప్రేమపూరితమైన దాతృత్వాన్ని గురించి ఆంగ్ల మహాకవి ఆలివర్ గోల్డుస్మిత్ అన్నయ్య ఇలా కీర్తించాడు.

Nature, a mother, is kind enough to all,
Still grants her bliss at labourer's earnest call-

"ప్రకృతి సర్వభూతదయాళుత్వముగల్గిన ఒక మహా తల్లి. ఆమెయొక్క అమృతకిరణాలు అందరిమీదా ప్రసరిస్తూనేఉంటాయి. వానిని ఆస్వాదించాలనే ఇచ్ఛ ఎక్కువై కోరిన ప్రతిశ్రమజీవికీ బ్రహ్మానందము, పరమ సుఖము, అమృతత్వములను ఆమె ప్రసాదిస్తుంది" అని భావము. ఆంధ్ర కవితావతంసుడు భక్తుడు అయిన బమ్మెర పోతన అన్నయ్య అమ్మకు దుర్గ అనే పేరుపెట్టి ఇలా ప్రార్థించాడు.

ఉ. అమ్మలగన్నయమ్మ ముగు
  రమ్మలమూలపుటమ్మచాల పె
ద్దమ్మ సురారులమ్మకడు
  పాఱడి బుచ్చినయమ్మ తన్నులో
నమ్మిన వేల్పుటమ్మల మ
  నమ్మున నుండెడియమ్మ దుర్గ మా
యమ్మ కృపాబ్ధి యిచ్చుత మ
  హత్త్వ కవిత్వపటుత్వసంపదల్

ఆమాతను ఎఱుగనివారులేరు. ఆమె గుణములను వర్ణించ ప్రయత్నించుట సూర్యుని చూచుటకుగాను కొవ్వొత్తి సహాయము కోరినవానివలె హాస్యాస్పదమును అనవసరమును అగును. ఆమెకు అనేకమంది అనేక పేర్లు పెట్టినారు. బాహ్యాభ్యంతరములయందు నిండియున్న ఆయమ్మను నేను ప్రకృతిమాత అని పిలుతును.

ఆమెదయవలన నేను సుఖముగ జీవించగల్గుచున్నాను. నేను తల్లిదగ్గరనున్న శిశువువంటివాడను. ఇంకను తండ్రితో కలిసియుండుటకు ఎక్కువ అలవాటుపడలేదు. క్రమముగా అలవాటు చేసికొనెదను. అపరమ పిత దయకూడ నామీద ప్రసరించుచునే యున్నది.
ఒక సోదరుడు "పరమ శివుడే తండ్రిరా, ఈ ప్రకృతి సుందరి తల్లిరా" అని గానము చేశాడు.
మనకందరకు వారిద్దరు అసలు తల్లి దండ్రులు. మన మందరము ఏకగర్భజనితులము, మనది విశ్వైకకుటుంబము. మనది ధర్మరాజ్యము.

నేను అమ్మ ద్వారా వైద్యం నేర్చుకున్నాను. దానిని ప్రకృతి వైద్యము అని పిలుస్తున్నారు దానిని అభివృద్ధి చేసి మానవకళ్యాణమునకు సహాయపడడానికి నాకంటె ముందే విశ్వైక కుటుంబములోని నాపెద్ద సోదరులు నేర్చికొని అనేకసంస్థలు స్థాపించినారు. నా శక్తి కొలది నేనుకూడ ఒక సంస్థ స్థాపించి కృషి చేయ దలచినాను. ఆసంస్థపేరు 'ప్రకృతి ధర్మపరిషత్తు' అని పెట్టమని చాలామంది చెప్పారు. 1940 సంవత్సరములో బెజవాడలో అది స్థాపింపబడింది. దానికి అనేక అంగాలున్నాయి. దాని చరిత్ర వేరే ప్రచురించాను. సర్వాంగశోభితంగా ఆ సంస్థ నడచుటకు కావలసిన సహాయం అంతా అమ్మే చేస్తుంది.

నా దేహతత్త్వము మొదటినుండీ బలిష్ఠమైనదే, గాని ఇంటివద్ద చేయబడిన పక్వాహారమును తినుటవల్ల ఆరోగ్యం సామాన్యంగా నుండెడిది. 1933 సంవత్సరం (మొదటి ప్రకృతిశిక్షాశిబిరం) నుండి నేను అమ్మ తయారుచేసిన స్వాభావికాహారమును తీసికొనుట ప్రారంభించినాను.

అందువలన నాకు ఆరోగ్యము చాల అభివృద్ధియై మానసిక, దైహికబలములుకూడా కల్గినవి. ఇదంతా ఆమె అమృతహస్తప్రభావ మని నా విశ్వాసము. నా ఆశయాలు నా తల్లిదండ్రులకు పూర్తిగా నచ్చి ఈ ఆహారమునే చాల కాలము సేవించినారు. ఈ వైద్యమునే చేసెడివారు. మానాన్నగారు 1942 సంవత్సరములో భౌతికదేహమును వదలిపెట్టినారు. అమ్మగారు ప్రకృతి జీవనాభిలాషిణియై నాకు ప్రోత్సాహ మిచ్చుచున్నారు. నాకు ఇపుడు ఇరువదిఏనిమిది సంవత్సరముల వయస్సు. నా సంస్థ నడచుటకుగాను నాకు సహాయపడే ధర్మపత్ని కావలెనని కోరిక గల్గినది. ఆ కోరిక అమ్మతో చెప్పినాను. నీ సంకల్పము నెరవేరగలదని అమ్మ ఆశీర్వదించి అందులకై కృషిచేయమని చెప్పినది.

ఈలోగా సంస్థనిర్మాణమునకు కావలసిన పరిస్థితుల నన్నిటిని ఆమె ఏర్పర్చి కొన్ని జీవితసాధనలు చేయ ఆజ్ఞాపించింది.

అమ్మ తనను ఆశ్రయించి కష్టపడి పని చేసి జీవించి ఈశ్వరభక్తితో సుఖజీవనము చేయ ఆసక్తిగల సాధకుల నెందరినైనను పెంచుకొని ఐహికమునకు ఆముష్మికమునకు త్రోవచూపుటకు సిద్ధముగనున్నది.

నాకు నా తల్లిదండ్రులు పెట్టినపేరు ఆదినారాయణ శర్మ. నేను ప్రకృతిమాతను ఆశ్రయించి ఆమె నౌకరీలో నుండుటనుబట్టి నన్ను బాగా ఎరిగినవాళ్ళు ప్రకృతి శర్మ అని పిలవడం మొదలుపెట్టినారు. అమ్మపేరు ముందుంచి ఉచ్చరిస్తూ తర్వాత ఆమెమీద ఆధారపడి యున్న నన్ను సంబోధిస్తూ యుంటే నాకు సంతోష కరంగానే ఉన్నది.

నేను చదివిన లౌకిక విద్యలకు నాకు కొన్ని బిరుద ములు లభించినవి. కాని వానిని నా నామధేయము నకు ముందుగాని వెనుకగాని పెట్టుకొనుటకు ఏమాత్ర మువకాశంలేకుండా అమ్మ ముందు తాను ఉండి వెనకాల ఫుల్‌స్టాప్ (చుక్క) పెట్టేసింది. నా జీవిత మును అంతా ఆమెలో ఇముడ్చుకొని "నీకింకా ఈ లౌకిక బిరుదులు ఎందుకు? నాలో లేనిదీ నీకు కావలసినది ఇంకా ఏముంది? నీ కింక ఇతర బిరుదులు పోసేపని తీసేస్తాను. నా పేరుమాత్రం నిలుపుకో" అని చెప్పింది. మహాప్రసాదం అన్నాను. ఇది ముఖ్యవిషయములతో గూడిన నా ప్రకృతి జీవనచరిత్ర.

ఇంకను ఎక్కువ వివరములు ఇవ్వ ప్రయత్నించితిని గాని చదువరులను అనవసరముగా శ్రమపెట్టవలసివచ్చు నను అభిప్రాయముతో వానిని వెల్లడింప సాహసించ లేకపోయినాను.

ఒక కవీశ్వరుడు "మధుర నామంబెవరు వినిచిరో మరగి నిముసము వదలలేను" అని పాడినట్లు సామాన్యజీవి నైన నాకు "ప్రకృతి" అనే మధురనామము వినగానే తన్మయత్వము కలుగుతుంది. దానికి కారణమేమో నాకే తెలియకుండా ఉంది. పూర్వజన్మసంచిత మని కొందరన్నారు.

# ప్రకృతి ధర్మ పరిషత్

## సత్యనారాయణపురం, బెజవాడ - స్థాపితము: 1940 సం॥ జూలై

అధిపతి: 'ప్రకృతి మాత' స్థాపకులు, కార్యనిర్వాహకులు, కొలిపాక ఆదినారాయణశర్మ

ఈ సంస్థస్థాపనకు నన్ను ప్రోత్సహించిన కొన్ని పరిస్థితు లను సోదర మహాశయులకు విన్నవించి తర్వాత సంస్థ చేసినకృషిని గురించి తెలిపెదను. సర్వశక్తి స్వరూపిణి యైన ప్రకృతిమాత ఈ సంస్థను స్థాపించుటలో నన్నొక పరికరముగ మాత్ర ముపయోగించుకొన్నది. అమ్మ ఒక గొప్ప లేకరి. నేనొక కలమును మాత్రము. వ్రాసినది అమ్మ. ఈ వ్యాసములో ఒకొక్కప్పుడు కలమే వ్రాసిన దను అర్థము స్ఫురింపవచ్చును. కాని ఎవరి సహాయము లేకున్నచో కలమునకు వ్యక్తిత్వము ఏ మాత్రమును లేదో, ఆ ప్రకృతిమాతను స్మరించగానే నిజముగ వ్రాసినదెవరో, ఎవరికి ఎక్కువ ప్రాధాన్యత యున్నదో, పాఠకమహాశయులు గ్రహించవచ్చును.

నేను ప్రకృతికార్యాలయములో శ్రీ నారిశెట్టి హను మయ్యగారు వ్యాధిగ్రస్తులైనప్పటినుండియును పని చేయ ప్రారంభించితిని. వారు 1934 జూలైనెలలో వ్యాధిగ్రస్తులై ఆగష్టు 9వ తేదీన పరలోక నివాసమునకు వెళ్లిరి. నేను ప్రకృతి మాత ఆజ్ఞాప్రకారము ఆ కార్యా లయములో నౌకరుగ పనిచేయుచు అనేకానుభవ ములను గడించితిని. నన్ను అపుడు మేనేజరు అని పిల చెడివారు. అంటే కసవు ఊడ్చుటదగ్గరనుంచీ మొదలుజేసి, జవాను పని, గుమాస్తాపని, క్యాషి యరుపని, ఎక్కౌంటెంటు పని, సహాయ సంపాదకుని పని, విద్యార్థిపని, ఉపాధ్యాయుని పని, వ్యాసకర్త పని, డాక్టరుపని, గ్రంథభాండాగారిపని, మొదలగు అన్ని పనులూ తెలిసికొన నవసరము, అవకాశము, గల ఉద్యోగం అన్నమాట.

ఆఫీసుపనులు చేయుటకు నేను ఒక్కడినే యుండెడి వాడను. స్వాభావికాహారమునే తీసికొనుచు ఆఫీసు మేడపైననే నివసించెడివాడను. నేను ఎల్లప్పుడును అదే పనిమీదనుండి రత్నగర్భ అయిన ప్రకృతికార్యా లయమహాసముద్రంలో ఆరు సంవత్సరములపాటు ముత్యాలు ఏరే పనిలో మునిగి తేలటం జరిగింది.

కొన్నాళ్లు జరిగేటప్పటికి నాకు ఎప్పటికీ ఈ మహా సముద్రంలో ముత్యాలకోసం మునుగుతూ తేలుతూ యుండవలసిందేనా? భూమిమీద జీవించవలసిన మాన వుడనైన నాకు ఇప్పటికి ఏరుకున్న ముత్యాలతో తృప్తి పడి ఆ అవకాశం మరికొందరికి వప్పగించి ముత్యాలను భూమిమీద పదిమందికీ చూపి ఆనందించతగిన అవ

కాలం ఏమైనా ఉన్నదా? ఆ ఆలోచన కలిగింది. వెంటనే శంకరాచార్యులవారు 'లక్ష్మీనృసింహ మమ దేహి కరావలంబం'' అన్నవాక్యం జ్ఞాపకం వచ్చి నేను కూడా ప్రకృతిమాతను ప్రార్థించా. ఆమె ప్రత్యక్షమై "నీకు మంచిచోటు సంతోషకరమైన పనీ చూపిస్తాను. ప్రయాణం కమ్మ"న్నది. నేను ప్రకృతి కార్యాలయసముద్రగర్భంలో ఏరుకున్న అనుభవములు, విజ్ఞానము, కార్యాచరణలు అనే కొన్ని అమూల్యమైన ముత్యాలను జేబులో వేసికొని ముత్యాలమీద ఆసక్తియున్న వాళ్ళకు చూపించి ఆనందిద్దామని భూమి మీదికి బయలుదేరా.

మొదట్లో వైద్యానుభవము అనే పెద్ద ముత్యం చాలమందికి చూపించాను. దాని విలువ తెలిసికొన్నవారు సంతోషించి నాకు తిండీ, గుడ్డ ఇస్తున్నారు.

ఇంతలోకే అమ్మ కనబడి నేను ఒక ఇల్లు కట్టుతున్నాను. నీవు వచ్చి యిందులో కొన్నాళ్లు కాపురం ఉండి దీపారాధన చేస్తూ నా ఇంటిని జాగ్రత్తగ చూస్తూ నాకు కావలసివచ్చినపుడు ఖాళీచేసి ఇచ్చే బాధ్యతమీద ఉండగలవా? అని అడిగింది. సరే మీ ఇంటిని జాగ్రత్తగా చూస్తూ ఉంటాను. నా బ్రతుకు తెరువు నేను కష్టపడి సంపాదించుకుంటాను. నా సంపాదనతో నాకు కావలసిన సామాను తెచ్చుకుంటాను. నీవు ఎపుడు ఖాళీచేయమంటే అపుడు ఖాళీచేసి మళ్ళీ మీకు జాగ్రత్తగా ఇల్లు వప్పగించి నా సామానుతో నేను లేచిపోతాను. కాని నన్ను లేచిపొమ్మనుటకు ఒక నెలరోజులు ముందుగా నాకు నోటీసు ఇవ్వాలని కోరాను. "అదిమామూలుగా జరిగేపనే. నాకు తెలుసునులే'' అంది అమ్మ. ఆమెయే ఆయింటిపేరు ప్రకృతి ధర్మపరిషత్తు అని పెట్టుకుంది. నేను ఆ ఇంట్లో 1940 సం॥రము జూలై నెలలో ప్రవేశించాను. ఇవీ ఈ సంస్థ ప్రారంభమగుటకు కారణమైన కొన్ని సంఘటనలు. ఇక సంస్థచరిత్ర, అదిచేసిన కృషినిగురించి వివరిస్తాను. ఈ సంస్థ అఖిలభారతప్రకృతిసంఘం, బెజవాడ (The Indian Naturopathic, Association Bezwada) వారి శాఖలలో ఒకటి. ఇది ఆదర్శములలో పై మహాసంస్థతో అన్నివిధముల ఏకీభవించి మెలగుచు ఆర్థికముగ మాత్రము అమ్మ అనుగ్రహముతో గూడిన నా బాధ్యతతో ప్రారంభింపబడినది. ఇట్టి సంస్థలు ప్రతి ఊరను ఒక్కొక్కటి స్థాపింప బడవలెనని ఆంధ్రరాష్ట్రీయ ప్రకృతి సంఘంవారు కొన్ని ఆదర్శములను ప్రకటించిరి. ఆ ఆదర్శములతో ఈ సంస్థ భారతదేశమున మొట్టమొదటిదిగ ప్రారంభింపబడినది. ఇట్టిసంస్థలు దేశమందు అనేకములు స్థాపింపబడి ప్రకృతి ఉద్యమము నలుగడల వ్యాపించి మానవసౌభాగ్యమునకు సహాయపడవలెనని హృదయపూర్వకముగ అభిలషించుచున్నాను.

ఈ సంస్థను ప్రకృతికార్యాలయము వద్దనే స్థాపించ కొందరు సలహానిచ్చిరి. కాని అది బెజవాడ బస్తీమధ్య ఇరుకు ప్రదేశములో నున్నది. మహాసముద్రమధ్యమువలె నాకుఅది ప్రకృతి జీవనాభిలాషులకు వాసయోగ్యంగా కన్పట్టలేదు. ప్రకృతిరామణీయకమై విశాలమైన ప్రదేశముకొరకు చూచితిని. ఉదారస్వభావులగు శ్రీఉప్పలపాటి రామరాజుగారు తమ మామిడితోట యందు సంస్థను నెలకొల్పుటకై స్థలమునుచితముగ వాడుకొనుటకు అంగీకరించినారు. తోట సత్యనారాయణపురములోని బ్రహ్మయ్యపంతులు వీధిచివరనున్నది.

ప్రకృతికార్యాలయములోనుండగా నాకు అభిమాన శాఖలైన చికిత్సాలయసేవ, ప్రకృతి జీవన సాధన పరిశోధన; ప్రకృతి గ్రంథాలయసేవ; విద్యాగోష్ఠి; శిబిర కార్య నిర్వహణము – వీనిలో ప్రత్యేకశ్రద్ధ వహించుటకు అవకాశ ముండెడిది. కాన ఇపుడు వానిలో ప్రత్యేక కృషిచేయ తలపెట్టితిని.

ప్రారంభమున అయిదువందలరూపాయలు పెట్టుబడిగ తెచ్చి, అందు మూడువందల రూపాయలు ప్రకృతి చికిత్సాగ్రంథములకును రెండువందల రూపాయలు చికిత్సాపరికరములకును ఖర్చుపెట్టితిని.

వ్యాధిగ్రస్తులు, ప్రకృతి జీవనాభిలాషులు, ఉండుటకుగాను తోటలో ఒక పెద్ద కుటీరమును నిర్మించితిని. దానికి నూట ఏబదిరూపాయలు ఇప్పటివరకు ఖర్చైనవి. తోటలో చెదలు ఉండుటవల్ల గ్రంథనిక్షేపమును కాపాడుటకును చికిత్సా పరికరములు, రికార్డులు భద్రముగనుంచుటకును తోటకు సమీపముననున్న ఒకరి డాబాలో ఒక భాగమును నెలకు నాలుగురూపాయలకు అద్దెకు తీసికొంటిని. దానిలో విద్యార్థులకు స్వచ్ఛంద సేవకులకు ఉచిత వసతియు, ధర్మగ్రంథాలయ ముంచుటకు వసతియు చేసితిని. ఇచటికి వచ్చి చదువుకొనువారలకు ప్రకృతి వైద్యగ్రంథములు, పత్రికలు పఠనకొరకు ఇవ్వబడుచున్నవి. ధర్మార్థము వినియోగపడుచుండెడి యీ కార్యమునకుగాను కావలసిన అద్దెను ఉదారులగు

దాతలవద్దనుండి విరాళములుగ వసూలు చేయదలచి నాను.

అందులకుగాను నాల్గురకముల దాతలను ఏర్పాటుచేసి నాను. ఒకమారు ఈ క్రింది సభ్యులు చందాలను ఇచ్చినచో జీవిత పర్యంతము మరల ఇవ్వవలసిన నిర్బంధము లేదు. సభ్యులు ఒక రూపాయి. ప్రోత్సాహకులు అయిదురూపాయిలు. సహాయులు పదిహేను రూపాయలు. పోషకులు ఇరువది అయిదు రూపాయలు.

ఈ కార్యమునకు ఈ క్రిందివారు సహాయపడినారు. అందు శ్రీ మెట్లపల్లి కోటేశ్వర రావుగారు, బి ఎ. బి.ఎల్ వకీలు; బెజవాడ, ప్రథములు

పోషకులు

1. శ్రీ మెట్లపల్లి కోటేశ్వర రావుగారు, వకీలు, బెజవాడ
2. కొలిపాక ఆదినారాయణ శర్మ, బెజవాడ

సహాయకులు

1. ఆర్ వీరేశలింగం గుప్తగారు, సికింద్రాబాదు (దక్కన్)

ప్రోత్సాహకులు

1. గుదిబండి రామచంద్రారెడ్డిగారు, కొల్లిపర
2. ముక్కామల హనుమంతరావుగారు, కొల్లిపర

ఏబదిమంది చేరిరి. స్థలము చాలనందున వారిపేర్లు ఇచట ప్రకటించలేను. అవకాశమున్న వేరే ప్రకటింప ప్రయత్నింతును. ఈ విరాళములను వసూలుచేయుటకు నేను లోగడ నెక్కువ కృషిచేయలేదు. ఇకముందు ప్రయత్నించి దాతల పేర్లు మరొకమారు ప్రకటింతును. 1940 సంllరం జూలైనుండి 1943 డిశంబరు ఆఖరు వరకు మొత్తము అద్దె రు 168 లు అయినది. అందుకు గాను పై దాతలవద్దనుండి వసూలైనది రు 125 లు పోగా ఇంకను డిసెంబరు ఆఖరువరకు వసూలుకావలసిన అద్దెబాకీ రు 43 లు.

ఈ సంస్థ ఆదర్శములను, కార్యనిర్వాహణమును తెలియజేయు ఆరురకముల కరపత్రములను రశీదులను అచ్చువేయించుటకు రు 35 లు ఖర్చైనది. ఈ ధనము కూడ దాతలవద్దనుండి వసూలుచేయ నిశ్చయింపబడినది. ఈ దాతలు సహాయపడ కోరుచున్నాను.

ఈ సంస్థలో నిర్వహింపవలసిన శాఖలనుగూర్చి నాకు అనేకమంది సలహాల నిచ్చిరి.

1. స్టోర్సుశాఖ— నేను ప్రకృతి కార్యాలయములో పని చేయునపుడు అనేకమంది ప్రకృతిచికిత్సా పరికరములను అడుగుచుండివారు. వారు శుద్ధమైన ఏడు రంగుల అద్దములను సీసాలను, ఆదిత్యపేటికలు, క్రోమోడిస్కులు, అంపరికరములు, తొట్లు, రోలైల పెట్టెలు, జల్లుస్నాన, ధారాస్నాన పరికరములు, ఎనిమా డబ్బాలు, కంటిస్నానపుకప్పులు మొదలగు అనేక ప్రకృతి చికిత్సాపరికరములు సరియైనవి దొరుకక అనేక ఇబ్బందులుపడుచు ఆశాభగము నొందివచ్చి కార్యాలయములో ఎదురుగాకనుబడి. నన్ను చీవాట్లుపెట్టి పరికరములు సప్లయి చెయ్యకుండా ఊరకనే పుస్తకాలు అచ్చువేసి అమ్ముకుంటే ఏమి ప్రజాసేవ చేసినట్లవుతుంది! ఉద్యమము ఎట్లావ్యాప్తి అవుతుంది? అని ఇంకా అనేక విధముల ఉద్యమాభిమానులు అడిగేవారు. ఈ సమస్య తీర్పలేనందులకు నాకు చాలా సిగ్గువేసేది. కార్యాలయములో అట్టి స్వతంత్రత లేని నౌకరునుగు నేను అధికారుల అనుజ్ఞ పొందలేక హృదయములో ఆవేదనపడి ఎప్పటికైనా ఈ సేవ చేయవలెననే అమూల్యానుభవరత్నమును జారిపోకుండా భద్రంగా దాచి యుంచాను. అప్పటికే నాగరచేసికొని కార్యాలయములో నుండగా స్టోర్సుశాఖ ఒకటి స్థాపించి సేవ చేయగలిగాను. కాని తక్కిన పనులకు భంగము కలుగుటవల్లను ధనసహాయము లభించనందునను నివృత్తి మించవలసివచ్చెను. ఈ పరిస్థితి స్థాపించిన తర్వాత చికిత్సాపరికరములకొరకు అనేకరకముల కృషిచేసి కావలసినవిషయములను గ్రహించినాను. ఓ గేర్ గ్లాసుకంపెనీ వారు శుద్ధమైన రంగులలో సీసాలను తయారుచేసిరిమని వ్రాసినారు. అచటనుండి శుద్ధమైన ఏడురంగుల లోను రెండువందల సీసాలను తెప్పించి అనేకమందికి సప్లయి చేసితిని. శుద్ధమైన ఏడురంగులలోను అద్దము లను, రంగు కాగితములను తెప్పించి సప్లయి చేసితిని. రకమునకు ఒక్కొక్కటి వంతున ఇప్పుడు వస్తుప్రదర్శనశాలలో నుంచినాను. తక్కిన అనేకరకముల పరికరములున్నూ తెప్పించి సప్లయిచేసినాను. ఇంతలో యుద్ధతీవ్రత యెక్కువైనది అన్నిటితోపాటు వీటికి కూడ విపరీతముగ ధరలు పెరిగినవి. విదేశములనుండి రంగులు రానందున రంగు సీసా లిపుడు తయారగుట లేదు. అద్దములు కూడ వచ్చుటలేదు. ఈ శాఖయందలి సంపూర్ణ వివరములు తెలిసికొనదలచినవారు స్వయముగ వచ్చిన తెలుపగలను.

**2. గ్రంథాలయశాఖ:**— నేను మొదట్లో ప్రకృతి గ్రంథములు సరిగా దొరకక, కొన్ని కొనలేక అనేకవిధముల శ్రమపడి చదువుకున్నాను. ఇపుడు ఆ ఇబ్బందిని చాల మంది పడుట స్వయముగ చూచుచున్నాను. ఆ సమస్యను తీర్చగలుగునది గ్రంథాలయ కల్పతరు వొక్కటే నని నాకు తోచినది. అట్టిది ఇదివరలో ఎచటను లేనందున పరిషత్తులో ఒక ప్రధానశాఖగ గ్రంథాలయమును ఏర్పరచి అమెరికా, ఇంగ్లండు, ఆస్ట్రేలియా దేశముల నుండి ప్రధాన ప్రకృతివైద్యగ్రంథములను ఆంగ్ల భాషలో వ్రాయబడినవానిని తెప్పించినాను. మరియును హిందూదేశప్రకృతివైద్యులచే రచింపబడిన ఆంగ్ల, ఆంధ్ర గ్రంథములను మొదటిలో రు 300 లు విలువ గలిగినవానితో ప్రారంభించి ఇప్పటి కెనిమిది వందల రూపాయల వరకు విలువగలిగినవానిని ప్రకృతి మాత అనుగ్రహమున సేకరించితిని. ఈ గ్రంథములు పరిషత్తులో కూర్చుండి ఆసక్తితో చదువుకొనువారలకు ఇవ్వబడుచున్నవి. ఇంకను గ్రంథాలయమును అభివృద్ధిచేయు కోరికగలదు. ఇంతవరకు గ్రంథనిక్షేపమును సేకరించుటకుగాను ఒకపైస అయినను ఎవరిని అర్థించలేదు. కాని గ్రంథాలయమును స్వయంపోషకముగ నుంచవలెనని కోరిక గలుగుచున్నది.

**3. చికిత్సాలయశాఖ:**— ప్రకృతి కార్యాలయములో నుండగా నేను రోగులకు స్వయముగను, లేఖల ద్వారాను సలహాలను మాత్రము ఇచ్చుచుండెడివాడను. దానివలన కొంతఫలము మాత్రమే కలుగుచుండెడిది. కొందరు రోగులు ప్రకృతిచికిత్సను ప్రత్యక్షముగ పొందదలచి అందులకు బాధ్యతతో కూడిన శాస్త్రీయ ప్రకృతిచికిత్స చేయు చికిత్సాలయ మొకటి బెజవాడ ప్రాంతములో నుండుట అవసర మని అనేక విధముల కోరుచుండిరి. అట్టివారికి కావలసిన మంచి వాతావరణము, వసతి, పరిషత్తుచికిత్సాలయములో ఏర్పరచితిని. అనేకమంది రోగులు చికిత్సనంది ఆరోగ్యవంతులై వెళ్ళిరి. సత్యనారాయణపురం, ముత్యాలంపాడు, బెజవాడలోనుండు అనేకమందికి చికిత్స చేసితిని. బీదలనేకు లుచితచికిత్సను పొందిరి. కాని భాగ్యవంతులు కొందరు తాము చేయగలిగిన సహాయముకూడ చేయలేదు. ఇపుడును ఇంటివద్ద చేసికొను రోగులకు స్వయముగను, లేఖలద్వారాను, సలహాల నిచ్చుచునే యున్నాను.

**4. వైద్యశిక్షణశాఖ:**— ప్రకృతివైద్యము నేర్చుకొనగోరు విద్యార్థులు ఇచటికివచ్చి నేర్చుకొనిపోవుదురు. ఖలుసుపాడు వాస్తవ్యులు ఉప్పలపాటి కృష్ణంరాజు అను యువకుడు ఇచట 1½ సంవత్సరములుండి తన ఆరోగ్యమును బాగుచేసికొనుటలో ఉచితచికిత్సను పొంది ప్రకృతిచికిత్సకపరీక్షకు గ్రంథసహాయము ఉచిత శిక్షణపొంది పరీక్షలో 1941 శిబిరములో కృతార్థుడై వెళ్ళినాడు. అతడు స్వచ్ఛంద సేవకుడుగా పనిచేసినందులకు ఆహారఖర్చులక్రింద నెలకు షుమారు పదిరూపాయలవంతున మొత్తము నూటముప్పదిఆరు రూపాయలిచ్చి, అన్నివసతులును చేసితిమి. భాగ్యవంతుల ప్రోత్సాహము లేకుండుటవలన అట్టివారగు అనేకమందికి సహాయము చేయలేకపోయినాను. ఇదిగాక ప్రకృతి శిక్షాశిబిరములకు వచ్చు బీదవిద్యార్థులకు గ్రంథములు చదువుకొనుట కుచితముగ నిచ్చియు, వారికిగల సందేహములతీర్చియు శక్తికొలది సేవచేయగలిగితిని. 1941; 1942 సంవత్సరములలో బెజవాడలో జరిగిన తొమ్మిదవ, పదవ ప్రకృతి శిబిరముల కార్యభారమంతయు పరిషత్తువారే ధరించి జయప్రదముగ నిర్వహించిరి. శిబిరపు రిపోర్టులు 1941; 1942 జూన్ నెల ప్రకృతి పత్రికలలో ప్రచురింపబడినవి.

**5. వస్తుప్రదర్శనశాల:**— ప్రకృతి చికిత్స కుపకరించు వివిధ పరికరములను ఉద్యమాభిమానులకు ప్రదర్శించుటకుగాను రెండువందల రూపాయల విలువగల పరికరములను సేకరించితిని.

**6. ప్రకృతి వైద్యగ్రంథ విక్రయశాల:**— ఆంధ్రములో ప్రకృతికార్యాలయమువారిచే ప్రచురింపబడిన గ్రంథములున్ను ఆంగ్లములో వివిధదేశములయందలి ఆదర్శ ప్రకృతి వైద్యులచే రచింపబడిన గ్రంథములను, ప్రచురింపబడు పత్రికలను, ఇందు విక్రయించుచున్నాము. యుద్ధతీవ్రత హెచ్చినతర్వాత విదేశముల నుండి గ్రంథములు వచ్చుటలేదు. కాన ప్రస్తుతము హిందూదేశమునందలి ప్రకృతివైద్యులచే రచింపబడిన ఆంగ్ల ఆంధ్ర గ్రంథములు మాత్రము విక్రయమునకు దొరకుచున్నవి. కాగితము కరవైనందున నూతనప్రచురములు వచ్చుటలేదు. ఇదివరలో ప్రచురించినవానికికూడ ధర పెంచినారు.

**7. ప్రకృతి ధర్మగ్రంథమాల:** ఈ సంస్థతరఫునకూడ ఒక ఆదర్శగ్రంథమాల స్థాపింపదలచినాను

